

# రాజకీయశాస్త్రము

మంతెన సుబ్బరాజు

ప్రకటనకర్తలు

నమ్మాళ్వార్స్

పోస్టు బాక్సు ౨౫౧

మద్రాసు

౧౯౩౭

# రాజకీయశాస్త్రము

గ్రంథకర్త:
మంతెన సుబ్బరాజు, బి. ఏ; బి. ఎల్.

నమ్మాళ్వార్స్
౨౧, స్ట్రాటన్ ముత్యామొదలివీధి,
పోష్టుబాక్సు నెం ౨౫౧, మద్రాసు.



౧౯౩౮
1938

వెల ఆరు అణాలు
లేక ఒక షిల్లింగు.

# విషయసూచిక

రాజకీయశాస్త్రము : మొదటిభాగము



రాజకీయశాస్త్రము : రెండవభాగము



రాజకీయశాస్త్రము : మూడవభాగము

# రాజకీయశాస్త్రము

( మొదటిభాగము )



౧

## రాజకీయశాస్త్రమనగానేమి?



రాజకీయశాస్త్ర మనగా రాజ్యమునకు సంబంధించిన శాస్త్రము. అది రాజ్యతత్త్వమును గూర్చి చర్చించి దాని మూలసూత్రములను నిర్ణయించును. రాజ్య మనగానేమి ? దాని యుత్పత్తి యెట్టిది ? అది యె ట్లభివృద్ధిగాంచెను ? దాని ముఖ్యాంగము లెట్టివి? దాని యుద్దేశ్యమేమి ? మొదలగు ప్రశ్న లనేక మిం దుత్పన్నము లగుచున్నవి. ఈప్రశ్నలకు తగిన సమాధానము లొసంగుటయే, రాజకీయశాస్త్రముయొక్క ప్రధానోద్దేశ్యము. రాజ్యమునందు ప్రజలహక్కు లెట్టివో, ప్రభుత్వముయొక్క యధికారము లెట్టివో, వాటికిగల సంబంధమెట్టిదో యీవిషయములను గూర్చి రాజకీయశాస్త్రము పూర్తిగా విచారణ చేయవలసియున్నది.

రాజ్యమను ఈమహాసంస్థ భగవంతునిసృష్టిలో ఒక్క మానవజాతియందే గానబడుచున్నది ; మరియే యితర జంతుసంఘములందునను గోచరించుటలేదు. ఆహార

నిద్రామైథునములందును, కామక్రోధాదిగుణములందును మానవునకును, తక్కిన జంతువులకును నెట్టి తారతమ్యమును లేదు. మానవుడు తన జీవితవిధానమును రాజ్యశాసనములకు లోబడి యేర్పరచుకొనవలసియున్నది. సంపూర్ణమగు స్వేచ్ఛకు తావులేదు; అడుగడుగునకు రాజ్యశాసనములకు లొంగి తిరుగుచుండవలయును: ఆ శాసనముల నుల్లంఘించిన యెడల శిక్షార్హుడగుచున్నాడు. ఇక జంతువు లన్ననో, సంపూర్ణస్వేచ్ఛ ననుభవించుచు, ప్రకృతియందు తమ యిచ్ఛవచ్చినరీతిని సంచరించగలవు. అవి యొకరి యాజ్ఞకు లోబడవు; ఒకరి యధికారమును మన్నించవు. మనుష్యులకును, జంతువులకును జీవితమునందు గల గొప్పభేద మిదియే. ఇందువల్లనే గ్రీసుదేశపు రాజకీయశాస్త్రజ్ఞులకు మూలపురుషు డనదగు అరిస్టాటిల్ పండితుడు మానవుని 'రాజకీయపుజంతువు' అని వర్ణించియున్నాడు. ఈసాంఘికపరిపాలనను, మానవులు కుడిచి కూర్చుండలేక తెచ్చిపెట్టికొన్న గుదిబండయని వాదించు వ్యక్తిస్వాతంత్ర్యవాదులు కొందరున్నారు. ఆ సంగతి తరువాత పరిశీలింతము.

మానవసంఘమును ఈయధికారవిధేయతలే యితర జంతుసంతతులనుండి వేరుజేయుచున్నవి. ఈ యధికారము గలవారే ప్రభుత్వము; ఈయధికారమునకు లోబడువారే ప్రజలు. ఒకపరిపాలన యేర్పడవలెనన్న యొక యధికారమును, అందులకు లోబడిన నడవడియు అవసరము. ఇట్టి యధికారవిధేయత లున్నచోట పరిపాలన యనునది యున్నట్లే. దీనినిబట్టి చూచిన ఈ

ప్రపంచమున మానవజాతి యెంతవరకు విస్తరించి యున్నదో, అంతవరకు నేదో యొకవిధమగు పరిపాలన అమలునందున్నట్లు మన కిప్పుడు గోచరించును. ప్రభుత్వములు ప్రపంచమంతట నొకేరూపముతో లేకపోవచ్చును. నిజమునకు భిన్నభిన్న దేశములందు ప్రభుత్వములు భిన్నభిన్నరూపములను దాల్చి వర్తిల్లుచున్నవి. రాజకీయశాస్త్రము ప్రభుత్వవిభేదము లన్నింటిని సమగ్రముగా చర్చించి సమన్వయము చేసి, యందలి ముఖ్యసూత్రములను నిర్వచింపవలెను.

అదియును గాక, ఏదో యొక కాలమును తీసికొని అప్పటి వివిధరాజ్యములను గూర్చి చర్చించినంత మాత్రమున రాజకీయశాస్త్రముయొక్క పని పూర్తిగానేరదు. నేటిరాజ్యము లొకనాడు హఠాత్తుగా వెలసినవి గావు. అవి దినదినప్రవర్ధమానములు. అవి చరిత్రయొక్క ప్రాథమికదశలో మానవజాతితో బుట్టి, కాలానుగుణముగా వృద్ధినిబొందుచు, నేటి బలవత్తరజాతీయరాజ్యము లైనవి. రాజ్య మిప్పటి కెన్నియో యవస్థల గడచిన దని చెప్పుటకు చరిత్రయే సాక్షి. పురాతనకాలపు తిరుగుడు గుంపులలో గానవగు మోటుకట్టుబాటులను, నేటి జాతీయరాజ్యముల వైఖరిని పోల్చి చూచిన రాజ్యమెంతటి యభివృద్ధి గాంచినదో తెల్లము కాగలదు. కావున రాజ్యముయొక్క యుత్పత్త్యభివృద్ధులను గూర్చి రాజకీయశాస్త్రమున మనము చర్చింపవలసియున్నది. నిజముగా రాజ్యముయొక్క పునాదిని కనుగొనుట యనునది దుస్సాధ్యమైన విషయమే. స్టీఫెన్ లీకాక్ అను పండితు

యున్నట్లు, మానవు లెప్పుడు మాట్లాడనేర్చి రనుప్రశ్నకు సమాధాన మిచ్చుట యెంతటి కష్టమైనపనియో, మానవులు రాజ్యము నెప్పుడు స్థాపించి రనుప్రశ్నకు సమాధాన మిచ్చుటకూడ అంతటి కష్టమైన పనియే. అట్లని తత్ప్రయత్నమే మానుకొనుట మందబుద్ధి యనిపించుకొనును. చరిత్ర నాధారముగా గొని, సాధ్యమైనంతవరకు, రాజ్యముయొక్క యుత్పత్త్యభివృద్ధులను గూర్చి రాజకీయశాస్త్ర మొక నిశ్చయమునకు రావలసియున్నది. సంఘ మభివృద్ధి గాంచినకొలదిని రాజకీయసంస్థలును వృద్ధిపొందుచుండును. సంఘము గాని, నాగరికత గాని యొక్కనాటి వ్యవహారములు గావు; అవి కాలవాహినితో నడచుచుండును. వాటితో రాజకీయశాస్త్రమును నడచుచుండును.

రాజకీయశాస్త్ర మిట్టి దని నిర్ధారణచేయుటకు ముందు, మన మొకసంగతి జాగ్రతగా గమనింపవలసియున్నది. రాజకీయశాస్త్రమునకు, కొన్ని యితరశాస్త్రములతో చాల దగ్గరసంబంధ మున్నది. మన ప్రస్తుత చర్చయందు కేవలము అట్టి యితరవిద్యలకు సంబంధించిన విషయములు రాకుండ కట్టుబాటు చేసికొనవలయును.

రాజకీయశాస్త్రమునకును చరిత్రకును గల సంబంధము నిజముగా విడదీయుటకు వీలుగానట్టిది. చరిత్రయందు ప్రభుత్వములను గూర్చిన విషయము రాకతప్పదు. రాజకీయశాస్త్రమున మానవసంఘముయొక్కయు, వారి ప్రభుత్వములయొక్కయు చరిత్ర కొంతవరకు అవసరమగుచున్నది. చరిత్రయే లేకున్న రాజకీయశాస్త్రమును

ఉండియుండ నేరదు. చరిత్రయందు చిత్రింపబడిన రాజ్యాంగవిషయముల గ్రహించి, రాజకీయశాస్త్రము తన సిద్ధాంతముల నేర్పరచుచున్నది. చరిత్రయు రాజ్యపరిపాలనా విషయములను వదలివేసినయెడల తన ప్రాముఖ్యమును చాలవరకు కోల్పోవుచున్నది. పైన తెల్పిన విధముగా మానవజాతి యాధిక్యత రాజకీయసంస్థలపై నాధారపడియున్నది. అయితే, యీరెండు విద్యలకును గల భేదము కూడ చాల స్పష్టముగానే యున్నది. ఆదినుండియు మానవజాతి నడవడికయందు జరిగిన సర్వవిషయములను పూసగ్రుచ్చినట్లుగా మనకు జెప్పుటయే చరిత్రయొక్క విధి. ఆవిషయముల తత్వవిచారణతో దాని కెట్టిజోక్యమును లేదు. రాజకీయశాస్త్రము చరిత్రయందు లిఖింపబడిన రాజ్యవిషయములను మాత్రమే తీసికొని, వాటి తత్వమెట్టిదో, అవి యేసూత్రములపై నాధారపడియున్నవో, అవి యేల యట్లుండవలయునో అను చర్చకు గడంగును. అంతియేగాని చరిత్రయందలి మతములు, యాచారములు, వృత్తులు, సంస్కరణలు, యుద్ధములు, యొడంబడికలు, విప్లవములు మొదలుగా గల గాధలతో రాజకీయశాస్త్రమున కెట్టి ప్రసక్తియు లేదు.

తరువాత ఆర్థికశాస్త్రమునకును, రాజకీయశాస్త్రమునకును గల సంబంధమును మనము గ్రహింపవలసియున్నది. ఆర్థికశాస్త్రము మానవు డర్థమును గడించు మార్గములను గూర్చి చర్చించునట్టిది. అర్థ మెట్లుత్పత్తి యగుచున్నదో, అది సంఘమునం దెట్లు విభజింపబడుచున్నదో, ఆయుత్పత్తియు విభజనయు యేసిద్ధాంతము

లపై ఆధారపడియున్నవో అనువిషయముల విమర్శించుట దానికి ముఖ్యము. ధనముయొక్క యుత్పత్తియు, విభజనయు చాలవరకు ప్రభుత్వ మవలంబించు విధానముపై నాధారపడియుండును. ఒక దేశముయొక్క యార్థికపరిస్థితులు ఆదేశమున వర్తించు రాజకీయ సిద్ధాంతములను బట్టి యుండును. అట్లే ప్రభుత్వపరిస్థితులును చాలవరకు ఆర్థికస్థితిగతులపై నాధారపడియుండును. అదియును గాక, నేడనేకపరిశ్రమలు వ్యాపారములు ప్రభుత్వముచే నిర్వహింపబడుటను, లేక ప్రభుత్వపు అజమాయిషీలో ఉండుటను మనము చూచుచున్నాము.

మూడవది రాజ్యాంగచరిత్ర యనునది. ఇది కేవలము రాజకీయశాస్త్రమున నొకభాగ మనియే యెంచవచ్చును. రాజ్యాంగచరిత్ర యనగా నేదో యొక దేశపు రాజ్యవిషయములను గూర్చి చరిత్రధోరణిలో జెప్పునట్టిది. రాజకీయశాస్త్రమ ట్లేదో యొక దేశపురాజ్యమునకు కట్టుబడక, ప్రపంచమున నున్న రాజ్యము లన్నిటి విషయ మెత్తుకొని, యందు గల భేదములను గుర్తించుచు, సామ్యములను పొందుపరచుచు, తుదకు వాని మూలసూత్రముల సిద్ధాంతమునకు గడంగును.

అంతర్జాతీయనిర్ణయములతో రాజకీయశాస్త్రమునకు సంబంధము లేదని కొందరు పండితుల యభిప్రాయము. అంతర్జాతీయనిర్ణయము లా యారాజ్యముల యిష్టాయిష్టములపై నాధారపడియున్నవగుటచే వానికి ఇందు తావులేదని వారి వాదన. లెస్సగా నాలోచించి చూచినచో, ఈవాదము సరియైనది కాదని మనకు

తెల్లము కాగలదు. అన్ని రాజ్యములపై నధికారము చలాయించగల సంస్థ ప్రపంచమున నిప్పటి కేదియు నేర్ప డకపోయినప్పటికిని ఒకరాజ్యమునకును, మరియొకరాజ్య మునకును మధ్య నేర్పడిన యాచారములు, యొడంబడి కలు సామాన్యముగా గౌరవింపబడుచునే యున్నవి. విషమపరిస్థితు లేర్పడిన గాని యొకరాజ్యము యితర రాజ్యములతో తన కున్న యొడంబడికల నుల్లంఘింప బూనదు. అంతర్జాతీయనిబంధనలను గౌరవించుటకు, కేవలము రాజ్యముయొక్క నీతిపరత్వమే కారణము గాదు. అట్టి యుల్లంఘనవల్ల గొప్ప ముప్పు సంభవింప వచ్చును. అవతల రాజ్యము యొడంబడికను నిలువబెట్టు టకు యుద్ధమును ప్రకటింపవచ్చును. తదితర రాజ్యములు యుల్లంఘించిన రాజ్యముపై తప్పువెట్టి తమ యసమ్మతిని వెల్లడింపవచ్చును. అటు యుద్ధముచేయుటకు గాని, యిటు పరపతి పోగొట్టుకొనుటకు గాని, యేరాజ్యమును సిద్ధ పడదు. నిజముగా నేటికాలమున యేదేశము గాని తన యిచ్చకువచ్చినరీతిని సంచరించుటకు వీలులేదు. బ్లంట్స్లీ యనుపండితుడు బయట యితరరాజ్యముల హక్కులకును, లోపల ప్రజల ప్రధానమగు హక్కులకును ప్రతిరాజ్యమును తలయొగ్గవలయునని యభిప్రాయపడుచున్నాడు. న్యాయ శాస్త్రముయొక్క దృష్టిలో ఈహక్కులు రాజ్యాధి కారమునకు నిజమగు హద్దులు గాకపోవచ్చును. కాని అంతమాత్రమున వానికి రాజకీయశాస్త్రమున స్థానము లేదనుట గొప్పపొరపాటేయగును. ప్రజల హక్కులను ప్రభుత్వము త్రోసివేసిన యెడల నిజముగా శాసనరీత్యా

ప్రభుత్వమును శిక్షించు నధికారి లేదు. అనగా, ప్రభుత్వమున కెదురు ప్రజలకు హక్కు లనునట్టివి లేవన్నమాట. కాని, యేప్రభుత్వముగాని ప్రజలహక్కుల నట్లు జూచునా? ఆహక్కులను గౌరవించుటకు కారణము కేవలము ప్రభుత్వముయొక్క మంచితనము కాదు. ప్రజలలో విప్లవము బయలుదేరి ప్రభుత్వమును తలక్రిందు చేయునను భయముకూడ నున్నది. ప్రజలహక్కులను గూర్చిన విచారణ రాజ్యశాస్త్రమున కూడదందురా? అట్లే, అంతర్జాతీయనిర్ణయములును రాజకీయశాస్త్రమున నొక ముఖ్యమగు ప్రకరణమే యని భావింపవచ్చును.

మన మిప్పుడు రాజకీయశాస్త్రవిషయమును గూర్చి యొక్కవాక్యమున సమగ్రముగా దాని భావమును వెల్లడించుటకు ప్రయత్నింతము. రాజ్యముయొక్క ఉత్పత్త్యభివృద్ధులను గూర్చి చర్చించునట్టియు; దాని తత్త్వమును విచారణ చేసి ప్రభుత్వముయొక్క ముఖ్యసూత్రముల సిద్ధాంతము చేయునట్టియు శాస్త్రము రాజకీయ శాస్త్రము.

---

## ౨

## రాజ్యమనగా నేమి?



రాజ్య మనుశబ్దమునకు గల సామాన్యార్థములకును, దాని శాస్త్రీయమగు అర్థమునకును చాల భేద మున్నది. జనసామాన్యమున, రాజ్యమను పద—

మెట్టి యర్థనియమమును లేక, ఒక్కొక్క సందర్భమున నొక్కొక్క భావము స్ఫురించునట్లుగా నుపయోగింపబడుచున్నది. మనము సామాన్యముగా చంద్రగుప్తుని రాజ్యము చాల విశాలమైనదని యందుము. ఇచ్చట రాజ్య మనగా ఆతడు పరిపాలించిన దేశమని యర్థమగుచున్నది. మరియు మన మొక ప్రజారంజకమగు పరిపాలనను తిలకించినప్పుడు రామరాజ్యమువలె నున్నదని చెప్పుట సామాన్యము. ఇచ్చట రామరాజ్య మనగా మనభావము రామునిపరిపాలన యని. అదియునుగాక, శబ్దార్థమును బట్టి చూచిన రాజ్య మనగా ఒకరాజు పరిపాలనక్రిందనున్న దేశమని స్ఫురించుచున్నది. ఈకడపటి అర్థమును బట్టి చూచినచో రాజులేని అమెరికాసంయుక్తరాష్ట్రములు, ఫ్రాన్సు మొదలగు దేశములు రాజ్యములుగావని చెప్పవలయును. రాజకీయశాస్త్రమున రాజ్యమునకు పైన పేర్కొనబడిన సామాన్యార్థములకంటె నెక్కుడు బాహుళ్యమగు అర్థ మీయబడుచున్నది.

స్టీఫెన్ లీకాక్ అను గ్రంథకర్త తన గ్రంథమున రాజ్య మేర్పడుటకు నాలుగు పరికరము లవసరమని వ్రాయుచున్నాడు. (౧) సంఘము (౨) దేశము (3) పరిపాలన (౪) స్వాతంత్ర్యము. ముందుగా రాజ్య మనునది యేర్పడుటకు సంఘ ముండవలయును. సంఘములేనిచోట రాజ్య ముండనేర దని వేరుగా చెప్పనవసరములేదు. రెండవది, అట్టి సంఘ మొకదేశమును ఖాయముగా నాక్రమించుకొని యం దుండవలయును: ఏదేశమునకును చెందని యొక తిరుగుడుగుంపునకు రాజ్యార్హత యుండ

నేరదు. లీకాక్ పండితుని యీనిర్వచనము నేటిరాజ్యము లకున్ వర్తించును గాని, ఆదిమానవసంఘములకు వర్తించదు. మూడవది, అట్లొక దేశమును ఖాయముగా నాక్రమించుకొనియున్న, సంఘ మొకవిధమగు పరిపాలనకు కట్టుబడియుండవలయును. ఏపరిపాలనకు కట్టుబడియుండని యొక యరాజకసమూహము, దేశము నాక్రమించుకొన్నంత మాత్రమున రాజ్య - మనిపించుకొనజాలదు. నాల్గవది, అట్టి సంఘము స్వాతంత్ర్యమును కలిగియుండవలెను. అనగా, ఆసంఘము పరిపాలనయందు మరి యేయితర సంఘముయొక్క యధికారమునకు లోబడనిదై యుండవలెను. ఈనాల్గు లక్షణములు ఎందిమిడియుండునో అచ్చట రాజ్య మేర్పడుచున్నది. ఇందేది లోపించినను రాజ్యము కలుగనేరదు. కావున, రాజకీయశాస్త్రమున రాజ్య మనగా, ఒకదేశమును ఖాయముగా నాక్రమించుకొని, స్వాతంత్ర్యముగల ఒకపరిపాలనకు కట్టువడియుండు మానవసంఘము.

ఈసందర్భమున మరికొందరి గ్రంథకర్తల నిర్వచనముల పరిశీలించుట యవసరము. "రాజ్య మనగా యొకానొకదేశమున శాసనబద్ధులై మెలగు ప్రజలని" వుడ్రూవిల్సన్ వ్రాయుచున్నాడు. ఇందు ప్రజలు, దేశము, పరిపాలన కలవు గాని, స్వాతంత్ర్యమును గూర్చిన నిశ్చయము లేదు. ధియడోర్ వుల్సీ తన రాజకీయశాస్త్ర మను గ్రంథమున రాజ్యము నిట్లు నిర్వచించుచున్నాడు:—"శాశ్వతమగు శాసనములచే ఒకానొక దేశమున తన యంగముల ద్వారా న్యాయమును పాలించు సంఘమే

రాజ్య మని పిలువబడుచున్నది.” ఈనిర్వచనమున పైన చర్చించిన నాల్గులక్షణములును గలవు. జాన్ ఆష్టిన్ అను యింగ్లీషుశాస్త్రజ్ఞు డిట్లు వ్రాయుచున్నాడు:—
“మరియొకరి యాధిక్యతను మన్నించని, నిశ్చయుడైన యధికు డొకసంఘమున యధికసంఖ్యాకుల మన్ననను మామూలుగా పొందుచున్నపుడు, యా యధికు డాసంఘమున సర్వాధికారి యగుచున్నాడు. ఆయధికునితో కూడిన ఆసంఘమే స్వాతంత్ర్యరాజకీయసంఘము.” ఆసర్వాధికారి యొక వ్యక్తి గావచ్చును, లేక కొందరి వ్యక్తుల సమూహము గావచ్చును.

రాజ్యము, సంఘము, ప్రభుత్వము అనుపదములకు దగ్గర సంబంధమున్నది. కాని వీటికి గల భేదముకూడ స్పష్టమే. సంఘ మను పదమున ఒకానొక దేశమునకు సంబంధించి యుండవలెనను భావములేదు. అది కొందరి మానవుల ప్రత్యేకసంఘము గావచ్చును, లేక విశ్వమానవసంఘము గావచ్చును. పరిపాలన యున్నను, లేకున్నను పదుగురు కలసి యున్న వారిని సంఘ మందురు. సాంఘికవిషయము లనగా సంఘముయొక్క వృత్తులు, మతము, పరిశ్రమలు, రాజకీయములు, విజ్ఞానము మొదలగున వన్నియు నని గ్రహింపవలయును. కావున, రాజ్య మను పదముకంటె సంఘ మను పదము బాహుళ్యమైనది. ప్రభుత్వమునకును, రాజ్యమునకును గల భేద మేమనగా ప్రభుత్వము రాజ్యాంగములలో నొకటి. రాజ్యపరిపాలనాధికారమును తాత్కాలికముగా ఎవరు నిర్వహించుచుందురో వారే ప్రభుత్వము.

# రాజ్యోత్పత్తి



రాజ్యముయొక్క ఉత్పత్తిని గూర్చి పలువురు పలుసిద్ధాంతముల చేసియున్నారు. ఈవిషయము అగాధమైనది. లోతుకు పోయిన కొలదిని కేవల మగమ్యగోచర మగుచుండును. రాజ్యముయొక్క పుట్టువు యిట్టిదని నిస్సంశయముగా వక్కాణించుటకు తగిన ఆధారము లేమియు గన్పట్టవు. అట్లని యిప్పటివరకు ఈసందర్భమున రాజకీయశాస్త్రజ్ఞులు చేసిన కృషి కేవలము వృధాయనుటకు వీలు లేదు. ఈసమస్యను పలువురు పలువిధముల తరచిరి : అందొక్కొక్కరికి ఒక్కొక్కవిధమగు అభిప్రాయము తోచెను. ఈవివిధాభిప్రాయములలో శాస్త్రజ్ఞులలో నధికసంఖ్యాకుల ఒప్పుదలను బడసినట్టిది చరిత్రాత్మకసిద్ధాంతమని పిలువబడుచున్నది. ఈ చరిత్రాత్మకసిద్ధాంతమును గూర్చి చర్చించుటకు పూర్వము త్రోసివేయబడిన ఇతరసిద్ధాంతము లెట్టివో, అవి యేకారణములచే త్రోసివేయబడినవో, తెలిసికొనుట యవసరము. అట్టి యితర సిద్ధాంతములలో (౧) సాంఘికాంగీకరణసిద్ధాంతము, (౨) భగవదంశసిద్ధాంతము, (౩) దౌర్జన్యసిద్ధాంతము ముఖ్యమైన వని చెప్పవచ్చును.

### ౧. సాంఘికాంగీకరణ సిద్ధాంతము.

ఈసిద్ధాంతము తొలుదొల్త క్రీ॥ శ॥ ౪, ౫ శతాబ్దులలో గ్రీకుదేశపు రాజకీయశాస్త్రజ్ఞులచే ప్రతిపాదితము

తదుపరి, ఏవిధముననైననేమి, దాదాపు ౧౮-వ శతాబ్ద్యంతమువరకు రాజకీయరంగమున ఇది తనప్రాముఖ్యమును నిలుపుకొనగలిగెను. దీని సారాంశ మెట్టిదనిన:— ఆదియందు మానవులు పరిపూర్ణమగు స్వేచ్ఛను గలిగి తక్కుంగల జంతువులవలెనే ప్రకృతియందు యథేచ్ఛగా సంచరించుచుండిరి. వారికి ప్రకృతిసిద్ధమగు నియమములు తప్ప ఇతర నిబంధనలేమియు లేవు. ఏవిషయమునం దైనను, ప్రతివ్యక్తియు తన స్వశక్తిపై నాధారపడవలసియుండెను. ఆదిమానవునియందు సంఘ మను భావమే లేదు. రాను రాను, ఈనియమరహితమగు స్వేచ్ఛావృత్తి యందు వెగటు జనించిన కారణముననేమి, లేక యట్టి పరిస్థితియందు తప్పనిసరిగా నేర్పడు అన్యోన్యకలహములు మితిమీరిన హేతువుచేత నేమి, మానవులు తమ ప్రకృతి సిద్ధమగు స్వేచ్ఛావృత్తిని విడనాడి సాంఘికపరిపాలన క్రిందకు రావలసిన వారైరి. ప్రతివ్యక్తియు ఇతరవ్యక్తు లందరితోను, వారు తమ తమ వ్యక్తిస్వాతంత్ర్యమును విడనాడి, సంఘముయొక్క ఏలుబడికి లోబడియుండు షరతు మీద, తాను నట్లు చేయుట కంగీకరించెను. ఈయంగీకరణ లేక యొడంబడిక, ప్రతివ్యక్తికిని సంఘమునందు గల యితరవ్యక్తు లందరితోను జరిగెను. ఇదియే రాజ్యమునకు పునాది. ఇంతటితో ప్రకృతినియమములు పోయి మానవనిబంధనలములులోనికి వచ్చెను. మానవుడు, తన ప్రకృతిసిద్ధమగు వ్యక్తిస్వాతంత్ర్యమును త్యజించినందులకు ప్రతిఫలముగా తన కన్న యెన్నియోరెట్లు బలవత్తరమైన సంఘముయొక్క రక్షణను పొందెను. ఈయొడం

బడిక చిరస్థాయిగా నుండునట్టిది : దీనిని కాదనుట కిప్పు డెవ్వరికిని యధికారములేదు.

పై సిద్ధాంతము రాజ్యముయొక్క పుట్టువును నిర్ధారణచేయుటయే గాక, యది శాశ్వతమైనదనియు, దానికి మానవసంతతి కలకాలము బద్ధమే యనియు సమర్థించుచున్నది. ఈసిద్ధాంతము మధ్యకాలమున ఐరోపాదేశపు రాజులకును, క్రైస్తవమతాచార్యులకును మధ్య జరిగిన పోరాటములలో కొంతప్రాముఖ్యమును వహించెను. ఇక్కడ మనము గ్రహించవలసిన దేమనగా పైన తెల్పిన గ్రీకులవాదనకును, క్రైస్తవమతగురువుల ప్రచారమునకును గొంత వ్యత్యాసమున్నది. గ్రీకుల సిద్ధాంతమున ఒడంబడిక వ్యక్తికిని, సంఘమునకును జరిగెనని గాని అచ్చట రాజు ప్రసక్తియే లేదు. క్రైస్తవమతగురువులు అట్లుగాక, సంఘ మంతయు కలసి రాజుతో ఒడంబడిక చేసికొనెనని వాదించిరి, తదుపరి, ౧౭, ౧౮ వ శతాబ్దులలో అంగీకరణసిద్ధాంతము ఐరోపాఖండమును తారుమారుచేసెనని చెప్పవచ్చును. ఈసిద్ధాంతము నాధారముగా జేసికొని హాబ్సుపండితుడు నిరంకుశపరిపాలనను, లాక్ పండితుడు బాధ్యతాయుత రాజపరిపాలనను, రూసో పండితుడు ప్రజాపరిపాలనను సమర్థించిరి. ౧౬౮౮ వ సంవత్సరమున ఇంగ్లండులో జరిగిన విప్లవమును, ౧౮-వ శతాబ్దియొక్క నాల్గవపాదమున ఐరోపాఖండమును కలవరపెట్టిన ఫ్రాన్సుదేశపు తిరుగుబాటును, కొంతవరకీయంగీకరణ సిద్ధాంతముయొక్క ఫలితములే యని చెప్పవచ్చును.

అంగీకరణసిద్ధాంతము ప్రస్తుతకాలమున ఖండింప

బడి, త్రోసివేయబడినది. దీనిని ఖండించినవారి వాదము
లోని సూక్ష్మవిషయము లేవి యనగా: (౧) ఈసిద్ధాంతము
నకు చరిత్ర యం దెట్టి యాధారమును లేదు. ఎప్పుడు గాని,
యేవిధమగు పరిపాలన మెరుగని మానవులు, కొందర దే
ప్రథమముగా నొకచోట చేరి, తమ తమ వ్యక్తిస్వాతంత్ర్య
ముల పోనాడి, సంఘముయొక్క ఏలుబడికి లోబడుటకు తీరు
మానించినట్లు, చరిత్రయందు చిత్రింపబడియుండ లేదు. (౨)
అదియునుగాక, ఏకట్టుబాటు నెరుంగని, పశుప్రాయులొక
దినమున హటాత్తుగా రాజ్యస్థాపననుగూర్చి తీరుమానించి
రనుట కేవల మసంభవముగా తోచకమానదు. రాజకీయ
శాస్త్రమునకు పితామహు డనదగు, అరిస్టాటిల్ పండి
తుని వ్రాతల యం దెచ్చటను ఈసిద్ధాంతమునకు తావు
లేదు. కాని, ఈనిరాధారమైన సిద్ధాంతమే రాజకీయ
రంగమున దాదాపు ౧౭౦౦ సంవత్సరములు చలామణి
కాగలిగెను.

## ౨. భగవదంశ సిద్ధాంతము.

మానవజాతి శాంతి, భద్రతలు గలిగి సక్రమముగా
వర్ధిల్లుటకు సాంఘికపరిపాలన యవసరమని తలచి భగవం
తుడు ప్రజలను పాలించు నిమిత్తము రాజనువానిని ప్రతిష్ఠిం
చెననియు; అతడు నిరంకుశుడనియు; ఒక్క రాజపరిపాలనకు
మినహా, తక్కిన పరిపాలనావిధానము లన్నియు నీతి విరు
ద్ధము లనియు, ఈసిద్ధాంతముయొక్క తాత్పర్యము. ౧౬,
౧౭-వ శతాబ్దములలో ఐరోపాఖండపు రాజులు సాగించిన
నిరంకుశపరిపాలనను సమర్థించుట కీసిద్ధాంతము తయారు
చేయబడినది. ఇది, కేవల మధికారగర్వాంధులగు రాజులు

తమ కఠినచర్యలను సమర్థించుట కల్లిన యల్లిక యగు టచే, దీని కెట్టి యాధారమునులేదు. ఆకాలమున జన సామాన్యమున బయలుదేరిన ప్రజాపరిపాలనాభావముల నరికట్టవలె నను తలంపుతో, నిరంకుశప్రభువు లీమార్గ మును బట్టిరి. తుద కీసిద్ధాంతము వారికోర్కెను నెర వేర్చకపోగా, అదివరకే నిరంకుశపరిపాలనయన్న, ప్రజల యం దేర్పడిన ద్వేషాగ్నికి ఆజ్యమై, విప్లవముల మరింత తీవ్రముగా ప్రజ్వలింపజేసెను. నేటి రాజకీయప్రపంచమున ఈవాదము పూర్తిగా రూపు మాసెనని చెప్పవచ్చును.

3. దార్ఢ్యసిద్ధాంతము.

మానవునిదార్ఢ్యమే, అనగా భుజబలమే, రాజ్య ముయొక్క ఉత్పత్తికి కారణభూత మని ఈసిద్ధాంతము యొక్క ఉద్దేశ్యము. ప్రథమమున బలవంతుడు దార్ఢ్య ముగా బలహీనులపై దాడిసల్పి, వారలను లోబరచు కొని, తనయధికారమును స్థాపించెను. తదుపరి, క్రమేణ యీచిన్నసంఘమే యితరసంఘములపై దండయాత్రలు చేసి జయించుటమూలముగా, పెద్దపెద్దరాజ్యము లేర్ప డెను. బలవంతుడు బలహీనులను పాలించుట ప్రకృతి ధర్మము.

ఈవాదమునందు కొంత సత్యము లేకపోలేదు. మొదట ఒక యధికార మేర్పడుటకు మానవుని దార్ఢ్య ము కొంతవరకు కారణభూత మనుటలో సందేహము లేదు. కాని, కేవలము బల మొక్కటియే ప్రభుత్వము నకు పునాదియనుట, కొంత అతిశయోక్తి కాకమానదు. ఆధునికకాలమున హెర్బర్టుస్పెన్సరు మొదలగు వ్యక్తి

స్వాతంత్ర్యవాదు లీదార్జన్యసిద్ధాంతము నొక రాద్ధాంతముగా జేసి, నేటిరాజ్యము లన్నియు దార్జన్యముతో కూడిన వగుటచే పాపభూయిష్ఠములనియు, వానిని అవశ్యము నాశనముచేసి వ్యక్తిస్వాతంత్ర్యమును స్థాపించవలెననియు ప్రబోధించుచున్నారు. నేటి సామ్యవాదులు ఈసిద్ధాంతమును మరింత తీవ్రముగా వెల్లడించుచు, ప్రస్తుతప్రభుత్వములను ఖండించుచున్నారు. జనసామాన్యము కష్టపడి సంపాదించిన యర్థము నేకొద్దిమందియో స్వలాభపరాయణు లనుభవించుటకు పన్నినపతకమే ప్రభుత్వమని వీరివాదన. వీరికి మూలపురుషుడు కారల్ మార్క్సు.

## ౪. చరిత్రాత్మక సిద్ధాంతము.

రాజ్యోత్పత్తిసమస్యను పరిష్కరించుటకు ఇటీవల రాజకీయశాస్త్రజ్ఞులు చరిత్రను పరిశీలించి చేసినసిద్ధాంతమే చరిత్రాత్మకసిద్ధాంత మని పిలువబడుచున్నది. ఈసిద్ధాంతము ప్రస్తుతకాలమున ఇంచుమించుగా రాజకీయశాస్త్రజ్ఞు లందరు నంగీకరించిరనియే చెప్పవచ్చును. చరిత్రపరిశోధనలవలన రాజ్య మొకనాడు మానవులు కనిపెట్టినది గాదనియు; అది యగమ్యగోచరమగు కాలగర్భమున సూక్ష్మరూపమున బయలుదేరి, దినదినప్రవర్థమానముగా వచ్చుచున్న యొక ప్రకృతిసిద్ధమగు సంస్థయనియు నిర్ధారణ చేయబడుచున్నది. అనగా సృష్టియందు మానవు లెప్పు డేర్పడిరో యప్పుడే వారిసాంఘికత్వమును తగుమాత్రముగా ఏర్పడెనని భావము. ప్రభుత్వ మొకనాడు మానవజాతి ఆలోచించి చేసిన సృష్టిగాదు. మానవునియందు భాష యేరీతిగా ఉత్పత్తియై

అభివృద్ధిగాంచుచున్నదో, అదేవిధముగా అతని సాంఘిక త్వమును ఏర్పడి ప్రబలమగుచున్నది. సంఘీభావము మానవప్రకృతియందే యిమిడియున్నది. రాజ్య మొకనాడు నిర్మింపబడి యమలులోనికి వచ్చినట్లుగా ఊహించుటయే ముందటి సిద్ధాంతులు చేసిన గొప్పపొరపాటు.

---

# ౪

# రాజ్యాభివృద్ధిక్రమము.

రాజ్యము నేటి యున్నతస్థితికి వచ్చుటకు పూర్వ మెన్నియో దశల గడచినదని చెప్పుటకు చరిత్రయే సాక్షి. తొల్లిటి తిరుగుడుగుంపునకును, నేటి మానవసంఘమున కును గల వ్యత్యాసము హస్తిమశకాంతర మనదగి యున్నది. కాని, యీగొప్పయభివృద్ధి కొక సరియైన క్రమము గనుపించదు. ఒక్కొక్కసంఘ మొక్కొక్క మార్గమున నడచినది. రాజ్యముయొక్కనడక ఆయా దేశకాలపరిస్థితులను బట్టియు, ఆసంఘముయొక్క ఆర్థిక మతాచారవిద్యాదిసంస్థలను బట్టియు నేర్పడుచున్నది. ఐనను రాజ్యాభివృద్ధియందు సర్వసామాన్యమగు కొన్ని ముఖ్యలక్షణములను గుర్తించవచ్చును.

పూర్వులలో ప్లాటో అను గ్రీకుపండితుడు మానవ సంఘమున ప్రభుత్వము తొలుదొలుత అభిజాత్యపరిపా లనగా ప్రారంభమై తరువాత క్రమముగా సైనికపరి పాలనగను, స్వలాభవర్గపరిపాలనగను, ప్రజాపరిపాలనగను,

నిరంకుశపరిపాలనగను మారెననియు; తుదకు నిరంకుశ పరిపాలన పోయి మరల ఆభిజాత్యపరిపాలన ప్రారంభమగు చుండెననియు; ఇట్లే రాజ్య మీపంచదశాచక్రమున తిరుగుచుండెననియు నభిప్రాయపడుచున్నాడు. ప్లాటోపండి తుని సిద్ధాంతమును అరిస్టాటిల్ పండితుడు ఖండించి మరి యొక విధముగా సిద్ధాంతీకరించెను :

["ప్రథమమున రాజపరిపాలన, తరువాత క్రమముగా స్వలాభవర్గపరిపాలన, నిరంకుశపరిపాలన, ప్రజాపరిపాలన యేర్పడుచుండెను."]

ఈక్రమము అరిస్టాటిల్ పండితుని కాలమునాటి గ్రీకుదేశపు పట్టణరాజ్యములకు వర్తించినను, ప్రపంచ మునగల యితరరాజ్యము లన్నిటికి వర్తించనేరదు.

నేటి అమెరికాసంయుక్తరాష్ట్రములవంటి యిటీవలి రాజ్యములు పూర్వ మొక గొప్పరాజ్యమునుండి విడిపోవుట మూలముగా నేర్పడిన వగుటచే నవి పూర్వపు రాజ్యముల నాగరికతావిశేషము లన్నిటిని కలిగియున్నవి. అదియునుగాక నాగరికతయందు వెనుకబడియున్న కొన్ని రాజ్యములు మిక్కిలి యభివృద్ధిగాంచిన ఇతరరాజ్యముల లోని రాజకీయసంస్థల నొకసారిగా తెచ్చిపెట్టుకొనుచున్నవి. ఇట్టి రాజ్యములను వదలివేసినయెడల, రాజ్యాభివృద్ధియందు సర్వసామాన్యముగా నీదిగువ దశలక్రమము గడచినదని చెప్పవచ్చును.

మొదటిదశ :—మానవులు ముఠాలు ముఠాలుగా ఉండి, సమిష్టిజీవనమును చేయుచుండిరి. వేటయే వారికి ముఖ్యమగువృత్తి. వేటాడి సంపాదించిన తినుబండార

మును ముఠాయంతయు సమష్టిగా అనుభవించుచుండెను. ముఠాయందు వివాహనియమము లేదు. ముఠాయందు నాయకుని యధికారముండియు లే నట్లుండెను. సంఘము సామాన్యముగా అవసరములనుబట్టి యొకచోటనుండి మరియొకచోటికి కదలుచుండెడిది.

రెండవదశ :—ఈదశయందు మానవసంఘము దేశసంచారమును వదలి యొక ప్రత్యేకప్రదేశము నాక్రమించుకొని నిలకడజెందెను. జీవనోపాధికి వేటకుతోడు వ్యవసాయముకూడ ఏర్పడెను. వివాహ మమలులోనికి వచ్చెను. సంఘము కుటుంబములుగా విభజింపబడెను. ప్రత్యేకముగ ఆస్తు లేర్పడెను. ప్రభుత్వమునకు బల మధికమాయెను. ఆస్తికై ఒకసంఘమునకును మరియొక సంఘమునకును యుద్ధములు జరుగుచుండెను.

మూడవదశ:—ప్రతిరాజ్యమునందును సామ్రాజ్యకాంక్షయు, వర్తకాభిలాషయు అధికమాయెను. దీనికి పర్యవసానముగా బలముగల రాజ్యములు బలహీనములగు రాజ్యములను జయించి సామ్రాజ్యములను స్థాపించుటయును, గొప్పగొప్పవర్తకసంఘములు బయలుదేరి జయింపబడిన దేశముల కొల్లగొట్టుటయును జరిగెను. సామ్రాజ్యమును, వర్తకమును కాపాడుటకు రాజ్యమున కత్యధికబల మవసరమాయెను. సైన్యములు హెచ్చెను. మారణయంత్రములు మొదలుగాగల యుద్ధసామగ్రి మిక్కిలిగా తయారుచేయబడెను. ఒకప్రక్క బలముగలిగి ఐశ్వర్యములతో తులదూగు రాజ్యములును, మరియొక ప్రక్క స్వాతంత్ర్యమును గోలుపోయి బానిసతనమును

మునిగిన బీద దేశములును; ఒకప్రక్క ధనము నత్యధిక ముగా సంపాదించి మితిలేని భోగముల ననుభవించు వర్తకసంఘములును, మరియొకప్రక్క కాయకష్టము చేసియు కుటుంబపోషణ జేయజాలక సకలకష్టముల నను భవించు కార్మికులును ఏర్పడిరి.

నాల్గవదశ:—నేడు జరుగుచున్న దశ యిదియే. ప్రజాలోకమునందు గొప్పజాతీయభావ ముద్భవించెను. స్వాతంత్ర్యమును కోలుపోయిన దేశము లన్నియు తిరిగి తమస్వాతంత్ర్యమును స్థాపించుచుండెను. ప్రజలు ప్రభుత్వ విషయములం దంతకంతకు నెక్కువగా పాల్గొనుచుండిరి. కార్మికసంఘములు బయలుదేరి వర్తకసంఘములతో సమానమగు హక్కులకును, సమానమగు లాభములకును, సమానమగు గౌరవములకును పోరాడుచున్నవి. జన సామాన్యమునకు యుద్ధములన్న యసహ్యాభావమును, భయమును ఏర్పడెను. శాశ్వతశాంతికై రాజ్యము లన్నియు నెదురుజూచుచున్నవి. విశ్వమానవసామ్రాజ్య స్థాపనను గూర్చి ప్రబోధము జరుగుచున్నది.

---

౩

# రాజ్యస్వరూపము

## ౧. ప్రజలు, పౌరసత్వపు హక్కులు.

సంఘము, దేశము, ప్రభుత్వము, స్వాతంత్ర్యము —రాజ్యమునకు ముఖ్యలక్షణములని లోగడ మనము తెలిసి

కొంటిమి. ఇప్పుడు వీనిలో నొక్కొక్కదానిని గూర్చి ప్రత్యేకముగా విచారించెదము. ఇందు మొదటిది సంఘము. సంఘములోనివారిని ప్రజలనియు, పౌరులనియు కూడ నందురు. ఒకప్పుడు సంఘమునగల వ్యక్తు లందరు పౌరులుగా పరిగణింపబడక, కొన్ని తరగతు లేర్పడియుండెను. నే డట్టి విభేదము సామాన్యముగా నాగరికతారాజ్యము లం దెచ్చటను లేదనియే చెప్పవచ్చును. పౌరు డనగా, పౌరసత్వపుహక్కులు గలవాడని యర్థము. ఈహక్కులను పొందుటకు నేటి సంఘములయందు ప్రతివ్యక్తియు నర్హుడే యగుచున్నాడు. ఈయర్హతను గూర్చి విచారించుటకు ముందు పౌరసత్వపుహక్కు లనగా నెట్టివో తెలిసికొనుట యవసరము. అందు ముఖ్యమైనవి:—

(౧) వాక్స్వాతంత్ర్యము:—ఏవిషయమునుగూర్చిగాని నిర్భయముగా తనయుద్దేశ్యమును వెల్లడించుటకు ప్రతిపౌరునకు హక్కు గలదు. ఇతరులు వెల్లడించిన యభిప్రాయములను న్యాయబుద్ధితో తనకు తోచినవిధముగా విమర్శింపవచ్చును.

(౨) సభాస్వాతంత్ర్యము :— ఒకన్యాయసమ్మతమైన కార్యమును సాధించుటకు పదుగురుకలసి యొక సంఘముగా నేర్పడవచ్చును. ఆవశ్యకములు సభలు జరుపవచ్చును. అందు వారియుద్యమసూత్రములను, విధానములను నిర్ణయించుకొనవచ్చును.

(౩) వృత్తిస్వాతంత్ర్యము:—ప్రతిపౌరుడును ధనార్జనవిషయమున నీతివిరుద్ధముగాని యేవృత్తిని అయినను అవలంబింపవచ్చును.

(౪) మతస్వాతంత్ర్యము:—ఎవరి ఇచ్ఛవచ్చిన మతమును వారు స్వీకరించవచ్చును: భక్తి, ప్రార్థన మొదలుగాగల ఆధ్యాత్మికవిషయములందు ప్రతి పౌరుడును పరిపూర్ణస్వాతంత్ర్యమును కలిగియున్నాడు.

(౫) సమానత్వము :—శాసనముయొక్క దృష్టిలో పౌరు లందరు సమానులు : జాతిమతభేదములు గాని స్త్రీపురుషవిచక్షణగాని పాటింపబడగూడదు.

(౬) సమానార్హతలు :—ప్రభుత్వోద్యోగములకు, అధికారములకు సంబంధించిన అర్హతలయందు జాతిమతభేదములు, స్త్రీపురుషభేదములు ఉండగూడదు.

(౭) వాసస్వాతంత్ర్యము :—ఏపౌరుడుగాని దేశమునం దెచ్చోటికైనను వెళ్ళవచ్చును: ఎచటనైనను నివసించవచ్చును; ఆస్తిని గడించవచ్చును.

(౮) ఆత్మసంరక్షణస్వాతంత్ర్యము:—ప్రతి పౌరునకును ఆత్మసంరక్షణార్థము తగిన ఆయుధముల ధరించుటకు హక్కుగలదు.

ఇట్టివే మరికొన్నిహక్కులను జూపవచ్చును.

పౌరసత్వపుహక్కులస్వభావమును గూర్చి గొప్ప వాదోపవాదములు గలవు. ప్రభుత్వము, తనశాసనముల ద్వారా పౌరులకు ప్రసాదించిన హక్కులే పౌరసత్వపు హక్కులనియు, ప్రభుత్వము ప్రసాదించనట్టిహక్కులు ప్రజల కుండనేరవనియు కొందరి శాస్త్రజ్ఞుల వాదము. అట్లుగాక మరికొందరు పౌరసత్వపుహక్కు లనునట్టివి ప్రభుత్వశాసనముల కతీతము లనియు, అవి ప్రజలకు జన్మతః కలుగునట్టి వనియు, అట్టిహక్కులసందర్భమున

ప్రభుత్వ మెప్పుడును జోక్యము కలుగ జేసికొనగూడ దనియు సిద్ధాంతీకరించుచున్నారు. పౌరసత్వపుహక్కులు కేవలము ప్రభుత్వముయొక్క ప్రసాదమని యెంచిన యెడల అట్టిహక్కులను రద్దుచేయుటకు గాని, సవరణ చేయుటకు గాని ప్రభుత్వమునకు హక్కుండును. లేక అవి ప్రజల జన్మహక్కులనియు, అవి ప్రభుత్వము మంజూరుచేసినవి కావనియు నంగీకరించిన యెడల ప్రభుత్వమునకు వానిని రద్దుచేయు నధికార ముండ నేరదు. ఈ విషయమును ముందు ప్రభుత్వాధికారములను గూర్చి చర్చించు సందర్భమున విపులముగా విమర్శించెదము. ప్రస్తుతము పౌరసత్వపుహక్కు లనునట్టివి కొన్ని గలవని తెలిసికొనిన జాలును.

సంఘమునందు గల వ్యక్తు లందరికిని పౌరసత్వపు హక్కులను పొందుట కర్హతగలదా? నే డీప్రశ్నకు సమాధానము కలదనియే. పూర్వ మొకప్పుడు సంఘము నందు పౌరులనియు, బానిసలనియు రెండుతెరగుల వ్యక్తు లుండెడివారు. పౌరు లనగా పౌరసత్వపుహక్కులు గల వారు. బానిస లనగా అట్టిహక్కులు లేనివారు. ఒక ప్పుడు స్త్రీలును బానిసలవలెనే పరిగణింపబడుచుండిరి. రాను రాను కొంతకాలమునకు సంఘము బానిసతన మును నిర్మూల మొనర్చి, వ్యక్తు లందరికిని పౌరులగుట కర్హతను ప్రసాదించెను. కొన్నిరాజ్యములం దిప్పటికిని అనాగరికజాతులయెడ నీయన్యాయము చలామణి యగుచు న్నను మొత్తముమీఁద నాగరికత గల రాజ్యము లన్నిటి యందును ప్రతివ్యక్తియు పౌరుడనియే చెప్పవచ్చును.

తాత్కాలికముగా వ్యక్తి తనపౌరసత్వపుహక్కులను కొన్ని కారణములచే గోల్పోవచ్చును. ఉదా॥ నేరములు చేసి శిక్షింపబడినవారును, న్యాయస్థానములచే దివాలా కోరులుగా నిర్ణయింపబడినవారును, పౌరసత్వపుహక్కులకు దూర మగుచున్నారు. తరువాత, యుక్తాయుక్తజ్ఞానములేని యల్పవయస్కులు, చంచలబుద్ధులు మొదలగువారు కూడ ఈ హక్కుల కనర్హులు.

కాని, పైనతెల్పిన అనర్హతలు నిమిత్తమాత్రములే కాని శాశ్వతములు గావు. అల్పవయస్కుడు వయఃపరిపక్వము పొందుటతోడనే పౌరు డగుచున్నాడు. అట్లే చంచలబుద్ధులకు బుద్ధిస్థిమిత మేర్పడుటతోడనే యీహక్కుల కర్హత కలుగుచున్నది. నేరముచేసినవారికి శిక్షాస్మృతులయందు విధించిన కాలనిర్ణయము గడచిన పిమ్మటను, దివాలాకోరులకు ఋణవిముక్తి అయిన పిమ్మటను మరల వారికి పౌరసత్వపుహక్కు లేర్పడుచున్నవి. పౌరసత్వపుహక్కు లందరికిని యేర్పడియున్నను, లేకున్నను పొందుట కర్హతమాత్ర మందరికిని గలదు. కావున నేటికాలమున సంఘమునకును, పౌరులకును భేదము లేదనియే చెప్పవచ్చును.

ఏదైన నొకరాజ్యమున పౌరు డగుటకు మూడు మార్గములు గలవు. (౧) ఆరాజ్యమున పౌరులగు తల్లిదండ్రులకు జన్మించుట, (౨) ఆదేశమున నొకనిర్ణీతకాలము నివసించుట, (౩) ఆదేశమునందు ఆస్తిని సంపాదించుట. విదేశీయులు పైనతెల్పినవానిలో రెండు, మూడు మార్గముల ద్వారా యొకానొకరాజ్యమున

పౌరులు గావచ్చును. సాధారణముగా విదేశీయు లొక రాజ్యమున ప్రవేశించి నప్పుడు వారి కెట్టిహక్కులు నుండ నేరవు. కాని యట్టివారి విషయమున జూపవలసిన మర్యాదలు కొన్నిగలవు. ఈవిషయము అంతర్జాతీయ నిర్ణయములకు సంబంధించినది.

[మనము సామాన్యముగా మాట్లాడునప్పుడు ప్రజలు, జాతి అను రెండు పదములకును గల భేదమును సరిగా గుర్తించుటలేదు. రాజకీయములందు ప్రజలకును, జాతికిని చాల యర్థభేద మున్నది. ఉదాహరణముగా భారతదేశమును తీసికొనుడు. భారతప్రభుత్వమునకు లోబడి యీదేశమున పౌరసత్వపు హక్కులను కలిగి యున్నవారు మాత్రమే భారతప్రజలు. భారతప్రజలలో హిందువులు, మహమ్మదీయులు, సిక్కులు మొదలగు జాతు లనేక మున్నవి. ఈ జాతుల నన్నిటిని కలిపి ఉమ్మడిగా భారతజాతియని పిలుచుచున్నారు. భారతదేశమున పౌరసత్వపు హక్కులను గలిగియున్న భారతీయులేగాక, పరదేశములకు వలసపోయి యాదేశముల పౌరులైన భారతీయులుకూడ భారతజాతిరే యగుదురు. కాని భారత ప్రజలు కారు. ఏల ననగా, వారు భారతప్రభుత్వమునకు లోబడిన వారు కారు. ఒకజాతియంతయు నొకప్రజ కాకపోవచ్చును; అట్లే యొకప్రజ యంతయు నొకజాతి కాకపోవచ్చును. ఆంగ్లసామ్రాజ్యమున గల ప్రజలందరు నొక్కజాతిగాదు; అం దనేకజాతులవా రున్నారు. మనము ఆంగ్లప్రజలమే గాని, మనది ఆంగ్లజాతి కాదు. మరల ఆంగ్లజాతియంతయు ఆంగ్లప్రజలు కారు. అమెరికాసంయుక్తరాష్ట్రప్రజలు కూడ ఆంగ్లజాతికి సంబంధించినవారే. ప్రజ యనునది ప్రభుత్వముయొక్క సంబంధమును తెలుపును. జాతి యనునది కులము, సాంప్రదాయము, మతము మొదలగువానిని గూడియుండును.]

## ౨. దేశము.

ప్రత్యేకజాతి నివసించెడు సీమయని యర్థము. ఇందుల కుదాహరణముగా చైనాదేశమనిన, చైనాజాతివారు నివసించెడు సీమ. జపానుదేశ మనగా జపానుజాతివారుండు సీమ. బ్రిటన్ దేశమనగా బ్రిటిష్ జాతివారు నివసించెడు భూమి. రాజకీయశాస్త్రమున దేశమనగా ఒకానొక రాజ్యముయొక్క ఆక్రమణ యందున్న భూభాగమని యర్థము. అనగా ఆ రాజ్యముయొక్క అధికార మెంతవరకు భూమిపై చలామణియగునో అంత వరకును గల దేశ మంతయు ఆరాజ్యమునకు చెందిన దే యగుచున్నది. కావున రాజకీయశాస్త్రమున బ్రిటిష్ దేశ మనగా బ్రిటిష్‌జాతివారు నివసించెడి బ్రిటిష్‌దీవులే గాక కెనడా, దక్షిణాఫ్రికా, ఇండియా, ఆస్ట్రేలియా, మొదలగు బ్రిటిష్‌ప్రభుత్వమునకు లోబడిన సీమలన్నియు నని గ్రహించవలెను. ఒకరాజ్యముయొక్క దేశపుసరిహద్దు సముద్రమై నపుడు సముద్రతీరమునుండి యొక తుపాకిప్రేల్చిన దానిగుండు యెంతదూరము పోవునో అంత వరకుగల సముద్రభాగము కూడ ఆరాజ్యమునకే చెందుచున్నది. అట్లుగాక ఒకనది గాని, పర్వతముగాని సరిహద్దుగా నేర్పడి నపుడు దాని కిరుప్రక్కల నున్న రాజ్యములు ఆనదిని లేక పర్వతమును ఉమ్మడిఆస్తిగా నుంచుకొనును. ఇట్టి ప్రకృతిసిద్ధమగు సరిహద్దు లేనపుడు గుర్తుగా రాళ్ళను పాతి సరిహద్దు నేర్పచుచున్నారు. తరువాత దేశమునకు పైనున్న ఆకాశ మంతయును, దేశపు భూగర్భ మంతయును ఆరాజ్యమునకే భుక్తమగుచున్నది.

## ౩. ప్రభుత్వము.

రాజ్యముయొక్క పరిపాలనాధికారము తాత్కాలికముగా నెవరు నిర్వహించుచుందురో వారిని ప్రభుత్వమందురు. ఈపరిలనాధికారములను ముఖ్యముగా మూడు శీర్షికల క్రిందను విభజింపవచ్చును. (౧) శాసనముల జేయునట్టి యధికారము (౨) శాసనముల నమలు జరుపునట్టి యధికారము. (౩) శాసనముల ననుసరించి న్యాయ విచారణ జేయునట్టి యధికారము. ఈమూడు యధికారములును కలసి పరిపాలనాధికార మగుచున్నది. ఈమూడు అధికారములు ఒకవ్యక్తియందు గాని, సంఘమునందు గాని, లేక ముగ్గురు ప్రత్యేకవ్యక్తులయందు గాని ప్రత్యేక సంఘములందు గాని ఉండవచ్చును. నేడు నాగరికత గల రాజ్యము లన్నిటి యందును సాధారణముగా ఈమూడు అధికారములును మూడు ప్రత్యేకశాఖల వశము జేయబడుచున్నవి. అందు మొదటిదానికి శాసనసభ యనియు, రెండవదానికి కార్యనిర్వాహకవర్గ మనియు, మూడవ దానికి న్యాయస్థాన మనియు నామములు. ప్రభుత్వమనున దీమూడుశాఖలును కలియుటచే నేర్పడుచున్నది. ఉదాహరణముగా అంగ్లప్రభుత్వమును తీసికొని ఈ మూడుశాఖలను పరిశీలింతము. ఇందు శాసనాధికారము సుమారు ౧౨౦౦ మంది సభ్యులుగల పార్లమెంటు మహాసభయందున్నది. శాసనముల నమలుజరుపు భారము సుమారు ౨౫ గురు మంత్రులతో గూడిన సార్వభౌముని పైన వారి యుత్తరువులకు లోబడి వర్తించు పెక్కు ఉపశాఖల యుద్యోగస్థులపైన నున్నది. న్యాయవిచారణ

జేయుట కొక దానిపై నొకటిగా పెక్కుతరగతుల న్యాయ స్థానములు గలవు. బాహుళ్యమగు అర్థమున ఆంగ్లప్ర భుత్వ మనగా ౧౨౦౦ మంది సభ్యులు గల పార్లమెం టును, సార్వభౌముడు మొదలుకొని గ్రామోద్యోగి వరకు గల యనేకలక్షలకు మించిన యుద్యోగులతో నిండియున్న కార్యనిర్వాహకవర్గమును, అన్నితరగతుల న్యాయస్థానములును అని యెఱుంగవలయును. కాని, కొన్ని కొన్ని సందర్భములందు ప్రభుత్వ మను పద మింత కంటె క్షిప్తమగు నర్థమునం దుపయోగింపబడుచున్నది. ఆంగ్లప్రభుత్వము పార్లమెంటునకు బాధ్యత వహించి యున్న దన్నపుడు ప్రభుత్వ మనగా ఒక్క కార్యనిర్వాహక వర్గమునకే చెందుచున్నది. అదియునుగాక ప్రజలు ప్రభుత్వముపై దెచ్చు నభియోగములందు న్యాయస్థాన ము లిరుతెగలవారికి మధ్యవర్తిత్వము వహించుటచే ప్రభుత్వమునకు న్యాయస్థానములు కూడ దూర మగు చున్నవి. ఇచ్చట కూడ మనదృష్టిలో ప్రభుత్వ మనగా, నొక్క కార్యనిర్వాహకవర్గమే గాని మూడుశాఖలును కలిసి గాదు. ఇంతకంటె సంక్షిప్తమగు నర్థము కూడ నొకటి గలదు. లేబరుప్రభుత్వము, లిబరలుప్రభుత్వము అను నపుడు మనదృష్టియం దుండునది కేవలము మంత్రి వర్గమే కాని సార్వభౌముడు మొదలుకొని గ్రామోద్యోగి వరకు విస్తరించియున్న పెక్కుతరగతుల ఉద్యోగుల పటాల మంతయు గాదు. ప్రభుత్వ మనుపద మొక్కొక్క సందర్భమున ఒక్కొక్క అర్థమునం దుపయోగింప బడుచున్నది.

## ౪. స్వాతంత్ర్యము.

ఒక పరిపాలనగల మానవసంఘము రాజ్యమని పిలువబడుటకు స్వాతంత్ర్యమును గలిగి యుండవలయును. అనగా పరిపాలనావ్యవహారములయందు మరియొక సంఘమున కాసంఘముపై నెట్టి యధికారము నుండగూడదు. ఆసంఘము తనవ్యవహారములను చక్కబెట్టుకొనుటలో మరి యేయితర సంఘముయొక్క యధికారమునకు తల యొగ్గకూడదు. ఒకసంఘము మరియొక సంఘముయొక్క పరిపాలనాధికారమున కెప్పుడు లోబడెనో అప్పుడు మొదటిసంఘము రెండవసంఘమున నైక్యమయి పోవుచున్నది. కావున రెండుసంఘములును కలసి యొకటే రాజ్యమగుచున్నది.

మన మిప్పు డుదాహరణముగా కొన్ని సంఘములను గొని యీవిషయము పరిశీలింతము. ఆంగ్లసంఘమున పరిపాలన ఆంగ్లప్రభుత్వముచేతనే నిర్వహింపబడుచున్నది. ఆంగ్లప్రభుత్వముపై అధికారము చెలాయించగల వ్యక్తిగాని, సంఘముగాని ఈప్రపంచమున లేదు; అది సర్వస్వాతంత్ర్యమును గలిగి యున్నది; ఏమి చేయ దలచినను చేయగలదు. దాని నడతను ప్రశ్నించుటకు మరే సంఘమునకు అర్హత లేదు. స్వాతంత్ర్య మనగా నిట్టిది. ఆంగ్లసంఘమునకు దేశము, పరిపాలన, స్వాతంత్ర్యము గలవు. కనుక అది రాజ్య మన జెల్లుచున్నది. ఇట్లే ఫ్రెంచి, జర్మన్, యిటాలియన్, జపనీస్ మొదలగు సంఘము లన్నియు పరిపూర్ణత జెందిన రాజ్యములే.

తరువాత ఆంగ్లసామ్రాజ్యమున అధినివేశము

లనబడు కెనడా, దక్షిణాఫ్రికా, ఆస్ట్రేలియా దేశములస్థితి విచారింతము. ఈ దేశము లందు సంఘము, దేశము, పరిపాలన యను మొదటి మూడు రాజ్యలక్షణములును కల వని వేరుగా చెప్పనవసరము లేదు. నాల్గవదియగు స్వాతంత్ర్య మెంతవర కున్నదో చూడవలసియున్నది. ఈ దేశముల పరిపాలన సంపూర్ణముగా అధినివేశప్రభుత్వ ములచే నిర్వహింపబడుచున్నప్పటికిని, శాసనముయొక్క దృష్టిలో నవి బ్రిటిష్ప్రభుత్వమునకు లోబడిన ప్రభుత్వ ములుగా నెంచబడుచున్నవి. నిజమునకు పై సంఘముల పరిపాలనావ్యవహారములందు బ్రిటిష్ప్రభుత్వముయొక్క అధికారము కేవలము నామమాత్రము. తుదకు దాని విలువ యెట్టిదయినను పేరునకు బ్రిటిష్ప్రభుత్వముయొక్క సర్వాధికారమును అధినివేశము లన్నియు నొప్పుకొను చున్నవి. కనుక వానిని బ్రిటిష్సామ్రాజ్యమున నొక భాగముగా చూడవలసినదేగాని ప్రత్యేకరాజ్యములుగా నెంచుటకు వీలులేదు.

ఇక మన మాతృభూమియగు భారతదేశము యొక్క స్థితి యెట్టిదో గమనించెదము. మనకు రాజ్య మున కుండవలసిన మొదటి మూడు లక్షణములును మిక్కుటముగా గలవు. మనకు ౩౨ కోట్ల జనాభా గల సంఘ మున్నది. ఒక్క చైనాదేశమున తప్ప ఇంతటి జన సంఖ్య మరేదేశమునందునను లేదు. దేశ మన్ననో హిమాలయము మొదలుకొని సేతువువరకు విస్తరించి యొక గొప్పఖండ మని పిలువబడుచున్నది. కట్టుదిట్టమగు పరిపాలనయు గలదు. కాని భారతసంఘమునకు స్వాతం

త్త్యము లేదు. భారతప్రభుత్వము ఆంగ్లప్రభుత్వమునకు లోబడి నడచుకొనవలసియున్నది. భారతప్రభుత్వము యొక్క శాసనములను గాని, చర్యలను గాని బ్రిటిష్ ప్రభుత్వము రద్దుజేయగలదు. అధినివేశములలో వలె గాక భారతదేశమున బ్రిటిష్‌ప్రభుత్వసర్వాధికారము నిజమైనది. కావున భారతదేశము రాజ్య మనిపించుకొన జాలదని వేరుగా చెప్పనవసరము లేదు. ఇదియును ఆంగ్ల సామ్రాజ్యమున నొక భాగమే.

---

౭

# రాజ్యమునకు వ్యక్తికిగల సంబంధము

పరిపాలనాయుతులగు వ్యక్తుల సమూహమే రాజ్యము. కావున ప్రతివ్యక్తియు రాజ్యమున నొక భాగము. వ్యక్తులయొక్క సమిష్టిప్రభావమే రాజ్యస్థితికి కారణభూతము. రాజ్య మనునది వ్యక్తి విశ్వరూపము.

ఈసందర్భమున పరస్పరవిరుద్ధములగు రెండు సిద్ధాంతములు గలవు. అందు మొదటిది రాజ్యము సర్వాధికారి యనియు, అట్టి సర్వాధికారమున కెదురుగా వ్యక్తి కెట్టిహక్కులును ఉండ నేరవనియు చెప్పునట్టిది. రెండవది రాజ్యముయొక్క అధికారమునకు కొన్ని హద్దులు గలవనియు వ్యక్తియొక్క ప్రధానమగుహక్కులనునట్టివి సదరు అధికారమున కతీతము లనియు వాదించునట్టిది. సర్వాధికారశబ్దమునకు పూర్ణార్థ మిచ్చిన

యెడల రాజ్యము చేయగూడని కార్యము గాని, చేయ లేని కార్యము గాని యుండనేరదు. కాని రాజ్యము చేయ లేని కార్యము లనేకములు గలవు. చేయగలిగిన కార్యములకంటె చేయలేని కార్యము లెన్నియో రెట్లు అధికమని చెప్పవచ్చును. సర్వాధికారము, సర్వసమర్థత సర్వజ్ఞుడగు ఈశ్వరునియందు తప్ప మరెందునను కానము. కావున ఇంతటి సర్వాధికారము• రాజ్యమునకు లేదని చెప్పనవసరము లేదు. బర్గెస్ అనుపండితు డీసందర్భమున నిట్లు వ్రాయుచున్నాడు:- 'సర్వాధికార మనగా వ్యక్తులపై రాజ్యమునకు గల సహజమైనట్టియు ,అఖండమైనట్టియు, అపారమైనట్టియు అధికారము.'' ఈయర్థమును బట్టి చూచిన వ్యక్తులపై రాజ్యముయొక్క అధికారమునకు మేరలేదు. రాజ్యము వ్యక్తియెడ చేయగలిగిన నే కార్యమునైనను చేయుట కధికారమును గలిగియున్నది. అది వ్యక్తిని శిక్షించుటయందు గాని, రక్షించుటయందు గాని యథేచ్ఛగా సంచరించగలదు. ఇంతకు నొక్కమాటలో వ్యక్తియొక్క ప్రాణము, మానము, విత్తము, సర్వము రాజ్యముయొక్క చిత్తవృత్తిపై నాధారపడి యున్నవి. రాజ్యమున కెదురు వ్యక్తి కాపాడుకొన గలిగిన హక్కులు లేనేలేవు; హక్కు లనునవి కొన్ని యున్న యెడల, అవి రాజ్యము ప్రసాదించినవే గాని యితరము గానేరవు. తను ప్రసాదించిన హక్కులు తానెప్పుడు దలచిన అప్పుడు అది రద్దుచేయగలదు.

బర్గెస్ పండితుడు రాజ్యముయొక్క సర్వాధికారమున కిచ్చిన, పై నిర్వచనము వ్యక్తిస్వాతంత్ర్యవాదుల

తీవ్రఖండనకు గురి యగుచున్నదనుటలో నాశ్చర్యము లేదు. వ్యక్తిస్వాతంత్ర్యవాదులదృష్టిలో అసలు రాజ్యమే తప్పనిసరిగా తెచ్చిపెట్టుకొన్న ఒకకీడు. అట్టి కీడును కొన్ని ఖచితమగు హద్దులలో నుంచవలెను గాని, దానికి స్వేచ్ఛ నిచ్చుట యప్రశస్తము; అప్రశస్తమే గాదు అపాయకరము గూడ. వ్యక్తి యొక్కరుడుగా సాధించలేని విషయములందు తప్ప, ఇతరవ్యవహారములందు వ్యక్తికి సంపూర్ణస్వాతంత్ర్య ముండవలయును. వ్యక్తుల స్వవిషయములలో రాజ్య మెట్టిజోక్యమును కలిగించుకొనగూడదు. విరోధుల బారినుండి సంఘమును రక్షించుట, సంఘమున వ్యక్తిస్వాతంత్ర్యమునకు భిన్నముగా నడచిన వారిని శిక్షించుట తప్ప వ్యక్తిజీవితముతో సంబంధము గలిగించుకొనుటకు రాజ్యమున కర్హత లేదు. రాజ్యముకంటె వ్యక్తి ముందు: ఆతడు జన్మతః పరిపూర్ణస్వతంత్రుడు. కొన్ని యవసరములను బట్టి రాజ్యస్థితి కంగీకరించుచున్నాడు: అంతేగాని, ముఖ్యమగు జీవితస్వాతంత్ర్యములను తనయందే యుంచుకొనుచున్నాడు. అట్టి స్వాతంత్ర్యములతో ఇతరుల జోక్యమన్నచో నాతడు సహించడు. ఇవి రాజ్యాధికారమున కతీతములు.

ఈ రెండు వాదముల గుణాగుణముల విచారించుటకు పూర్వము 'జాన్ ఆస్టిన్' అను ఆంగ్ల శాస్త్రజ్ఞుడీసందర్భమున వెల్లడించిన యభిప్రాయమును విమర్శించుట సమంజసము. "మరియొకరి యాధిక్యతను మన్నించని నిశ్చయుడైన యధికారి యొకసంఘమున అధిక సంఖ్యాకుల మన్ననను మామూలుగా పొందుచున్నపుడు

ఆయధికారి యాసంఘమున సర్వాధికారి యన బరగు చున్నాడు. ఆయధికారితో ఆసంఘమే స్వాతంత్ర్యరాజకీయసంఘము.'' ఆయధికారి యాజ్ఞలే శాసనములు. ఆశాసనములద్వారా వ్యక్తులకు లభించినట్టియు, సర్వాధికారిచే కాపాడబడునట్టియు హక్కులే ప్రజలహక్కులనునట్టివి. సర్వాధికారి యొకవ్యక్తి గావచ్చును, లేక కొందరి వ్యక్తుల సమూహము గావచ్చును. సర్వాధికారి వ్యక్తులయిష్టముతో నిమిత్తములేకుండ తనయాజ్ఞల నమలు జరుపగలడు. అనగా, అవసరమైనయెడల దార్ఢ్యమును ప్రయోగించి తనయధికారమును నిర్వహించును. మొదట తెలిపిన బర్గెస్ పండితుని నిర్వచనమునకును, ఆష్టిన్ శాస్త్రజ్ఞుని నిర్వచనమునకును మాటలయందు తప్ప అర్థమునం దంతగా భేదము గన్పించదు. ఆష్టిన్ శాస్త్రజ్ఞుని మాటలయందు మార్దవ మెక్కుడుగా గలదు. ఇరువురును రాజ్యశాసనముల కతీతములగు హక్కులు ప్రజలకు గలవని యొప్పుకొనరు. మనకు కావలసిన దదియే. ఆష్టిన్ దృష్టిలో ప్రజలహక్కులు సర్వాధికారి తనశాసనములద్వారా ప్రసాదించినట్టిది. శాసనముల జేయు నధికారి అధికారమునకు హద్దులను గల్పించు శాసన ముండుట యసంభవము. ఏలననగా, శాసనముల చేయునట్టిదే ఆయధికారి కనుక, ఆతడు తనయధికారమునకు తనశాసనముద్వారా హద్దులేర్పచుకొన్నను మరల తనయిష్టవచ్చినపుడు వానిని తొలగించుకొనగలడు. కావున, అట్టివి నిజమగు హద్దులుగా పరిగణింపబడజాలవు.

—

సర్వాధికారము, శాసనము, హక్కు అను పద త్రయమునకు ఆస్టిన్‌శాస్త్రజ్ఞు డిచ్చిన నిర్వచనములను ఖండించినవారిలో సర్ హెన్రీమెయిన్‌పండితుడు ముఖ్యుడు. సర్ హెన్రీ ప్రాగ్దేశచరిత్రను పరిశీలించి, అచటి సంఘములలో ఆస్టిన్‌పండితుడు తెల్పిన సర్వాధికారము గాని, శాసనములు గాని లేవని వ్రాయుచున్నాడు. ప్రాగ్దేశీయుల దృష్టిలో, రాజ్యమున ఒకసర్వాధికారి శాసనముల జేయు నన్న విపరీతముగా నుండును. అక్కడ సనాతనధర్మమే వ్యక్తులహక్కులను నిర్ణయించుచున్నది. సనాతనధర్మ, మనగా అనాదిసిద్ధమగు ఆచారములు గాని ఆస్టిన్ చెప్పినటుల సంఘమునం దొక నిశ్చయుడైన సర్వాధికారి యాజ్ఞలు గావు. సర్ హెన్రీ పంజాబును పాలించిన రంజిత్‌సింగుఅను పేరుగల నిరంకుశప్రభువును ఉదాహరణముగా గొని యాతడు ఆస్టిన్ చెప్పిన శాసనముల నెప్పుడును జేసి యెరుగడని వ్రాయుచున్నాడు. అదియును గాక, పాశ్చాత్యప్రపంచమున గూడ కామన్‌లా అను పేరున వర్తించు పూర్వాచారము లన్నియు సర్వాధికారి జేసినవి కావు. ఈఖండనకు తగిన సమాధానము కొంత వరకు ఆస్టిన్‌శాస్త్రజ్ఞుడే యిచ్చియున్నాడు. ఆస్టిన్ "సర్వాధికారి దేనిని యామోదించునో దానిని యాతడు యాజ్ఞాపించినట్లే" యని యొకసూత్రమును తయారు జేసెను. దీనినిబట్టి పురాతనసాంఘికాచారము లన్నియు సర్వాధికారియాజ్ఞలే యగుచున్నవి. కాని పైసూత్రము ప్రకారము సర్వాధికారివలనకాని పను లన్నియు ఆతడామోదించినట్లే యెంచవచ్చుననియు,సూర్యచంద్రాదుల

గమనమును కూడ సర్వాధికారి యాజ్ఞాపించినట్లే భావించ వచ్చుననియు నొక విధమగు ఖండన జేయవచ్చును.

సర్ హెన్రీమెయిన్ పండితుని సర్వాధికార సిద్ధాంతఖండన మించుక పరీక్షించినచో అందలి పొరపాటు విశదము కాగలదు. సర్ హెన్రీ రాజ్యముయొక్క ప్రారంభదశలను గొనివచ్చి నేటి యభివృద్ధిస్థితికి లంకె వేయుచున్నాడు. తొల్లిటిదశలలో రాజ్యమునకు శాసనముల జేయు నధికార మేర్పడియుండనిమాట వాస్తవమే. దానిని కాదనుట కిప్పు డెవ్వరి వశమును కాదు. అప్పటి పరిస్థితులలో రాజ్యమున కట్టిపని సాధ్యమే కాదు. అప్పుడు రాజ్యము అంతటిభారమును వహించుస్థితిలో లేకుండెను. అందుచేత వ్యక్తుల సొంతవిషయములతో నది జోక్యము పుచ్చుకొనక సంఘమును విరోధులబారినుండి రక్షించుట, నేరముచేసినవారిని శిక్షించుట మొదలగు విషయములను మాత్రమే లక్ష్యముగా నుంచుకొనెను. వ్యక్తులకు తమ నిత్యజీవితవిధానమునందు సంపూర్ణ స్వేచ్ఛ యుండెడిది. సంఘములో నధికసంఖ్యాకులు మామూలుగా ఆచరించుచు వచ్చిన ఆచారములనే రాజ్య మామోదించి యమలు జరుపుచుండెను. కాలము గడచినకొలదిని రాజ్యమునకు బలము చేకూరెను; బలము చేకూరిన కొలదిని దాని యధికారములును వృద్ధియగుచుండెను. అనగా, కొంతకాలమునకు శాసనములజేయు నధికారము కూడ ఏర్పడెను. నేటిస్థితిలో దాని యధికారమునకు మేరలేదు: నేడు దాని యాజ్ఞలే శాసనములు. నేటికిని కొన్నిపూర్వాచారములు చెలామణి యగుచున్నవనిన రాజ్యము వానిని

మంచివిగా భావించి యూరకుండుటచేతనే గాని, అవి తన యధికారమున కతీతము లని వదలివేయుటచేత గాదు. ప్రజల లో అధికసంఖ్యాకు లేదేని నీతివిరుద్ధముగాని యొక యా చారమును మామూలుగా ఆచరించుచున్నటుల ఋజువయి నచో, న్యాయస్థానము లట్టి యాచారము నామోదించి, అమలుజరుపవలసినదిగా నిర్ణయించు శాసనముల నేడు మనము గమనించుచున్నాము. లిఖితరూపమున లేని పూర్వాచారముల నన్నిటిని రద్దుజేయు శాసనము నొక దానిని నేటిరాజ్యము చేసినయెడల, దానిని కాదను అధి కారి లేడు. అట్టి యనవసర కార్యమునకు రాజ్యము పూను కొనకపోవచ్చును. అంతమాత్రమున రాజ్యమున కధి కారము లేదని చెప్పుట సత్యమును మరుగుపరచుటయే యగును. రాజ్యముయొక్క బాల్యదశావిషయముల నెత్తి కొని, నేడు దాని సంపూర్ణాధికారముల గుర్తింప నిరా కరించుట సమంజసము కాదు. ఇంగ్లాండుదేశమునం దనాదినుండియు వచ్చుచున్న, ఆచారములనే కామన్‌లా యని యందురు. కామన్‌లా ఒకరాజు గాని, శాసనసభ గాని తయారుజేసినదికాదు. అది ఆంగ్లసంఘమున పూర్వ మెప్పటినుండియో వచ్చుచున్న ఆచారధర్మము. నేటి బ్రిటిష్‌పార్లమెంటునకు కామన్‌లా పయి అధికారము లేదనుటకంటె అసత్యవచన మింకొకటి యుండబోదు. నిజమునకు పార్లమెంటు అనేకసందర్భములయందు కామన్‌లాను సవరించియుండుటను, రద్దుచేసియుండుటను మనము చూచుచున్నాము. ఇంకను కొంతవరకు కామన్ లా అమలునందున్నమాట వాస్తవమే. దానికి కారణము

పార్లమెంటుయొక్క ఆమోదమే. ప్రాగ్దేశసంఘముల విషయము గూడ నిట్టిదే. ఈ యొక్క విషయమున నేమి, తొల్లిటి మానవసంఘమునకును నేటిరాజ్యమునకును అనేకవిషయములందు వ్యత్యాస మున్నది. ఆష్టిన్ పండితుని సర్వాధికారసిద్ధాంతము నేటిరాజ్యమునకు సంపూర్ణముగా వర్తించుటలో సందేహము లేదు. సంఘమునకు సంబంధించిన సర్వవిషయములలో నేటి రాజ్యమునకు సర్వాధికారము గలదు. నేటిసంఘముయొక్క వ్యవహారకాండ సర్వము, రాజ్యము చేసిన శాసనములపైనను, ఆమోదించిన ఆచారములపైనను ఆధారపడియున్నది. ఇట్టి పూర్వాచారములకును, సూర్యచంద్రుల గమనమునకును సామ్యము జెప్పుటకంటె అసంబద్ధము మరియొకటి యుండదు.

మన మిక వ్యక్తిస్వాతంత్ర్యవాదులు చెప్పెడి ప్రధానమగు హక్కులవిషయ మాలోచింపవలసియున్నది. ఆష్టిన్ సిద్ధాంతముప్రకారము రాజ్యము తనశాసనముల ద్వారా ప్రజలకు ప్రసాదించిన స్వేచ్ఛలే హక్కులనియు, ఆహక్కులను రాజ్యమే కాపాడుచుండుననియు తెలిసికొంటిమి. అయినను ఈ హక్కులు ఇతరవ్యక్తుల కెదురుగా చెల్లుబడి కాగలవు గాని రాజ్యమున కెదురుగా చెల్లుబడి కానేరవు. రాజ్యము ప్రసాదించిన హక్కులను రాజ్య మెప్పుడు దలచిన నప్పుడు రద్దుచేయగలదు. లేక వ్యక్తికి సహజమగు హక్కులు కొన్ని గలవనియు, వానికి భిన్నముగా రాజ్యము ప్రవర్తించుటకు వీలు లేదనియు నెంచిన యెడల, రాజ్య మాహక్కులను భంగపరచి నప్పుడు,

దానిని శిక్షించు నధికారి యెవరను ప్రశ్న కలుగకపోదు. రాజ్యముపై అధికారము చెలాయించగల వ్యక్తి గాని, సంఘము గాని లేదుగదా. అట్టిచో ఈహక్కులు రాజ్యముయొక్క అధికారమున కతీతము లనుటలో గల యర్థమేమి? మనము ప్రధానమగుహక్కులను గూర్చి ఈ వరకే చర్చించియుంటిమి. మంచిప్రభుత్వ మేదియు అట్టి ప్రధానమగు హక్కులతో జోక్యము పుచ్చుకొనదు. మీదుమిక్కిలి వానిని యెల్లపుడు జాగ్రతగా కాపాడు చుండును. అంతమాత్రమున వానిపై రాజ్యమున కెట్టి యధికారమును లేదని యొకరించుటకు వీలులేదు. అత్యంతావసరసమయములలో రాజ్యము వానిని నిరాకరించ వచ్చును. ఉదాహరణముగా, రాజవీథిలో ఉత్సవములను, ఊరేగింపులను జరుపుకొనుటకు ప్రతిపౌరునకు హక్కు గలదు. ఇట్టి హక్కునకు సాధారణముగా ఏప్రభుత్వము నడ్డురాదు. పైగా అది చక్కగా, శాంతముగా జరుగు నటుల చూచుట దాని కర్తవ్యమైయున్నది. కాని అట్టి ఊరేగింపు సాగినయెడల గొప్పదెబ్బలాట జరుగు పరిస్థితు లేర్పడినప్పుడు, ప్రభుత్వ మాయూరేగింపు జరుపుకొను హక్కును నిరాకరించి శాంతిని కాపాడుట యొక్క డవసరము. ఒక్కొక్కప్పుడు రాజ్యము పొరపాటున నేమి, లేక బుద్ధిపూర్వకముగా నేమి సరియైన కారణములు లేకయే వ్యక్తుల ప్రధానమగు హక్కుల కడ్డురావచ్చును. అట్టి నడత నీతిశాస్త్రరీత్యా గొప్పతప్పిదమే గావచ్చును గాక, శాసనముయొక్క దృష్టిలో రాజ్యము సర్వాధికారి గనుక, అది యేమి చేసినను తప్పనుటకు గాని దానికి

యధికారము లేదనుటకు గాని సావకాశము లేదు. నీతి శాస్త్రమునకును, శాసనములకును చాల దూరము. నీతిని బట్టి చూచినయెడల నిరంకుశప్రభువునకు రాజ్యార్హత యుండనేరదు. కాని, శాసనరీత్యా చూచిన నిరంకుశ ప్రభుత్వమునకును, ప్రజాప్రభుత్వమునకును గౌరవమున తారతమ్యమే లేదు. అయితే, ఇక ప్రజలహక్కుల స్వభావ మెట్టిది? హక్కు అనగా ఇతరులనుండి యెట్టి యాటంకమును లేక, ఒక పనిని చేయుటకుగాని, మానుటకుగాని స్వేచ్ఛను గలిగియుండుట. హక్కును భంగపర చినవారిని శిక్షించగల యధికారి యున్నప్పుడే, యది హక్కు అనిపించుకొనగలదు. అట్టి యధికారి లేనిచోట హక్కు అనునది యుండనేరదు. రాజ్యమున ప్రతి వ్యక్తియు తన యిచ్ఛవచ్చిన వృత్తి నవలంబించుటకు, ఇచ్ఛవచ్చినచోట నివసించుటకు హక్కును గలిగియు న్నాడు. ఇట్టిహక్కుల కభ్యంతర పెట్టినవారిని శిక్షించి, యెవరిహక్కుల వారు అవిచ్ఛిన్నముగా ననుభవించునట్లు చూచుటకు నందరిపైనను రాజ్యము గలదు. కావుననే, అవి హక్కు లన జెల్లుచున్నవి. రాజ్యమే లేనియెడల, ప్రజలకు హక్కులే లేవు. రాజ్యము లేనప్పుడు ప్రతివ్యక్తియు సర్వస్వతంత్రుడగును. ఒకరి హక్కుల నొకరు గుర్తించ వలసిన బాధ్యతలేదు. బలవంతులు బలహీనుల పీడింతురు. సంఘమంతయు అరాజకమై పోవును. అట్టి సంకులసమర మున వ్యక్తిహక్కులకు తా వెక్కడ? వ్యక్తులలో ఒకరి హక్కుల నొకరు గౌరవించునట్లు చేయుట కొక సర్వాధి కారి యవసరము. అదియే రాజ్యము. అట్టి సర్వాధికా

రికి మించిన హక్కులు వ్యక్తి కెట్లుండగలవు ? వ్యక్తి హక్కులను గౌరవించునట్లు రాజ్యమును నిర్బంధపెట్టగల యధికారి మరియొక డున్నపుడే, అవి రాజ్యముయొక్క యధికారమునకు మిగిలిన హక్కు లనజెల్లును. రాజ్యమునకు పై యధికారి లేడు, కావున రాజ్యమున కెదురు వ్యక్తికి హక్కులే లేవు. ఒకవేళ అట్టి పై యధికారియే యుండె ననుకొనుడు. ఆ పై యధికారి ప్రజలహక్కుల భంగపరచిన చేయునది యేమి ? ఇట్టి వాదన కొక అంతు ఉండదు. హక్కు లుండవలె నన్న యొక సర్వాధికారి యుండవలయును. ఆహక్కులాసర్వాధికారికి లోబడునవియే గాని మించిన వెప్పుడును గానేరవు.

పైన చర్చించిన విషయములను బట్టి, రాజ్యము సర్వాధికారియనియు; ప్రజలహక్కు లనునట్టివి ఆసర్వాధికారముపై నాధారపడియున్నవి గనుక అవి దానికి లోబడునవే గాని మిగులునవి గావనియు తేలుచున్నది. ఐతే, ఈసర్వాధికారము రాజ్యమునం దెచ్చట నుండు నను ప్రశ్న యొకటి గలదు. కొన్నిరాజ్యములందు సర్వాధికారము ప్రభుత్వమునందే యుండును. అనగా, పరిపాలనాధికారముల నిర్వహించు వ్యక్తి లేక వర్గము సర్వాధికారియై యుండును. మరికొన్ని రాజ్యము లందు, సర్వాధికారి నిత్యము ప్రత్యక్షముగా వ్యవహరించు వ్యక్తిగా గాని లేక సంఘముగా గాని లేకపోవచ్చును. అవసరమైనపుడు మాత్రమే సర్వాధికారి యేర్పడి ఆపని పూర్తియైన వెంటనే అంతర్ధాన మగును. అచ్చట పరిపాలనావ్యవహారముల నిర్వహించు వర్గమునకు, అనగా, ప్రభు

త్వమునకు సర్వాధికార ముండదు. సర్వాధికారి నియమించిన హద్దులకు లోబడి ప్రభుత్వము వ్యవహరింపవలెను. బ్రిటిష్ రాజ్యమున సర్వాధికారము పార్లమెంటునందు గలదు. బ్రిటిష్ పార్లమెంటు చేయగూడదని శాసనము లేదు. దాని యధికారములపై విచారణచేయుటకు న్యాయస్థానములకు గాని, మరెవ్వరికి గాని యధికారము లేదు. అమెరికాసంయుక్తరాష్ట్రప్రభుత్వ మిట్టిది గాదు. అచట కాంగ్రెసు గాని, అధ్యక్షుడు గాని, న్యాయస్థానము గాని సర్వాధికారమును గలిగియుండలేదు. అమెరికాసంయుక్త రాష్ట్రరాజ్యాంగచట్టమున ప్రభుత్వపు మూడుశాఖలవారి యధికారావ్ధులు ఖచితముగా నిర్వచింపబడియున్నవి. సదరు చట్టమునకు విరుద్ధముగా ప్రభుత్వము సంచరించుటకు వీలులేదు. అట్లు సంచరించిన యెడల, న్యాయస్థానముద్వారా దానికి తగిన పరిహారమును బొందవచ్చును. అమెరికాసంయుక్తరాష్ట్రములయందు సర్వాధికారిని మనము నిత్యము ప్రత్యక్షముగా గాంచజాలము. అచట సర్వాధికారి, లేక సర్వాధికారవర్గము శాశ్వతముగా నేర్పడి వ్యవహరించుటలేదు. రాజ్యాంగచట్టమును సవరించగల, లేక రద్దుచేయగల అధికారియే సర్వాధికారి. అట్టి యధికారము ప్రత్యేకఅమెరికాసంయుక్తరాష్ట్ర మహాజనసభకు మాత్రమే గలదు. ఈ మహాజనసభ శాశ్వతముగా నుండునది కాదు: అది ఒకయవసరము నిమిత్త మేర్పడి, అవసరము తీరినవెంటనే రద్దగును.

---

# ౭

# రాజ్యముల పరస్పర సంబంధములు

[అంతర్జాతీయ నిర్ణయములు]

ప్రపంచమున రాజ్యము లనేకము లగుటజేసి వాని మధ్య ఒకవిధమగు సంబంధము తప్పనిసరిగా ఏర్పడు చున్నది. ఏరాజ్యమున కారాజ్యము సర్వాధికారి యగుటచే ఒకదానిపై మరియొకదాని కెట్టియధికారమును ఉండజాలదు. కాని రాజ్యము లన్నియు సమానప్రతిపత్తి ననుభవించుట కభ్యంతర ముండబోదు. ప్రతిరాజ్యము యొక్కస్థితియు దానికి యిరుగుపొరుగురాజ్యములతో నున్న సంబంధములపై చాలవర కాధారపడుచున్నది. ఇరుగుపొరుగుసంఘములతో గల వృత్తులు, విజ్ఞానము, నాగరికత, అభివృద్ధి మొదలగువానిని ప్రతిసంఘమును కొంతవరకు గ్రహించక తప్పదు. అదియునుగాక ఏసంఘమున కాసంఘము ఇతరులతోడి పొత్తులేక జీవించుటయే దుర్లభము. ఏదేశముగాని తనఅవసరములను దీర్చుకొనవలె నన్న కొంతవర కితరదేశములపై ఆధారపడవలసి వచ్చుచున్నది. ఇక్కడ అవసరము లేని, అవసరమునకు మీరిన వస్తువులను వాని అవసర మున్న ఇతరదేశములకు పంపుటయు; ఇక్కడ దొరకని వస్తువులను ఇతరదేశముల నుండి తెచ్చుకొనుటయు కలుగుచున్నది. ఇట్టి అన్యోన్య సంబంధములచే రాజ్యము లన్నియు తమతమ యభివృద్ధి కొరకు కొన్నినిర్ణయములను పాటింపవలసిన అగత్య

మేర్పడుచున్నది. ఈనిర్ణయములనే అంతర్జాతీయనిర్ణయము లని యందురు. అంతర్జాతీయవిషయములను గమనించుచుండుటకును, వానిని తగువిధముగ పరిష్కరించుటకును నేటిప్రభుత్వములయందు ఒకప్రత్యేకశాఖ అవసరమగుచున్నది.

అంతర్జాతీయనిర్ణయముల యభివృద్ధిక్రమమును నాలుగు అవస్థలుగా విభాగింపవచ్చును. మొదటియవస్థ రోమన్ సామ్రాజ్యస్థాపనకు పూర్వపుస్థితికి సంబంధించినది. రెండవది రోమన్ సామ్రాజ్యస్థాపన మొదలుకొని 1648-వ సంవత్సరములో జరిగిన వెస్టుఫేలియాయొడంబడికవరకు జరిగినయవస్థ. మూడవది వెస్టుఫేలియా మొదలుకొని 1919-వ సంవత్సరములో జరిగిన నానారాజ్యసమితిస్థాపన వరకు గల గాథ. నాల్గవది సమితిస్థాపన దరిమిలా జరుగుచున్న కాండ.

ఇందు మొదటియవస్థలో అంతర్జాతీయనిర్ణయములంతగా లేవనియే చెప్పవలయును. రెండవయవస్థ రోమను సామ్రాజ్యస్థాపనతో ప్రారంభ మగుచున్నది. రోమనులు యూరప్ ఖండమునంతను జయించి, గొప్పసామ్రాజ్యమును స్థాపించుటతో, ఆఖండమున గల జాతు లన్నియు రోమన్ చక్రవర్తి పరిపాలనక్రిందికి వచ్చెను. అప్పు డొక క్రొత్తసిద్ధాంతము బయలుదేరెను. ప్రపంచమున కంతకు అధిపతి యొక్కడే అనియు, ఆతని పరిపాలనక్రింద సర్వజాతులు సామరస్యముతో నుండవలె ననియు, రోమనులు ప్రబోధించిరి. ఈ విశ్వమానవసామ్రాజ్యసిద్ధాంతమునకు క్రైస్తవమతప్రచారము మొట్టమొదట కొంతవరకు

సాయపడెను. కాని, దరిమిలా రోమ్నాళ్ళకు పోప్ (క్రైస్తవమతాధిపతి) ప్రపంచమునకంతకు తానే మతాధిపతి ననియు, మతవిషయములందు చక్రవర్తికెట్టియధికారమును లేదనియు, మతవిషయములకు లౌకికవ్యవహారములు అడ్డు తగులగూడదనియు శాసించి తనయాధిపత్యమును స్థాపించెను. అంతటితో, విశ్వమానవసామ్రాట్టొక్కడే యను భావము పోయి యిద్దరని తేలెను. ఈభావము చక్రవర్తియాధిపత్యమును కొంతవరకు తగ్గించెను. తదుపరి, మతసంస్కరణోద్యమ మొకటి బయలుదేరి రోమన్ పోపుయొక్క ప్రాపంచికమతాధిపత్యము నూడబెరికెను. ఈ సంస్కరణోద్యమమున క్యాథలిక్కులకు (పూర్వాచారపరాయణులకు), ప్రొటస్టెంటులకు (సంస్కరణవాదులకు) ముప్పదిసంవత్సరములు ఘోరయుద్ధము జరిగి చిట్టచివరకు 1648–వ సంవత్సరములో వెస్టుఫేలియాసంధితో పూర్తియాయెను. ఈసంధియందు ఐరోపారాజు లందరును పాల్గొనిరి. ఈసంధితో ఏకైకసామ్రాజ్యతత్త్వ మడుగంటెను.

ఇంతటినుంచి మూడవయవస్థ ప్రారంభ మగుచున్నది. వెస్టుఫేలియాసంధితో విశ్వమానవసామ్రాజ్యతత్త్వము పోయి జాతీయతత్త్వ మమలులోనికి వచ్చినది. రోమనుసామ్రాజ్యపతనముపై నేర్పడిన జాతీయరాజ్యము లన్నియు స్వతంత్రరాజ్యములుగా అంగీకరింపబడెను. ప్రతి రాజ్యమును–దాని దేశపుహద్దులమధ్య సర్వాధికారమును, ఇతరరాజ్యముల సందర్భమున సంపూర్ణస్వాతంత్ర్యమును కలిగియున్నదని గుర్తింపబడినది. అనేకస్వతంత్రరాజ్యము

లెప్పు డేర్పడెనో, అప్పుడు వానిమధ్య పోరుపు లేర్పడుటకు సావకాశము లధికమాయెను. ఇట్లేర్పడిన పోరుపులే, ప్రాణవిత్తముల హరించు ఘోరయుద్ధములుగా పరిణమించి ప్రపంచశాంతిని భంగపరచుచున్నవి. సరిహద్దుల దగ్గర తగవులు, వ్యాపారసంబంధమైన తగవులు, జాతుల గౌరవప్రతిష్ఠలకు సంబంధించిన తగవులు, ఇతర దేశముల నాక్రమించుకొని వలస లేర్పరచుకొనుటలో పోటీలు మొదలైనవి యెక్కువాయెను. ఈతగవుల పరిష్కారమునకు యుద్ధము తప్ప వేరు మార్గము లేకుండెను.

ఇట్టి స్థితి ప్రజలకు దుర్భరముగా నుండెను. వివిధ రాజ్యములమధ్య యొకవిధమగు సామరస్య మవసరమనియు, యుద్ధసమయములలో ప్రతిరాజ్యము కొంతవరకు నీతినియమముల పాటింపవలయుననియు, ప్రపంచ శాంతినిగోరు ధర్మశాస్త్రవేత్తల కనేకులకు తోచెను. ఇట్టి వారిలో హ్యూగోగ్రోటియస్ అను నొక డచ్చిసిద్ధాంతి ప్రథముడు. ఈతడు శాంతిసమయములలోను, యుద్ధసమయములలోను వివిధరాజ్యము లవలంబింపవలసిన నీతినియమముల నిరూపించుచు ఒకగ్రంథమును ప్రచురించెను. గ్రోటియస్ సిద్ధాంతికి పూర్వము అంతర్జాతీయసంబంధములపై చెప్పదగిన గ్రంథ మేదియు లేదు.

నేటి యంతర్జాతీయ నిర్ణయములు చాలవరకు రాజ్యములమధ్య జరిగిన ఒడంబడికల మూలముగా ఏర్పడెనని చెప్పవచ్చును. వెస్టుఫేలియాసంధి వివిధరాజ్యముల సర్వాధికారమును, సంపూర్ణస్వాతంత్ర్యమును గుర్తించుచున్నది. ఇట్టివే దరిమిలా పెక్కుయొడంబడికలు అనేక

సమయములందు జరిగెను. నేటికిని జరుగుచున్నవి. ఈ యొడంబడికలలో ఆయారాజ్యము లవలంబించవలసిన విధానమునకు ముఖ్యసూత్రములు నిర్వచింపబడుచుండును.

అంతర్జాతీయనిర్ణయములు ప్రైజుకోర్టుల తీర్పుల పై కూడ కొంతవర కాధారపడియున్నవి. ప్రైజుకోర్టులనగా యుద్ధసమయమున సముద్రములపై వశపరచుకొన్న యాస్తినిగూర్చి విచారణజేయు ప్రత్యేకన్యాయస్థానములు.

యుద్ధమునకు దిగనున్న రాజ్యము ఇరుగుపొరుగు తటస్థరాజ్యముల సందర్భమున తా నెట్టివిధానము నవలంబించునో తెలియజేయుచు ఒకప్రకటన చేయును. అట్లే యిరుగుపొరుగుతటస్థరాజ్యములు కూడ యుద్ధమున ఇరుకక్షులవారియెడలను తమ దృక్పథమును తేటబరచుచు ప్రకటనలు జేయును. ఇట్టిప్రకటనలు కూడ అంతర్జాతీయ సంబంధములను కొంతవరకు నిర్ణయించుచున్నవి.

ఇన్నివిధములుగా నున్న అంతర్జాతీయనిర్ణయములు శాసనములవలె రాజ్యములను బద్ధపరచగలవా అని యడుగవచ్చును. రాజ్యము లన్నియు సంపూర్ణస్వాతంత్ర్యమును గల వగుటచే అట్టివానిని గట్టిగా బద్ధపరచగల అంతర్జాతీయశాసనముల జేయు నధికారి యుండ నేరడు. ఒకవేళ అట్టి శాసనము లున్నను, అమలుజరుపగల యధికారి యంతకంటెను లేడు. ధర్మశాస్త్రవేత్తల నుడువులే అంతర్జాతీయనిర్ణయములకు పునాది. వాని ననుసరించి నానారాజ్యములు తాత్కాలికముగా చేసికొను సంధులు, ఒడంబడికలు, ప్రకటనలు మొదలుగా

గల చర్యలే అంతర్జాతీయనిర్ణయముల స్వరూపము. ప్రస్తుతము అంతర్జాతీయనిర్ణయములకు గల బలము వానియందు గల నీతియే అని చెప్పవలయును. అదియును గాక అవినీతిమార్గమును బట్టు రాజ్యమునకు గౌరవప్రతిష్ఠలు చెడును; పరపతి నశించును. తుద కారాజ్యము తీరని కష్టనష్టముల పాలగును. తాత్కాలికఫలితముల నపేక్షించి అంతర్జాతీయనిర్ణయముల పాటించక కొన్ని బలముగల రాజ్యములు తమ యిచ్చవచ్చినరీతిని ప్రవర్తించుట మనము నేటికిని చూచుచున్నాము. ఇట్టి రాజ్యములను తగినట్లుగా మందలించుటకును, అంతర్జాతీయనిర్ణయముల గౌరవమును కాపాడుటకును ఇప్పటికి చేసిన కృషి యెట్టిదో, అది యెంతవరకు సఫలమాయెనో మనము నాల్గవయవస్థయందు చూడగలము.

నాల్గవయవస్థను గూర్చి చర్చించుటకు ముందు ఇప్పటి కేర్పడిన నిర్ణయములలో కొన్ని ముఖ్యమైన వానిని పరిశీలింతము. అంతర్జాతీయనిర్ణయములు (౧) శాంతిసమయములలో వర్తించునవి (౨) యుద్ధసమయములలో వర్తించునవి అని రెండువిధములు.

శాంతిసమయమున ఈదిగువ నిర్ణయములు వర్తించును. ప్రతిరాజ్యమును తనదేశములో సర్వాధికారమును, ఇతరరాజ్యములయెడ సర్వస్వాతంత్ర్యమును గలిగియున్నది. రాజ్యము చిన్నదైనను, పెద్దదైనను సమానగౌరవమునే పొందవలెను. ఏరాజ్యమునకు గాని తనదేశవైశాల్యమును న్యాయసమ్మతముగా వృద్ధిచేసికొనుటకు హక్కు గలదు. న్యాయసమ్మతమగు యుద్ధమున జయించుట

మూలమునగాని, క్రొత్తదేశములను ముందుగా స్వాధీనము చేసికొని వలసలేర్పరచుకొనుట మూలమున గాని, మరియొకరాజ్యమునుండి దత్తతగా పొందుట మూలమున గాని, లేక మరి యేయితర న్యాయపద్ధతిని గాని రాజ్యము తనదేశమును వృద్ధిచేసికొనవచ్చును. అనగా క్రొత్తదేశమును సంపాదించుకొనవచ్చును. వివిధదేశముల సముద్రతీరనియమమునకు భిన్నముగాని పద్ధతిని, సముద్రప్రయాణ సందర్భమున అన్నిరాజ్యములకును సమానములగుహక్కులు గలవు. ఒకదేశముయొక్క వర్తకవ్యాపారములకు, మరియొక దేశ మెట్టియాటంకములను గలిగింపగూడదు. ప్రతిరాజ్యమును విదేశీయులను తనదేశమున ఉన్నంతకాలము తగువిధముగా చూడవలయును. అనగా వారిన్యాయసమ్మతమగు హక్కులను కాపాడవలయును. ఇట్టివే యనేక నిర్ణయములు గలవు.

యుద్ధసమయమున వర్తించు నిర్ణయము లెట్టివనగా:—రెండురాజ్యములమధ్య యొకతగాదా ఏర్పడినపుడు, ఆరెండురాజ్యములును ఒకచోట కలసి, తగవునకు సంబంధించిన విషయముల సావధానముగా చర్చించి, సాధ్యమైనంతవరకు శాంతియుతమగు పరిష్కారము చేసికొనవలయును. అట్టిది సందర్భ పడనియెడల, లేక అట్టి పరిష్కారము కుదురని యెడల, రెండురాజ్యములు కలసి యొకమధ్యవర్తిని యెన్నుకొని, యాతని పరిష్కారమున కొప్పుకొనవలయును. మధ్యవర్తిపరిష్కారము కూడ నిష్ఫలమైనయెడల, సదరు తగవును యుద్ధముద్వారా పరిష్కారము చేసికొనవచ్చును. కాని యుద్ధమునందు కూడ

ఇరుకక్షులవారు పాటించవలసిన నీతినియమములు కొన్ని గలవు. ఇరుపక్షములవారును సాధ్యమైనంతవరకు ఘోర దౌర్జన్యములకు గడంగక, యుద్ధమును సౌమ్యముగానే నడపవలయును. అనగా భీభత్సమును సాధ్యమైనంతవరకు తగ్గించవలయును: విరోధులు చేజిక్కినపుడు వారియెడ దాక్షిణ్యాభావము గలిగియుండవలెను; చిత్రవధలు, విష వాయుప్రయోగము, విశేషబాధాకరమగు తుపాకిగుండ్ల నుపయోగించుట మొదలగునవి నిషేధించవలయును. వైద్యశాలలు, విద్యాలయములు, పురాతనపుకట్టడములు, విగ్రహములు, దేవాలయములు మొదలగువానిని పాడు చేయగూడదు. రణరంగమున నెదుర్కొను సేనలకు మినహా, సామాన్యజనసమూహములపై దాడి సలుప గూడదు. అందున ముఖ్యముగా స్త్రీలు, పిల్లలు, రోగులు మొదలగువారియెడల మిక్కిలి జాగ్రతవహించవలయును. తటస్థరాజ్యముల వర్తకవ్యాపారముల కడ్డురాగూడదు. వారి ప్రజలయెడలను, వారియాస్తులయెడలను తగిన శ్రద్ధను బూనవలయును. యుద్ధమును సాధ్యమైనంత త్వరలో ముగింపవలయును గాని పొడిగింపగూడదు. ఇరు తెరగులవారిలో ఎవరు సంధిని గోరినను, రెండవవా రందు కంగీకరింపవలయును.

ఈ పైనిర్ణయములలో గల నీతి మనకందరకు కండ్లకు గట్టిన ట్లగపడుచున్నది. గ్రోటియస్ పండితు డన్న ట్టుల అంతర్జాతీయనిర్ణయములు స్వాభావసిద్ధములు; వాని నొకరు తయారుచేయవలసిన యవసరములేదు; కాని తన యవసరము వచ్చినపుడు ప్రతిరాజ్యమును వానిని త్రోసి

వేయుచున్నది. అది లేనపుడు ప్రతిరాజ్యమును వానిలోని మంచితనమును వేనోళ్ళ చాటుచున్నది. త్రోసివేయుటకు కారణము స్వార్థపరత్వము : గౌరవించుటకు కారణ మందుగల పరమధర్మము. ఈస్వార్థపరమార్థసంఘర్షణ యం దెప్పుడును స్వార్థమే జయించుచున్నది. పరిస్థితు లిట్లుండ గత ఐరోపాసంగ్రామము ప్రారంభమాయెను;

గత మహాసంగ్రామముతో అంతర్జాతీయనిర్ణయ ముల నాల్గవదశ ప్రారంభ మాయెనని యెంచవచ్చును. ఈ మహాయుద్ధమున రాజ్యముల దృక్పథము చాలవరకు మారి పోయెను. ప్రపంచపరిస్థితులు తారుమారాయెను. ప్రపం చము కన్నుల దెరచెను. ఎల్లెడలను యుద్ధముల నిర్మూ లించవలె ననెడి ఘోష బయలుదేరెను. ప్రతిరాజ్య మును అప్పటి పరిస్థితిని నిరసించుచు యుద్ధమునకు గడం గుటకంటె అవినీతి మరియొకటి యుండబోదని యెలుగెత్తి చాటెను. యుద్ధము ముగియుటతోడనే ప్రపంచమున శాశ్వతశాంతిని స్థాపించవలె ననెడి తలంపుతో ప్రధాన రాజ్యము లన్నియు 1919 ఏప్రియల్ 28-వ తారీఖున ప్యారిస్‌నగరమున సమావేశమాయెను. సమావేశము నకు ముందున్న భావములు సమావేశమున లేవు. సమా వేశమున ఉన్న భావములు దానికి తరువాత లేవు. మొత్తముమీద ఈసమావేశముయొక్క ఫలిత మే మ నగా శాంతిసంరక్షణార్థము 'నానారాజ్యసమితి' యను నొక ప్రాపంచికసంస్థ సంస్థాపింపబడెను. సమితియొక్క ఒడంబడికపత్రములో (౧) యుద్ధముల నాపుజేయుట. (౨) సైన్యములను తగ్గించుట (3) సమితిసభ్యుల దేశ

మునకును స్వాతంత్ర్యమునకును తగిన రక్షణ నిచ్చుట ముఖ్యోద్దేశ్యములుగా నుదాహరింపబడెను.

నానారాజ్యసమితి మొదటయనుకొన్నంత కట్టుదిట్టముగా ఏర్పడియుండ లేదనియు, తదుపరి కూడ అది తనబాధ్యతల సక్రమముగా నెరవేర్చ లేకపోయెననియు అందరు అంగీకరించిన విషయమే. దీనికి కారణము లనేకము లున్నవి. అందు మొదటిది ప్రతితీర్మానమునకు సభ్యు లంద రేకగ్రీవముగా నామోదించవలె ననెడి సూత్రము. దీనివలన ఏయొక్క సభ్యు డామోదింపకున్నను సమితి యాట కట్టుచున్నది. రెండవది సమితి తీరుమానముల నమలుజరుపుటకు వెనుక ప్రత్యక్షమగు సైనికబల మేమియు లేదు. మూడవది సమితిసభ్యులలో కొందరికి తమ కున్నదానితో సంతృప్తి లేదు. తక్కిన వారికి సమితి నుద్ధరింపవలె ననెడి పట్టుదల, అందుల కవసరమగు ధైర్యము, త్యాగము లేవు. కాని నానారాజ్యసమితి సంస్థాపనయందు మనము గమనింపవలసిన ముఖ్యవిషయ మేమనగా ప్రపంచమున స్థిరమగు శాంతి యేర్పడుటకు ప్రాపంచికసంస్థ యొకటి యవసరమగుట గుర్తింపబడినదని. ప్రస్తుతము సమితికి తగినంత సామర్థ్యము లేకపోవచ్చును. కాని రాజ్యముల నన్నిటిని సత్ప్రవర్తనయందు బెట్టి ప్రపంచమునకు శాంతిని ప్రసాదించగల మహాసంస్థకు దీనిని మొదటిమెట్టుగా భావించవచ్చును. నానారాజ్యసమితి కింకను బాల్యదశ. దానిని మనమిప్పుడు పోషింపవలయును; ముందు మనల నది పోషింపగలదనియే నమ్మవలసియున్నది.

౮

# రాజ్యముయొక్క పరమావధి

రాజ్యముయొక్క గమ్యస్థానము మానవసంఘు సౌభాగ్యమైన యెడల, దానిని మన మందరము ప్రోత్సహించి, పెంపొందింప వలయును. అట్లుగాక, రాజ్యము సంఘమునకు గొప్ప యాపత్తును దెచ్చిపెట్టు నెడల, దాని నవశ్యము ధ్వంస మొనరింపవలసి యుండును. రాజ్యముయొక్క పరమావధి సంఘసౌభాగ్యమని అందరు నంగీకరించిన విషయమే. ఐతే, సంఘసౌభాగ్య మనగా నేమి? ఏసంఘమున సంతృప్తి, సామరస్యము, శాంతి, రక్షణ గలవో ఆసంఘమే సౌభాగ్యవంతమగు సంఘము. కొందరింకను స్వేచ్ఛ, సమత్వము, సౌభ్రాతృత్వము, సంపద, సహకారము, విజ్ఞానము మొదలుగా గల అనేకలక్షణములను జూపుచున్నారు. ఇవి యన్నియు మొదటి నాల్గింటిలో ఇమిడియే యున్నవని చెప్పవచ్చును. మొత్తము మీద సౌభాగ్య మనగా సర్వతోముఖమగు సౌఖ్యమని చెప్పవచ్చును.మానవసంఘమున కిట్టి సౌఖ్యమును ఒడగూర్చుటకే రాజ్య మేర్పడినది. తాత్కాలికసౌఖ్యము సౌఖ్యముగాదు. శాశ్వతసౌఖ్యమే సౌఖ్యము. అట్టి శాశ్వతసౌఖ్యముబొందుటకు రాజ్య మనునది యిహలోకసాధనము. రాజ్యమను యంత్రసహాయమున ఈప్రపంచమున సర్వసౌభాగ్యముల నుద్భవింపజేసి, మానవసంఘ మంతయు సంతృప్తిగా అనుభవించి తరించవలసియున్నది. నేటి మానవ

సంఘము సౌభాగ్యమహర్దశ కింకను చాలదూరమునం దున్నది. ప్రపంచమున శాంతిభద్రత లింకను సుస్థిరములు గావు: వివిధరాజ్యములమధ్య శాశ్వతమగు సామరస్యము కుదురలేదు; ఎల్లప్పుడు యుద్ధములచే దేశములు రక్తమయ మగుచున్నవి. ఎక్కడ జూచినను అసంతృప్తి, యహంభావములే యెక్కుడుగా గన్పడుచున్నవి. నేటి జాతీయరాజ్యమున తనకు తానే పరమావధియను సంకుచితస్వభావము కూడ ప్రబలియున్నది. అనగా రాజ్యము యొక్క గమ్యస్థాన మాప్రత్యేకజాతిసుఖమే గాని, విశ్వమానవసౌభాగ్యము గాదని దీని తాత్పర్యము. ఇట్టి భావ మెంతటి దూరదృష్టిరహితమైనదో చాటవలసిన పనిలేదు. జాతీయమైన ఈఅహంభావమే నేటి ప్రపంచ దుస్థితికి మూలకారణము.

శాంతి యన్న ప్రాపంచికశాంతి. సౌభాగ్య మన్న సర్వమానవసౌభాగ్యము. ఒకప్రత్యేకజాతికి ఇరుగు పొరుగుజాతులకు లేని శాంతిసౌభాగ్యము లబ్బుట కల్ల. శాశ్వతమగు శాంతి యేర్పడిన ప్రపంచమున కంతకును యేర్పడును, లేకున్న అది యెక్కడను నుండదు. శాంతి యేర్పడుటకు ముందు జాతీయాహంభావము నశింపవలయును. అహంభావమునకును, యాత్మగౌరవమునకును మిక్కిలి భేద మున్నది. ఆత్మగౌరవ ముత్తమపురుషలక్షణము. అది లేనివాడే నీచుడు. అహంభావము దుష్టలక్షణము. తనకు మినహా, యితరు లెవ్వరు గౌరవపాత్రులుగా రను భావమే యహంభావము. ఇతరులతోపాటు తనను గౌరవించవలె ననెడి కోర్కెయే ఆత్మగౌర

వము. ఆత్మగౌరవము గల వ్యక్తి గాని, జాతి గాని, యెందును అహంభావమును సహింపజాలదు; అహంకారులకు తోడ్పడజాలదు. ఆత్మగౌరవము గలవాడు ముందితరులను గౌరవించి, తదుపరి, వారిచే నట్టి గౌరవమును పొందును. అహంకారు డితరుల దూషించును: దౌర్జన్యమే వానివృత్తి. ఆత్మగౌరవము గల వానికి శాంతము ప్రధానము. దౌర్జన్యముచే నహంకారుడు ఇతరులను కొల్లగొట్టి తాత్కాలికముగా భోగము లనుభవించినను అవి శాశ్వతముగా నుండునవి కావు. శాశ్వతమగు శాంతికి దౌర్జన్యరాహిత్యమే మార్గము. ఎంతకాల మీయహంభావదౌర్జన్యము లీభూగోళమున నిలచునో యంతకాలము మానవజాతి కిహపరసౌఖ్యములు రెండును కలుగనేరవు.

ప్రపంచమున ప్రతిజాతికిని యహంభావము నశించి యాత్మగౌరవము హెచ్చవలయును. ఇది సంఘమునకు ప్రేమను, సహకారమును, సమత్వమును, సౌభ్రాతృత్వమును ఇచ్చును. నాల్గులక్షణములును ప్రపంచశాంతికి పరికరములు. ఇవి లేనికారణముననే ప్రపంచము నేడు దౌర్జన్యముల కాలవాలమైయున్నది. ఇరుగుపొరుగులు సుఖించినప్పుడే తాను సుఖించగలడు. ఇరుగుపొరుగుల కష్టములు తనను కూడ బాధించును. ఈసూత్రమును తెలియనివాడు కేవలము మూర్ఖుడు. ప్రపంచమున కొన్ని జాతులు సుఖించుట, కొన్నిజాతులు బాధపడుట యనునది తాత్కాలికమే గాని శాశ్వతమైనది గాదు. నాయింటి ప్రక్క నున్న వా రాకలిబాధచే పీడింపబడుచుండ నేను కడుపునిండ భోజనము చేసినను నాకు కూడ సుఖము

లేదు ; మనశ్శాంతి లేదు; నిద్ర పట్టదు. అయ్యో, పాపము తోడిమానవులు బాధపడుచున్నారే యను పారమార్థికచింత యటుంచుము. నేను కన్నుమూసిన నాకొంప దోయుదు రన్న భయము నన్నావహించును. దీనితో తిన్న ఫలితము గూడ బోవును. అవతలవారిస్థితి త్వరలో బాగుపడని యెడల, నేను కన్ను మూయ నవసరము లేదు, పనియంతయు నాకండ్లయెదుటనే పూర్తియగును. అప్పుడు నన్ను వారితోపాటు బ్రతుకనిచ్చిన చాలును. నేను నిలువచేసిన నిధినిక్షేపములతో నాకు పని లేదు; నాయిల్లు కూడ నాకవసరము లేదు ; నాప్రాణములతో నన్నవతలకు బంపిన చాలును. అదియే నాకు పది వేలు. రాజ్యముల పరిస్థితి కూడ ఇట్టిదే. వెనుకటిరాజుల యహంభావము, స్వార్థపరత్వమే ప్రజల విప్లవములకు కారణభూతమూయెను. అట్లే నేటి బలవత్తరజాతీయరాజ్యములయందు ప్రబలియున్న అహంభావము, స్వార్థపరత్వము వెంటనే నశించు మార్గములను జూడకున్న అవి బ్రహ్మాండమగు విశ్వమానవప్రళయమునకు గొనిపోగలవు. కావున, రాజ్యములందు అహంభావము, దౌర్జన్యము, స్వార్థపరత్వము నశించి వానిస్థానే ఆత్మగౌరవము, ప్రేమ, సామరస్యము, సహకారము పెంపొందవలయును. అప్పుడే రాజ్యములు తమగమ్యస్థానమును చేరగలవు.

ఏదేని యొకరాజ్యమున శాంతిసౌఖ్యములు లేవన్న ఆరాజ్యమున లోపలనో, బయటనో దానికి విరోధులున్నారన్నమాట. రాజ్యమునకు విరోధు లేల యేర్పడెదరు ? సంఘమున ప్రేమానురాగములు, సహకారసమత్వములు,

లేకపోవుటయే విరోధు లేర్పడుటకు కారణము. ఆత్మశుద్ధి గల్గిన సంఘమునకు, ఆత్మగౌరవము గలిగిన సంఘమునకు విరోధు లుండరు. విరోధులు చెలరేగినపుడు, దౌర్జన్యములు సాగినపుడు కొంతమంది వ్యక్తులను బట్టి దేశమునుండి వెడలగొట్టినమాత్రమున, లేక యురిదీసినంత మాత్రమున విరోధము నశించదు. అప్పటి కప్పుడు శాంతి యేర్పడినట్లు తోచినను అది నిజమగు శాంతిగాదు. మీదుమిక్కిలి అట్టిదౌర్జన్యముచే విరోధము వృద్ధి యగును. విరోధము నశించవలెనన్న దానికి కారణ మెద్దియో విచారించి, దానిని తొలగించవలయును. అప్పుడు విరోధము నశించును; శాశ్వతశాంతి చేకూరును. అంతియే గాని, మూలమును తొలగించక, విరోధమును విరోధము చేతను, దౌర్జన్యమును దౌర్జన్యముచేతను తొలగించుట యెప్పుడును జరుగు పనిగాదు. ఇందులకు చరిత్రయేసాక్షి. ప్రతిరాజ్యమును తనధర్మమును సక్రమముగా నెరవేర్చవలె నన్న నీ పరమరహస్యమును గుర్తించవలయును.

ఆదినుండియు నిప్పటివరకు మానవసంఘము శాంతికొరకెట్టి ప్రయత్నములు చేసెనో, ఆప్రయత్నము లెంతవరకు సఫలములయ్యెనో యొకసారి సింహావలోకనము జేసెదము. తొల్లి తిరుగుడుగుంపుల్లలో సాధ్యమైన విరోధులను జంపుటయు, కాకున్న మరియొక చోటికి పారిపోవుటయు శాంతికి మార్గములుగా తలంపబడుచుండెను. తదుపరి, సంఘము సంచారమును మాని యొకచోట స్థిరజీవితము నేర్పరచుకొన్నమీదట, విరోధులదాడినుండి రక్షణార్తము, నివసించు పల్లెచుట్టు పెద్దపెద్దగోడల నిర్మించు

కొనుచువచ్చెను. ఇందుల కుదాహరణముగా గ్రీకుల పట్ట
ణరాజ్యములను జూపవచ్చును. సంఘము వృద్ధియై మిక్కిలి
విశాలమగు దేశము నాక్రమించుకొనినమీదట కూడ
విరోధులు దాటలేని పెద్దగోడ కట్టి సంఘమున శాంతిని
కాపాడవలెనను ప్రయత్న ముండెను, చైనావారు సరి
హద్దున గట్టిన కొన్నివేలమైళ్ళదూరపు గోడ యిట్టి య
ద్భుతప్రయత్నమునే చాటుచున్నది.* ఇట్టిగోడలు శాంతిని
కాపాడలేవనియు, విరోధుల నడ్డుపెట్ట లేవనియు అచిర
కాలములోనే తెలియవచ్చెను. తదుపరి ఆయుధపాణులగు
శాశ్వతసైన్యములను, వారిరక్షణనిమిత్తము పెద్దపెద్ద
కోటలును నిర్మింపబడెను. ఈకోటలు, సైన్యములు కూడ
నిష్ప్రయోజనము లని త్వరలోనే గ్రహించగలిగిరి. తరు
వాత శాంతిసంరక్షణనిమిత్తము, రెండుమూడుసంఘము
లేకమై, సహకారసామరస్యము లను గలిగి యన్యోన్య
ముగా నుండుటకు ఒడంబడికలు గావించుకొనసాగినవి.
ఇట్టి యొడంబడికలచే తమలో తమకు విరోధము నశించు
ననియు, తనుసమష్టిబలము ఇతరసంఘముల విరోధ
మును బారద్రోల గలదనియు తలంపబడెను. ఇందునను
మానవులు విఫలమనోరథులైరి. ఒడంబడికలు, సమష్టి
బలములు సంఘమునకు శాంతిభద్రతల నీయజాలకపో
యెను. అంతట ఇట్లు రెండుమూడురాజ్యముల యొడం
బడికల వల్ల ప్రయోజనము లేదనియు, ప్రపంచమునగల
రాజ్యము లన్నియు కలసి యొకయొడంబడిక చేసికొనవలె
ననియు, ఆఒడంబడికషరతుల నిర్వర్తించగల యొక ప్రా
పంచికసంస్థ యవసరమనియు తోచెను. ఈభావన కను

గుణ్యాముగా నానారాజ్యసమితి యేర్పడెను. నానారాజ్య సమితి కూడ వాంఛితార్థముల నీయజాలదని దరిమిలా జరిగిన చరిత్రను బట్టి తేటతెల్లమాయెను. ఇకముందు చేయదలచినదానిని గూర్చి నేడు ప్రపంచమునందంతటను ఆలోచనలు జరుగుచున్నవి. ఇంతవరకు మానవసంఘము విరోధులను విరోధముచేతను, దౌర్జన్యమును దౌర్జన్యము చేతను సాధించవలె నను సూత్రమును బట్టి నడచెను. కాని యది నిరుపయోగమని స్పష్టమాయెను. ఇక దౌర్జన్యముతో లాభము లేదనియు, దౌర్జన్యరాహిత్యమే యిందులకు తగిన ఆయుధమనియు నిప్పుడు గుర్తించబడుచున్నది. ఆత్మశుద్ధి, ఆత్మగౌరవము, శాంతిసహాకారము—ఈయాయుధములచే మానవసంఘము ప్రపంచము నుండి అశాంతిని బారదోలి శాశ్వతశాంతిని, శాశ్వత సౌఖ్యమును నెలకొల్పగలదు. అశాంతిని బారదోలుటకు శాంతియే మార్గము. ఈ నూతనదృక్పథమునకు మన గాంధిమహాత్ముడే కర్త. దీనిని ప్రపంచ మెంతవరకవలంబించునో చూడవలసియున్నది.

# రాజకీయశాస్త్రము

(రెండవభాగము.)

## ౧.

## ప్రభుత్వము

### ౧. ప్రభుత్వముయొక్క వివిధరూపములు.

ఒకరాజ్యమునకును, మరియొకరాజ్యమునకును ప్రధానలక్షణములం దెట్టి భేదమును ఉండనేరదు. కాని, అందు గల ప్రభుత్వములుమాత్రము రూపమునందు పలు విధములుగా నున్నవి. రాజ్యముయొక్క పరిపాలనాధి కారము తాత్కాలికముగా ఒక వ్యక్తియందు గాని, లేక యొక సంఘమునందు గాని ఉండవచ్చుననియు; అట్లు పరిపాలనాధికారమును వహించిన వ్యక్తి, లేక సంఘమే, ప్రభుత్వ మనియు మన మిదివరలో తెలిసికొని యుంటిమి. కావున, మందు ప్రభుత్వములు తమసభ్యుల సంఖ్యను బట్టి వివిధము లగుచున్నవి. తరువాత, అవి గుణ మునుబట్టి కూడ విభాగింపబడుచున్నవి. ప్రభుత్వముల విభ జన సందర్భమున పురాతనశాస్త్రజ్ఞుడగు అరిస్టాటిల్ పండితుడు ఈదిగువరీతిని వ్రాయుచున్నాడు. సంఖ్యనుబట్టి ప్రభుత్వములు మూడువిధములు :—(౧) పరిపాలనాధి

కారము ఒకవ్యక్తియం దున్నపుడు దానిని రాజప్రభుత్వ మనియు, (౨) ఐశ్వర్యవంతులు, విద్యావంతులు నగు అల్పసంఖ్యాకులయం దున్న పుడు అభిజాత్యప్రభుత్వ మనియు, (3) ప్రభుత్వము సంఘమునం దధికసంఖ్యాకుల వశమై యున్నపుడు ప్రజాప్రభుత్వ మనియు వ్యవహరింప బడుచున్నవి. గుణమునుబట్టి పై మూడు విధములగు ప్రభుత్వములును సక్రమమైనవిగా నెంచబడుచున్నవి. సక్రమప్రభుత్వము లనగా సంఘసౌభాగ్యమే ప్రధాన ముగా గల ప్రభుత్వములు. ఈప్రభుత్వములే క్రమముతప్పి ప్రవర్తించినయెడల అక్రమప్రభుత్వము లగుచున్నవి. రాజప్రభుత్వము క్రమము తప్పినయెడల నిరంకుశప్రభుత్వ మగుచున్నది. ఆవిధముగానే అభిజాత్యప్రభుత్వము, ప్రజా ప్రభుత్వము అపసవ్యము లైనపుడు క్రమముగా స్వలాభ వర్గప్రభుత్వ మనియు, మూఢప్రభుత్వ మనియు పిలువ బడుచున్నవి.

పై విభజన అరిస్టాటిల్ పండితుని కాలమున గల ప్రభుత్వములకు సరిపోయియున్నను నేటిప్రభుత్వములలో గల విపరీతవిభేదముల కెంతమాత్ర మనువర్తింపదు. ప్రస్తుతకాలమున గల సంయుక్తప్రభుత్వములు, ఐక్య ప్రభుత్వములు అరిస్టాటిల్ పండితుని కాలమున లేవు. అది యునుగాక, నేటి బాధ్యతాయుతపరిపాలనాపద్ధతికూడ అరి స్టాటిల్ పండితు డెరుగడు. పై విభజనప్రకారము చూచిన బ్రిటిష్ ప్రభుత్వము, అమెరికాసంయుక్తరాష్ట్రప్రభు త్వము రెండును ప్రజలయం దధికసంఖ్యాకుల సమ్మతిపై నాధారపడినవగుటచే ప్రజాప్రభుత్వ మను శీర్షికక్రిందికే

వచ్చును. మరియు బ్రిటిష్ప్రభుత్వము రాజును గలిగియు న్నదను హేతువుచే రాజప్రభుత్వమను తరగతిక్రింద చేర్చ వచ్చును. నిజమునకు, పైన పేర్కొనబడిన మూడు ప్రభు త్వములయందును సామ్యములకంటె భేదములే యెక్కు వగా గన్పట్టును. అరిస్టాటిల్ పండితుని విభజననే ఖాయ పరచినయెడల ఇట్టివే యనేకసందిగ్ధావస్థల నుదాహ రణముగా జూపవచ్చును. ఇటీవల మాన్ టెస్క్యూ, రూసో, బ్లంట్షిప్లీ మొదలుగా గల గ్రంథకర్తలు కొంత మంది అరిస్టాటిల్ పండితుని విభజనకు కొన్నిసవరణలను చేసిరిగాని యందెద్దియును సంతృప్తికరమైనదిగా గను పించదు. ప్రస్తుతప్రభుత్వములకు వర్తించునట్లు, ఆధునిక లలో స్టిఫెన్ లీకాక్ అను ఆంగ్లగ్రంథకర్త యొకబాహు ళ్యమగు విభజనను చేయుచున్నాడు. అది యెట్టిదనిన:— ప్రథమమున ప్రస్తుతప్రభుత్వములను రెండుతరగతులుగా భాగింపవచ్చును. (౧) నిరంకుశప్రభుత్వములు (౨) ప్రజా ప్రభుత్వములు. ఇందులో ప్రజాప్రభుత్వములు రెండువిధ ములు. (౧) నియమబద్ధరాజప్రభుత్వములు, (౨) అ ధ్యక్షప్రభుత్వములు. నియమబద్ధరాజప్రభుత్వము, అధ్య క్షప్రభుత్వము రెండును ఐక్యప్రభుత్వములుగాను, సం యుక్తప్రభుత్వములుగాను విభజింపబడుచున్నవి. మరల ఈఐక్య, సంయుక్తప్రభుత్వములు రెండును బాధ్యతాయుత ప్రభుత్వములు, బాధ్యతారహితప్రభుత్వములుగా విభాగిం పబడుచున్నవి.

పరిపాలన మూడు ప్రత్యేకశాఖలచే నిర్వహించ బడుచున్నప్పటికిని, కార్యనిర్వాహకవర్గాధిపతినే ప్రభుత్వ

మున కంతకును మూలపురుషునిగా నెంచుచున్నారు. నిరంకుశప్రభుత్వ మనగా ప్రజలకు బాధ్యత వహించని ఒకవ్యక్తి పరిపాలన: సంఘమున నీతడు సర్వాధికారి; అన్నిశాఖలును ఈతనికి లోబడి ప్రవర్తించుచుండును. ప్రజాపరిపాలన యనునది సంఘమునందు అధికసంఖ్యాకుల సమ్మతిపై నాధారపడియుండును. పైన తెలిపినవిధముగా ఈప్రజాపరిపాలన రెండువిధములు.

(౧) నియమబద్ధరాజపరిపాలన:—ఇందు ప్రభుత్వము రాజుపేరిట సాగుచుండును. కాని, రాజు నిరంకుశుడు గాడు. అతడు నియమబద్ధుడు; ప్రజాభీష్టముల నతిక్రమించజాలడు.

(౨) అధ్యక్షపరిపాలన:—ఇచ్చట పరిపాలనాధికార మొకయధ్యక్షునియం దుండును. ఈతడు ప్రజలెన్నుకొనగా వచ్చువాడు. సాధారణముగా ఈయుద్యోగము ఐదుసంవత్సరములకంటె ఎక్కువకాల ముండదు; తదుపరి మరల యెన్నిక జరుగును. నియమబద్ధరాజపరిపాలన, అధ్యక్షపరిపాలన ఈరెంటియందును ఐక్యప్రభుత్వమనియు, సంయుక్తప్రభుత్వ మనియు రెండుపద్ధతులు గలవని పైన తెల్పితిమి. ఐక్యప్రభుత్వ మనగా కేంద్రప్రభుత్వమునకు రాష్ట్రీయప్రభుత్వములు లోబడియుండు విధానము. అనగా రాష్ట్రీయప్రభుత్వములపై సర్వవిషయములందును కేంద్రప్రభుత్వ మధికారమును కలిగియుండును. సంయుక్తప్రభుత్వములం దట్లుగాక కేంద్రప్రభుత్వమును, రాష్ట్రీయప్రభుత్వములును తమతమ యధికారార్హతలయందు సంపూర్ణస్వాతంత్ర్యమును గలిగి

యుండును. అనగా పరిపాలనాధికారములు రెండుప్రభు
త్వములమధ్య విభజింపబడుచున్నవి. అందుచే, నెవ్వరికి
సంక్రమించిన అధికారములను వారు నిర్వహింతురు గాని,
యొకరిజోక్య మొకరి కుండదు. ఏప్రభుత్వమునందు గాని,
కార్యనిర్వాహకశాఖ శాసనసభావిశ్వాసముపై నాధార
పడియున్నయెడల, అది బాధ్యతాయుతపరిపాలన యగు
చున్నది. అట్లు శాసనసభకు బాధ్యత వహించని కార్య
నిర్వాహకవర్గమును గలిగియున్న పరిపాలనావిధానము బా
ధ్యతారహితప్రభుత్వ మనబడుచున్నది.

లీకాక్ పండితుని విభజన ప్రస్తుత మమలులో
నున్న ప్రభుత్వాలకే గాని వెనుకటిప్రభుత్వముల కంతగా
నన్వయించదు. గ్రీసుదేశపు పట్టణరాజ్యములలో గల
ద్వంద్వరాజప్రభుత్వము, ఆభిజాత్యప్రభుత్వము మొదలగు
వానికిని మధ్యకాలమున ఐరోపాదేశమున వెలసిన జమీం
దారీప్రభుత్వమునకును పైవిభజనయందు తగిన సమా
ధానము లేదు. ప్రస్తుతము ఇటలీ, జర్మనీ దేశములందు
కొనసాగుచున్న నియంతలప్రభుత్వములను నిరంకుశప్రభు
త్వములుగా నెంచవచ్చును.

### ౨. లిఖితాలిఖితరాజ్యాంగములు.

రాజ్యాంగ మనగా రాజ్యముయొక్క రూపము,
దేశవైశాల్యమును, ప్రభుత్వముయొక్క రూపమును అధి
కారములను, ప్రజలహక్కులను, వీనికి గల అన్యోన్య
సంబంధమును నిర్ణయించువిధానమే రాజ్యాంగ మని
పిలువబడుచున్నది. ఆవిధానసూత్రములు లిఖితరూపమున

ఉండవచ్చును, లేక కేవల మాచారములుగా నుండ వచ్చును. ఆసూత్రములను నిర్వచించుపత్రమును రాజ్యాంగ పత్రమని, లేక రాజ్యాంగచట్టమని వ్యవహరించుచున్నారు. ఇప్పుడు ప్రపంచమున గల రాజ్యాంగము లన్నియు ఇంచుమించుగా లిఖితరూపమ్మున నే యున్నవని చెప్పవచ్చును. ఆచారములపై నాధారపడియున్న రాజ్యాంగములసంఖ్య చాల తక్కువ. అట్టివానియందు బ్రిటిష్ రాజ్యాంగము ముఖ్యమైనది. బ్రిటిష్ రాజ్యాంగముఖ్యసూత్రమగు, సమష్టిబాధ్యతాయుతమంత్రివర్గపరిపాలనావిధానము కేవలమొక యాచారమే గాని, యది యెందును లిఖింపబడి యుండలేదు. అంగ్లరాజు పార్లమెంటులో అధికసంఖ్యాకుల విశ్వాసమును గలిగియున్నవారినే తనకు మంత్రులుగా నియమించుకొనుటయు; ఆమంత్రివర్గము పార్లమెంటు ఒప్పుదల ఉన్నంతవరకే యుద్యోగమునం దుండుటయు, అది లేనిపూట మంత్రు లందరు సమష్టిగా తమయుద్యోగములకు రాజీనామాల నిచ్చి తొలగుటయు, మొదలుగా గల రాజ్యాంగవిషయములు సంప్రదాయానుసారముగా గౌరవింపబడుచున్నవే గాని, అట్లు జరుగవలెనని శాసించు చట్టము లేదు. కాని, యీసూత్రములు వ్రాతమూలమున లేనంతమాత్రమున ఆచరణయందు అవి లిఖింపబడిన శాసనములకంటె తక్కువగౌరవమును కలిగియున్నవని యెంచుట పొరపాటు. శాసనములతోపాటు ఆచారములును సమానగౌరవమును పొందుచున్నవి.

లిఖితరాజ్యాంగముల కుదాహరణముగా అమెరికా సంయుక్తరాష్ట్రముల రాజ్యాంగమును చూపవచ్చును.

ఇందు రాజ్యాంగసూత్రము లన్నియు ఖచితముగా ఒక రాజ్యాంగపత్రమునందు నిర్వచింపబడియున్నవి.

నిజమున కేరాజ్యాంగమును సంపూర్ణముగా లిఖిత రూపమున గాని, సంపూర్ణముగా ఆచారరూపమున గాని లేదు. బ్రిటిష్ రాజ్యాంగమున కూడ ప్రభుత్వాధికారము లను, ప్రజలహక్కులను నిర్ణయించు శాసనములు లేక పోలేదు. ఆవిధముగానే, లిఖితరాజ్యాంగములను గలిగి యున్న అమెరికాసంయుక్తరాష్ట్రములు, ఫ్రాన్సు మొద లగు దేశములందు రాజకీయాచారములును గలవు. అమె రికాసంయుక్తరాష్ట్రముల యందు ఒకవ్యక్తి వరుసగా రెండుపర్యాయములకంటె అధ్యక్షపదవి అలంకరించకూడ దను నియమ మొకయాచారమే గాని, వ్రాతమూలముగా నున్న సూత్రము గాదు. బ్రిటన్ దేశమునందు మగ్నా కార్టా అనబడు పత్రమును, ౧౬౮౯ వ సంవత్సరపు ప్రజ లహక్కుల ప్రణాళికయు, దరిమిలా ప్రజాప్రాతినిధ్యమును గూర్చి చేసిన చట్టములును రాజ్యాంగమునకు సంబంధిం చిన శాసనములుగా భావింపవచ్చును. మొత్తముమీద పరిపాలనకు సంబంధించిన సర్వవిషయములును లిఖితరూ పమున ఉండుటయే సురక్షిత మనుభావము అన్నిరాజ్యము లందును గాన్పించుచున్నది. పూర్వమునుండియు సంప్ర దాయానుగతముగా ఆచరింపబడు రాజ్యాంగసూత్రము లనేకములు నేడు శాసనములుగా చేయబడుచున్నవి.

౩. సరళరాజ్యాంగములు, క్లిష్టరాజ్యాంగములు.

రాజ్యాంగములు సరళము లనియు, క్లిష్టము లని యు రెండు విధములు. ఈభేదము ముఖ్యముగా రాజ్యాంగ

సంస్కరణకు సంబంధించినది. సులభముగా సవరణ జేయుటకు వీలగునట్టి రాజ్యాంగము సరళమైనదనియు, దానికి వ్యతిరేకమగు రాజ్యాంగము క్లిష్టమైన దనియు భావింపబడుచున్నది. ఉదాహరణపూర్వకముగా జూచిన ఈవిషయము మరింత తేలికగా అర్థ మగును. బ్రిటిష్ రాజ్యాంగమును సామాన్యపద్ధతినే పార్లమెంటులో అధికసంఖ్యాకుల యొప్పుదలతో సవరించవచ్చును. అమెరికాసంయుక్త రాష్ట్ర రాజ్యాంగసంస్కరణ యంత తేలిక కాదు. అందు సామాన్యశాసనసభను రాజ్యాంగపత్రమును సవరించుటకు గాని, రద్దు చేయుటకు గాని అధికారము లేదు. రాజ్యాంగసూత్రములను మార్చవలె నన్న, ఒక ప్రత్యేక విధానము నిర్ణయింపబడియున్నది. అది మిక్కిలి క్లిష్టమైనది. దానికి రెండుపద్ధతులు గలవు. (౧) కేంద్రశాసనసభాసభ్యులలో మూడింట రెండువంతులు కలసి రాజ్యాంగసంస్కరణావశ్యకత నిరూపించుచు, అవసరమగు సవరణాల ప్రతిపాదించవలెను. అట్లు ప్రతిపాదించిన సవరణాలను నాలుగింట మూడువంతులు రాష్ట్రశాసనసభాసభ్యు లామోదించవలెను. (౨) లేక మూడింట రెండువంతులు రాష్ట్రశాసనసభాసభ్యులు సవరణాలగోరుచు కేంద్రశాసనసభకొక మహజరు పెట్టుకొనినమీదట, కేంద్రశాసనసభ అవసరమగు సవరణాలను ప్రతిపాదించునిమిత్తము ఒక ప్రత్యేక సంయుక్తరాష్ట్రప్రతినిధి మహాసభను (కన్‌వెన్‌షన్) సమావేశపరచవలెను. ఈమహాసభవారు ప్రతిపాదించిన సవరణాలు మరల నాలుగింట మూడువంతుల రాష్ట్రీయములలో పైవిధముగా సమావేశమైన రాష్ట్రప్రతినిధిమహా-

సభలలో ఆమోదింపబడవలెను. ఈ రెండుమార్గములును ఎంతక్లిష్టములైనవో వేఱుగ చెప్పనవసరము లేదు.

---

## ౨
## ప్రభుత్వముయొక్క వివిధశాఖలు

ప్రభుత్వస్వరూప మెట్టిదైనను, అది నెరవేర్చవలసిన రాచకార్యములు ముఖ్యముగా మూడు:—(౧) శాసనముల చేయుట, (౨) వానిని అమలుజరుపుట, (౩) వానిని ననుసరించి న్యాయవిచారణచేయుట. రాజప్రభుత్వము గానిండు, ప్రజాప్రభుత్వము గానిండు, లేక యే యితరప్రభుత్వమైనను గానిండు ఈమూడువిధులను తప్పక నెరవేర్చవలసియున్నది.

ఇంతకుపూర్వ ముదాహరింపబడినట్లుగా, ఈ మూడు కార్యములును నేటిరాజ్యములందు మూడు ప్రత్యేకశాఖల వశముచేయబడుచున్నవి. ఈశాఖలయొక్క స్వభావము లెట్టివో తెలిసికొనుట ముఖ్యము. ఇందు ఒకటి ఎక్కువ యనియు, నొకటి తక్కువ యనియు భావించుట గొప్పపొరపాటే యగును. శరీరావయవము లందు ఎక్కువతక్కువలు నిరూపించుట యెట్టిదో ఇదియు నట్టిదే. ప్రభుత్వమునకు దీమూడుశాఖలును సమాన ప్రాముఖ్యమును కలిగియున్నవని చెప్పవలయును.

### ౧. శాసనసభ.

సంఘముయొక్క అవసరములను బట్టియు, ప్రయో

జనములను బట్టియు శాసనములను చేయుట, అమలునం దున్న శాసనములను సవరించుట, లేక రద్దుచేయుట మొదలగు కార్యములు శాసనసభకు చెందినవి. నేటిరాజ్యము లందు శాసనాధికార మత్యంతావసర మగుచున్నది. కాల మెల్లప్పుడొక్కరీతిగా నుండదు. సంఘమును, సంఘోద్దేశ్యములును కాలానుగుణ్యముగా మారుచుండును. ౧౮ వ శతాబ్దపు మనుష్యులకును నేటి మనుష్యులకును, నాటి యాచారములకును నేటి యాచారములకును, నాటి భావములకును నేటి భావములకును, నాటి యవసరములకును నేటి యవసరములకును ఎంతో తారతమ్యము కలదు. ఆనాటి భావములు నేడు హాస్యాస్పదముగా గన్పడవచ్చును; ఆనాటి సదాచారములు నేడు దురాచారములు గావచ్చును; ఆనాడు సంఘసౌభాగ్యమునిమిత్తము చేయబడిన శాసనములు నేడు సంఘౌన్నత్యమునకు ప్రతికూలము గావచ్చును. కావున సమయానుకూలముగా శాసనములను చేయుట, సంస్కరించుట, రద్దు చేయుట నేటి సంఘమునకు అత్యంతము అవసరమగుచున్నది. అట్టి యధికారము గల సంస్థయే లేనియెడల, సంఘ మధోగతిపాలు గావలసియుండును. అదియునుగాక, కొన్ని రాజ్యములయందు కార్యనిర్వాహకవర్గస్థితి శాసనసభావిశ్వాసముపై నాధారపడియుండుటచే, శాసనసభకు రాజ్యాంగమునందు విలువ మరింత యెక్కువ యగుచున్నది. శాసనముల నమలుజరుపుటకంటెను, వాని ననుసరించి న్యాయవిచారణచేయుటకంటెను శాసనములు చేయుట యనునది ముందు జరుగవలసిన కార్యము గనుక

క్రమానుగతముగా చూచిన శాసనాధికారము ప్రభుత్వ విధ్యుక్తధర్మములలో మొట్టమొదటి దగుచున్నది.

## ౨. కార్యనిర్వాహకవర్గము.

దీని ముఖ్యవిధి శాసనముల నమలుజరుపుట. అమలులోనికి రాని శాసనములు కేవలము ప్రయోజనరహితము లగును. శాసనములు చేయుటకంటె వానిని నిర్విఘ్నముగా నమలుజరుపుట ఎన్నియోరెట్లు కష్టతరమైన పని. ముఖ్యపట్టణమున నొకమహాభవనమున శాసనసభ సమావేశమై విచ్చలవిడిగా శాసనముల తయారుచేయవచ్చును గాక, అట్టి శాసనముల జనసామాన్యమున నిరభ్యంతరముగాను, అవిచ్ఛిన్నముగాను చెలామణియగునటుల వ్యవహరించుటయే మహత్కార్యము. సంఘమంతయు ప్రభుత్వశాసనముల సగౌరవముగా మన్నించుట యెప్పుడును జరుగు పనికాదు: ప్రతిశాసనమునకును ప్రతికూలు రనేకు లుందురు. ఎట్టిపరిస్థితులలోనైనను రాజ్యశాసనమును కార్యనిర్వాహకవర్గము ధైర్యముతోను, ధృడసంకల్పముతోను నిరాఘాటముగా నమలుజరుపవలసియున్నది. కావుననే సైనిక, నావిక, వైమానిక దళములును; రక్షకభటులును (పోలీసుశాఖయును) కార్యనిర్వాహకవర్గముయొక్క కనుసన్న మెలగుచుందురు. శాసనముల నమలుజరుపు సందర్భమున, కార్యనిర్వాహకవర్గమునకు తగినంత స్వాతంత్ర్య మీయబడుచున్నది. ఆ యాపరిస్థితులను బట్టి వానిని ఎప్పుడు ఎచ్చట ఎవ్విధమున చెల్లాయించవలెనో యదియంతయు కార్యనిర్వాహకవర్గమునకే వదలివేయబడుచున్నది. ముఖ్యముగా విదేశవ్యవ

హారములందు కార్యనిర్వాహకవర్గము తనకు యుక్తమని తోచిన విధముగా ప్రవర్తించుటకు సంపూర్ణస్వాతంత్ర్యమును కలిగియున్నది. ప్రతిపౌరునకు తననిత్యజీవితమునందు కార్యనిర్వాహకవర్గమునకు చెందిన సిస్తువసూలు, తపాలా, నీటిపారుదల, పోలీసు మొదలగు యుపశాఖలయుద్యోగస్థులతో సంపర్క మెక్కుడుగా నుండును. తక్కిన రెండు శాఖలలో నున్న యుద్యోగులసంఖ్యకంటె ఈశాఖకు చెందిన యుద్యోగులసంఖ్య ఎన్నియో రెట్లధికము. దీనికి కారణము ఆశాఖయందుండు కార్యభారమే.

### ౩. న్యాయస్థానము.

మూడవదియగు న్యాయస్థానము తక్కిన రెండు శాఖలకును ప్రాముఖ్యమునందు తీసిపోవునదికాదు. అమలునందున్న శాసనములను నిత్యవ్యవహారముల కనువర్తింపజేసి, ఇటు పౌరులలో పౌరులకును, అటు పౌరులకును ప్రభుత్వమునకును మధ్య న్యాయనిర్ణయముచేయుట ఈశాఖయొక్క కర్తవ్యము. అమెరికాసంయుక్తరాష్ట్రములయందు న్యాయస్థానశాఖకు మరియొక ప్రత్యేకప్రాముఖ్యము కూడ గలదు. అచ్చట శాసనసభయొక్క అధికారార్హతలను విచారించుటకు న్యాయస్థానమున కధికారముగలదు. ఇట్టి యధికారము ఐరోపాఖండపు రాజ్యములలో గల న్యాయస్థానములకు లేదు. న్యాయస్థానమే లేకున్న పౌరులహక్కులు, స్వాతంత్ర్యములు నడుగంటును. కార్యనిర్వాహకవర్గమువారొక్కొక్కప్పుడు పొరపాటుననేమి, లేక బుద్ధిపూర్వకముగానేమి పౌరులపై అక్రమచర్యలను తీసికొనవచ్చును; కష్టనష్టముల పాలు

చేయవచ్చును. అట్టి సందర్భములలో పౌరునకు న్యాయస్థానమే దిక్కు. పౌరుడు దానిమూలమున తనకు అక్రమముగా సంభవించిన కష్టనష్టములకు పరిహారమును పొందగలుగుచున్నాడు ; తనహక్కులను, స్వాతంత్ర్యములను కాపాడుకొనగలుగుచున్నాడు.

౪. ప్రభుత్వ శాఖల అన్యోన్య సంబంధము.

ప్రభుత్వముయొక్క మూడుశాఖలును క్రమము దప్పక సఖ్యతతో ప్రవర్తించినప్పుడే పాలనాసౌష్ఠవమును, సంఘసౌభాగ్యమును చేకూరగలవు. కావున ఈమూడు శాఖలకును గల యన్యోన్యసంబంధము లెట్లుండవలయునో మనము విచారింపవలసియున్నది.

ఈసందర్భమున అధికారవిభజన యను సిద్ధాంత మొకటి గలదు. ప్రభుత్వముయొక్క మూడుశాఖలును వేర్వేరుగా విడదీయబడవలెననియు, అందొకశాఖకు చెందినవారికి మరియొకశాఖతో ఎట్టి జోక్యము నుండగూడదనియు, ప్రతిశాఖయు తనవిధులను నెరవేర్చుటలోను, అధికారములను చెలాయించుటలోను సంపూర్ణ స్వాతంత్ర్యమును కలిగియుండవలెననియు నీసిద్ధాంతము యొక్క తాత్పర్యము. ప్రభుత్వముయొక్క సర్వాధికారములు నొకవ్యక్తియందు గాని, లేక యొకసంఘమునందు గాని, మూర్తీభవించి యున్నయెడల, అది కేవలము నిరంకుశప్రభుత్వమే యగుచున్నదనియు, అందు ప్రజల కెట్టి రక్షణయు నుండజాలదనియు నీసిద్ధాంతుల యభిప్రాయము.

ఇది యెంతవరకు సత్యమో మన మిప్పుడు పరిశీంతము. ఈసిద్ధాంతము ప్రజాప్రభుత్వముతో పుట్టిన దన

వచ్చును. ఇది అమెరికాసంయుక్తరాష్ట్రములందు మి క్కిలి ప్రాముఖ్యమును వహించెను. సంయుక్తరాష్ట్రములయందు కూడ పైసిద్ధాంతమున ప్రతిపాదించినంతగా ప్రభుత్వశాఖలు స్వాతంత్ర్య మనుభవించుటలేదు. కాని, మొత్తముమీద తదితరరాజ్యము లన్నిటికంటె సంయుక్తరాష్ట్రము లీయధికారవిభజనసూత్రము నెక్కుడుగా నంగీకరించి యాచరణలోనికి దెచ్చెననుటలో సంశయములేదు. పైసిద్ధాంతమును సంపూర్ణముగా నాచరణలో బెట్టవలె నన్న శాసనసభయు, కార్యనిర్వాహకవర్గమును, న్యాయమూర్తులును ప్రత్యక్షముగా ప్రజలచే నెన్నుకొనబడ వలెను. అట్లెన్నుకొనబడుటయే గాక, అందొకశాఖపై మరియొకశాఖ కెట్టియధికారము నుండగూడదు. ఇట్టి విభజన కేవల మసంభవము. ఏలననగా, ఇందేశాఖ క్రమము తప్పి ప్రవర్తించినను శిక్షించు అధికారిలేదు. ఇట్టి విధానము సంఘసౌభాగ్యమునకు బదులుగా సంఘ వినాశమునకు హేతువగును. అదియునుగాక, ఇట్లు మూడుశాఖలును ప్రత్యక్షపుటెన్నికచే ఏర్పడి నప్పటికిని శాసనసభ చేసిన శాసనములనేగదా కార్యనిర్వాహకవర్గ మమలుజరుపునది. శాసనసభ యెట్టి ఘోరశాసనముల చేసినను కార్యనిర్వాహకవర్గమును, న్యాయస్థానమును వానిని అంగీకరింపవలసినదే. కావున వెనుకటి రెండుశాఖలును శాసనసభకు లోబడినవనియే చెప్పవలయును. అగుట ఈమూడుశాఖలకును సంపూర్ణస్వాతంత్ర్య మిచ్చినంతమాత్రమున ప్రజలహక్కులు సురక్షితములని చెప్పుటకు వీలులేదు.

ఈవిభజన ప్రస్తుతప్రభుత్వములయం దెంతవరకు ఆచరణయం దున్నది పరిశీలింతము. దీనికి జన్మస్థానమగు అమెరికాసంయుక్తరాష్ట్రములందు శాసనసభయు, కార్య నిర్వాహకవర్గమున అధ్యక్షుడును ప్రజలచే నెన్నుకొన బడుదురు. న్యాయమూర్తులు అధ్యక్షునిచే నియమింప బడుదురు. శాసనసభయొక్క శాసనములను కొన్ని సం దర్భములందు నిరాకరించుట కధ్యక్షుని కధికారముగలదు. అదియునుగాక, అధ్యక్షుడు సందేశములను పంపుట మూ లముగా శాసనసభాకార్యక్రమమునందు కొంతవరకు పాల్గొనుచున్నాడు. అధ్యక్షుడు ఇతరరాజ్యములతో జరి పిన యొడంబడికలను శాసనసభ యామోదించవలయును. ఇక న్యాయస్థానములవిషయమున, న్యాయమూర్తులకు తక్కిన రెండుశాఖలవారిచర్యలు రాజ్యాంగచట్టసమ్మత మా కాదా యను విచారణాధికారము గలదు. పైవిష యములను బట్టి చూచిన కేంద్రప్రభుత్వమునందు విభ జనసిద్ధాంతము చాలవరకు తనతీవ్రతను గోల్పోవుచున్నది. రాష్ట్రీయప్రభుత్వములందు విభజన కేంద్రప్రభుత్వమున కంటె ఎక్కుడుగా గలదని చెప్పవచ్చును. ఏలననగా, రాష్ట్రములయందు శాసనసభాసభ్యులతోపాటు కార్య నిర్వాహకవర్గమునందలి పైయుద్యోగులును, న్యాయాధి పతులును ప్రజలచే నెన్నుకొనబడుదురు. కాని, కార్య నిర్వాహకవర్గమున ప్రధానియగు గవర్నరు కొన్నిసందర్భ లందు శాసనసభకు సందేశముల పంపుటకు, శాసనముల నిరాకరించుటకు నధికారమును గలిగియుండుట విభజన సిద్ధాంతమునకు విరుద్ధమే యగును. అదియునుగాక,

ప్రభుత్వోద్యోగులు తమయుద్యోగమురీత్యా చేసిన కార్యములను గూర్చి, న్యాయాన్యాయవిచారణచేయుటకు న్యాయస్థానములకు హక్కుగలదు. ఇదియు సంపూర్ణవిభజనకు విరుద్ధమే.

బ్రిటిష్ప్రభుత్వమునందీయధికారవిభజనసిద్ధాంతము సంపూర్ణముగా త్రోసివేయబడినదని చెప్పవచ్చును. బాధ్యతాయుత మంత్రివర్గపద్ధతి బ్రిటిష్ప్రభుత్వమునకు మూలకందము. మంత్రివర్గము కార్యనిర్వాహకశాఖయందు అగ్రస్థానము వహించుచున్నను, శాసనసభయగు పార్లమెంటునందు సభ్యత్వమును గోల్పోవుటలేదు. నిజమునకు, పార్లమెంటునందు ముఖ్యమగు ప్రతిపాదన లన్నియు మంత్రివర్గమునుండియే వచ్చుచున్నవి. కావున కార్యనిర్వాహకవర్గమునకు శాసనసభయందు గొప్పప్రాముఖ్యముగలదు. మంత్రివర్గము చేసిన ప్రతిపాదన పార్లమెంటు నిరాకరించుట తటస్థించినయెడల మంత్రులు యావన్మందియు తమయుద్యోగములకు రాజీనామాల నిచ్చి తొలగవలయును. లేక పార్లమెంటు మరేయితరకారణమునగాని మంత్రివర్గమునందు అవిశ్వాసమును వెల్లడించినయెడల మంత్రులు తమపదవులనుండి బయటికి రావలయును. న్యాయస్థానముల విషయమున, న్యాయమూర్తులను నియమించు నధికారము మంత్రివర్గముతో గూడిన రాజునందు గలదు. అదియునుగాక న్యాయపరిపాలనయందు ప్రభువులసభ యగ్రస్థానమును వహించుచున్నది. ఈ పై విషయములను బట్టి ప్రభుత్వము సర్వము పార్లమెంటునం దధికసంఖ్యాకుల వశమై యున్నదని చెప్ప

వచ్చును. అట్లని, న్యాయమూర్తులు మంత్రులకు గాని, పార్లమెంటునకు గాని కేవలము తాబేదారు లనుటకు వీలులేదు. మంత్రిగారలయధికారము న్యాయమూర్తుల నియమించుటవరకే గాని, తదుపరి వారి యుద్యోగనిర్వహణమునం దెట్టి జోక్యమును కల్పించుకొనగూడదు. శాస్త్ర పద్ధతిగా చూచిన, బ్రిటిష్ ప్రభుత్వమునం దీమూడు శాఖలను వేర్వేరుగా నిరూపించి చూపవచ్చును. పార్లమెంటు శాసనముల చేయును; రాజు మంత్రులసహాయమున కార్యమును నిర్వహించును; న్యాయస్థానములు న్యాయ విచారణ చేయును.

పై సందర్భములను బట్టి చూచిన, ప్రభుత్వాధికారములందు సంపూర్ణ విభజన యసంభవమని తోచక మానదు. కాని సర్వాధికారములును ఒక్కనియందే మూర్తీభవించి యుండుట అంతకంటె అప్రశస్తము. ప్రభుత్వాధికారములు సర్వము నొక్కచోటనే ఘనీభవించకూడదు. ఏమాత్రము సంబంధము లేని విభజనయు కూడదు. రాజ్యమునకు పరమావధియగు సంఘసౌభాగ్యము నొడగూర్చుటలో మూడుశాఖలకును చక్కని కలుపుగోలుతన ముండవలయును, వానికి కేవలము సంపర్కమే లేనియెడల వానిమధ్య పెక్కుపొరపులు రావచ్చును. అందువల్ల సంఘమునకు తీరనినష్టము సంభవించును. ప్రభుత్వము యొక్క మూడుశాఖలకును ఆయాపరిస్థితులను బట్టి, అటు స్వేచ్ఛయు, విభజనయు, ఇటు అన్యోన్యసంబంధమును, సామరస్యమును తగినట్లుగా నుండవలయును.

# ౩
# శాసనసభ



## ౧. సభ్యుల సంఖ్య.

దేశౌన్నత్యమునకు, సంఘసౌభాగ్యమునకు అనుకూలములగు శాసనములను చేయుట శాసనసభ యొక్క ముఖ్యవిధియగుటచే దానికి విషయపరిజ్ఞానము, చర్చ, విమర్శ, దూరాలోచన మొదలగునవి ప్రధానలక్షణములగుచున్నవి. సంఘమున కంతకును వర్తించు శాసనమునొకదానిని చేయవలెనన్న సంఘపరిస్థితులను ముందు బాగుగా నెరిగి యుండవలయును. తదుపరి, ఆ శాసనముయొక్క బాగోగులను గూర్చి సంపూర్ణమగు చర్చయు, విమర్శయు జరుగవలెను. అటుపిమ్మట, దానిచే గలుగు ఫలితములను, పర్యవసానములను గురించి యూహించగలిగినంత దూరాలోచన ఉండవలయును. ఇన్ని కలిసినప్పుడే శాసనసభ తనవిధ్యుక్తధర్మమును సక్రమముగా నెరవేర్చ గలిగి యుండును. స్టీఫెన్ లీకాక్ అను గ్రంథకర్త వ్రాసినటుల ఇట్టికార్యమున కెప్పుడును ఒక తలకంటె రెండుతలలు మేలు; రెంటికంటె రెండువందలు మేలు. అందుచేతనే, ప్రస్తుతప్రభుత్వములందు, శాసనసభాసభ్యులసంఖ్య మిక్కిలి హెచ్చుగా నున్నది. సాధారణముగా, సంఘమునందనేకజాతు లుండును; అనేకమతము లుండును; అనేకవృత్తు లుండును; పెక్కుతరగతుల ప్రజ లుందురు. ఒకవ్యక్తి యెంతటి సమర్థుడయినను ఇంతటి బాహుళ్య

మైనట్టియు, నిన్నితరగతుల భేదముల గలిగినట్టియు, సంఘ మున కంతకును వర్తించు సర్వతోముఖమగు శాసనముల చేయుట చాలకష్టము. సంఘమునం దన్ని తరగతులవారి కష్టసుఖములను నాలోచింపగలిగినంత ప్రాతినిధ్యము గల సభయే ఇక్కార్యము నెట్టి యొడుదుడుకులు లేక నెర వేర్చగలదు. కావున శాసనసభయందు సంఘప్రాతినిధ్య మును, సభ్యులసంఖ్యయు నెంత విశేషముగా నున్న నంత మంచిది.

అట్లని, ప్రాతినిధ్యము గాని, సభ్యులసంఖ్య గాని మితిమీరియుండ గూడదు. సభ్యులసంఖ్య యపరిమితమైన యెడల ఆసభ యేకార్యమును సక్రమముగా కొనసాగించ జాలదు. ఆయా దేశములయొక్కయు, ఆయాసంఘముల యొక్కయు స్థితిగతులను బట్టియు, కార్యసానుకూలమును బట్టియు శాసనసభలో ప్రజాప్రాతినిధ్యము, సభ్యులసంఖ్య నిర్ణీతములగుచున్నవి.

౨. ఏ క శా స న స భ, ద్వం ద్వ శా స న స భ.

ఒకటే శాసనసభను గలిగియున్నపు డేకశాసన సభయనియు, రెండుసభలను గలిగియున్నపుడు ద్వంద్వ శాసనసభయనియు వ్యవహరించుచున్నారు. రెండుసభ లున్నచోట రెండును కలసి గాని పూర్ణ శాసనసభ కానేరదు. ఇం దొకదానిని పైసభ యనియు, రెండవదానిని క్రింది సభ యనియు పిలుచుటవాడుక. ఈ పైసభను బ్రిటన్ దేశమునందు ప్రభువులసభ యనియు, అమెరికా సంయుక్తరాష్ట్రములయందు సెనేట్ అనియు పిలుచు చున్నారు.

సాధారణముగా నేడన్ని రాజ్యములును ద్వంద్వశాసనసభావిధానమునే యవలంబించుచున్నవి. ఏకసభగల రాజ్యములసంఖ్య చాల తక్కువ. శాసనసభ యొకటిగా నుండుటయందుకంటె రెండుగా నుండుటయందు కొన్ని మేళ్ళధికముగా గన్పించుచున్నవి. శాసనసభ యొక్కటే యైనయెడల దానిచర్యల పరిశోధించుటకును, ప్రశ్నించుటకును నవకాశము లేదు. శాసనసభ యొక్కొకతరి తగినంత చర్చను చేయక, ముందువెనుకల గమనించక, యుద్రేకమున శాసనముల జేయుట సామాన్యసంభవమని యనుభవమును బట్టి చెప్పవచ్చును. శాసనముల చేయుటలో తొందరయు, ఉద్రేకమును, ఉత్సాహమును పనికిరావు. ఇట్టిప్రమాదములయొక్క ఫలితముల నరికట్టుటయే ద్వంద్వశాసనసభల ముఖ్యోద్దేశ్యము. ఒకసభయందామోదింపబడిన ప్రతిపాదన రెండవసభచే ప్రతివిషయమునను మరల చర్చింపబడి యంగీకరింపబడిననే తప్ప, శాసనము గానేరదు. రెండుసభలును నామోదింపవలెనన్న, సాధారణముగా కొంత కాలవిలంబమగును. మొదటి తొందరలు, ఉద్రేకములు రెండవసభకు వచ్చుసరికి తగ్గిపోవును. రెండవసభలో నామూలాగ్రముగా ప్రతిపాదనను చర్చించుసరికి, యందలి మంచిచెడ్డలు స్పష్టమగును. మొదటి సభయం దంగీకరింపబడిన ప్రతిపాదనలో తప్పులను కనిపెట్టుటయే రెండవసభయొక్క ముఖ్యోద్దేశ్యమై యుండును. ఇట్లు రెండుసభలలోను తర్జనభర్జనమై యంగీకరింపబడిననే శాసన మగును. కనుక, సాధారణముగా పైన పేర్కొనబడిన ప్రమాదములకు తావుండదు.

## 3. శాసనసభానిర్మాణము.

శాసనసభ తక్కిన రెండుశాఖలవలెగాక, సంపూర్ణముగా ప్రజలెన్నుకొనిన ప్రతినిధులచే నిర్మింపబడుచున్నది. సభ్యులసంఖ్య జనసంఖ్యను బట్టి యుండును. అనగా ఇంతమంది పౌరుల కింతమంది సభ్యులని నిర్ణయింపబడును. ద్వంద్వశాసనసభయున్నచోట పైసభయొక్క సభ్యులకును, క్రిందిసభయొక్క సభ్యులకును కొంత వ్యత్యాస మున్నది. క్రిందిసభకు చెందిన సభ్యులు జనసామాన్యముచే ప్రత్యక్షముగా నెన్నుకొనబడుదురు. ఎన్నికకు మినహా క్రిందిసభకు సభ్యుడగుటకు మరియొక మార్గము లేదు. అందుచేతనే క్రిందిసభకు ప్రజాప్రతినిధిసభ యని కూడ పేరుగలదు. ఇందు జనసంఖ్యను బట్టి సభ్యులసంఖ్యయు హెచ్చుగానే యుండును. పైసభయొక్క నిర్మాణ మిట్టిది కాదు. ముందు పైసభలో క్రిందిసభలో నున్నంతమంది సభ్యు లుండరు. దీనియందు యెన్నికసభ్యులును, నియమితసభ్యులును ఉందురు. కొన్ని దేశములందు వారసత్వముద్వారా ఏర్పడిన సభ్యులు కూడ ఈసభయందు గలరు.

[ఇట్టి వారసత్వపుసభ్యులు గల సభలలో ముఖ్యమైనది బ్రిటిష్‌ప్రభువులసభ. ప్రభువు పెద్దకుమారుడు తనకు యుక్తవయస్సు వచ్చుటతోడనే ఈసభకు సభ్యు డగుచున్నాడు. ఈప్రభువుల సంఖ్య చావులచే తగ్గుటయు, సార్వభౌముడు ప్రభుబిరుదముల క్రొత్తగా నితరుల కిచ్చుటచే పెరుగుటయు కలుగుచుండును. రాజకుటుంబమునకు చెందిన రాకుమారు లందరును నిందు సభ్యత్వమును గలిగియున్నారు. వీరుగాక మతాధిపతులును, సార్వభౌమునిచే ప్రభుబిరుదములను పొంది జీవితసభ్యులుగా నియమింపబడునట్టి

ధర్మశాస్త్రవేత్తలును, ఐర్లాండు స్కాట్లండు నుండి ప్రభువులచే నెన్ను కొనబడిన సభ్యులును గలరు. ఇంతహెచ్చుగ వారసత్వపు సభ్యులు గల సభ మరెచ్చటను లేదు. థామస్ పెయిన్ అను నొక గ్రంథ కర్త శాసనసభలో వారసత్వపుసభ్యత్వమును నిరసించుచు ఇట్లు వ్రాయుచున్నాడు:—“వారసత్వముచే కవులును, జ్ఞానవంతులును, గణికులును, న్యాయమూర్తులును ఏర్పడుదురన్న ఎంతటి హాస్యాస్పదమో, వారసత్వముచే శాసనకారు లేర్పడుటయు నంతటి హాస్యాస్పదమే. బ్రిటిష్ప్రభువుల్లసభ పూర్వ మెప్పటినుండియో వచ్చుచున్న యొకసంస్థ. శాసనముల చేయుటలో ఈసభయొక్క యధికారములు కేవలము నామమాత్రములు. సాధారణముగా, రాజ ప్రభుత్వము గల దేశములందుమాత్రమే ఈవారసత్వపు సభ్యులు పైసభలయం దుండుట తటస్థించుచున్నది.]

ప్రజాప్రభుత్వములందు పైసభలలో ఎన్నికసభ్యులును, నియమితసభ్యులును మాత్రమే ఉందురు. కాని, వారసత్వపు సభ్యులు లేరు. ఈసభకు సంబంధించిన ఎన్నికలకును, ఎన్నికదారుల యర్హతలకును; క్రింది సభల ఎన్నికలకును, ఎన్నికదారుల యర్హతలకును, చాల వ్యత్యాస మున్నది. పైసభకు చెందిన యెన్నికదారులు మిక్కిలి ధనవంతులై యుందురు. సాధారణముగా వీరు ప్రభుత్వమునకు పన్నులరూపమున పెద్దమొత్తములను చెల్లించు భూస్వాములును, వర్తకులు నై యున్నారు. పైసభకు కొద్దిమంది సభ్యులను నియమించుట కూడ గలదు. దీనికి కారణ మేమనగా అనుభవజ్ఞులు, సమర్థులు నగువారు యెన్నికలయందు ప్రత్యర్థులుగా నిలువకపోవచ్చును. నిలిచినను అపజయమును పొందవచ్చును. ఎన్నికలలో గెలుపొందినవా రందరు సమర్థు లనుటకు వీలు లేదు. మంచి వాకచక్యముగల మాటకారి తాత్కాలిక

ముగా ప్రజలను తనవైపునకు త్రిప్పుకొని, తనకంటె ఎన్నియో రెట్లు తెలిసినవాడును, సమర్థుడు నగు ఒకమితభాషిని ఎన్నికయం దోడింపవచ్చును. కులకక్షలు, మతకక్షలు మొదలగువానిచే ఎన్నికఫలితములు సంతృప్తికరములుగా నుండకపోవచ్చును. అదియునుగాక కొంతమంది యెన్నికలయందు సామాన్యముగా జరుగుచుండు కల్లోలములు, మాయోపాయములు, నేరములు మొదలగువానిలో పాల్గొనుట కిష్టములేక సభ్యత్వమునకు పోటీచేయకపోవచ్చును. అట్టి యనుభజ్ఞులు, పండితులు, సభయందుండుట మంచిదని ప్రభుత్వమునకు తోచిన యెడల వారిని పైసభకు సభ్యులుగా నియమించెదరు. ఇట్టి సభ్యులను నియమించు అధికారము కార్యనిర్వాహకవర్గము యొక్క ప్రధానియం దుండును. ఇట్టి నియమితసభ్యుల నించుమించుగా పైసభలయం దన్ని దేశములలోను చూచుచున్నాము.

౪. ప్రత్యక్షపు టెన్నికలు, పరోక్షపు టెన్నికలు.

ప్రత్యక్షపు టెన్నిక లనగా ప్రజలే సభ్యుల నెన్నుకొనుట. పరోక్షపు టెన్నిక లనగా ప్రజలచే నెన్నుకొనబడిన సభ్యులు తమలో కొందరిని తిరిగి యెన్నుకొనుట. క్రిందిసభయొక్క సభ్యు లెప్పుడును ప్రత్యక్షపు టెన్నికల ద్వారా ఎన్నుకొనబడుదురు. పైసభకు మాత్రము కొన్ని దేశములందు ఎన్నిక పరోక్షముగాను, కొన్ని దేశములందు ప్రత్యక్షముగాను జరుగుచున్నది. ఇందుల కుదాహరణముగా ఫ్రాన్సు దేశమును చూపవచ్చును. పైసభ క్రిందిసభకు కేవలము ప్రతిగా నుండగూడదను సూత్రమే దీనికి

కారణము. రెంటికిని ప్రత్యక్షపు టెన్నికలే జరుగు దేశ ములందు నియోజకవర్గము భేదముగా నున్నది.

### ౫. శాసనసభ యొక్క కాలపరిమితి.

ఒకసారి ఏన్నుకొనిన శాసనసభ దానిస్వభావమును బట్టి యెక్కువకాలము అమలులో ఉండుట ప్రజాప్రభుత్వసూత్రములకు విరుద్ధము. నే డెన్నుకొన్న సభ్యులు నేటి ప్రజల యుద్దేశ్యములనే ప్రతిధ్వనింపచేయ గలరు కాని, ముందు ప్రజలలో జరుగు మార్పులను గుర్తింపజాలరు. ఎన్నికలు ప్రజలలో కలుగుమార్పుల ననుసరించి వెంటవెంటనే జరుగుచుండవలయును. ఐనను, ప్రస్తుతప్రభుత్వములయందు సాధారణముగా నైదుసంవత్సరములకు మించకుండ కాలపరిమితి నొకదానిని నిర్ణయించుట ఆచారమైనది. ఇట్లు కాలపరిమితి నేర్పరచినను. అవసరములను బట్టి ఆసభను పరిమితికాలమునకు ముందే రద్దుచేసి మరల యెన్నికల జరుపుటకు కార్యనిర్వాహకవర్గాధిపతి కధికార మున్నది. ఎన్నికలు జరుగునాటికి లేక తదుపరి ఏర్పడిన క్లిష్టపరిస్థితులను బట్టి యేదైన ముఖ్యమగు సమస్య బయలుదేరిన యెడల వెంటనే యప్పటి శాసనసభను రద్దుచేసి, యాప్రత్యేక సమస్యపై సంఘోద్దేశ్యములను, కనుగొనుటకు మరల యెన్నికలను జరిపెడి యాచారము ఇంచుమించుగా ఇప్పుడన్ని ప్రజాప్రభుత్వములయందునను గాన్పించుచున్నది. కాని, ద్వంద్వశాసనసభ యున్నచోట పైసభకు ఎన్నికలసందర్భమున నీసూత్రమునకు వ్యతిరేకపద్ధతుల నవలంబించుట కలదు. పైసభను మొదటిసారి ఎన్నుకొనిన

తరువాత ఆసభ సంపూర్ణముగా రద్దగుటయు మరల ఎన్ని కలు జరుగుటయు లేదు. రెండు లేక మూడేండ్ల కొక పర్యాయము ఆసభయందలి మూడవవంతుస్థానములు ఖాళీయగుటయు వానిని మరల యెన్నికలద్వారా పూర్తి చేయుటయు జరుగును. ఒకఉదాహరణము చేకొందము. నేడు పైసభ కెన్నికలు జరిగిన వనుకొనుడు. సభ్యుల సంఖ్య ౯౦ గా తీసికొందము. ఇక మూడేండ్లకు అందు మూడవవంతు అనగా ౧ మొదలుకొని 3౦ వరకు గల స్థానములకు చెందిన సభ్యులు బయటికి వచ్చెదరు. ఆస్థానములకు మాత్రమే మరల యెన్నిక జరుగును. తరువాత మరి మూడేండ్లకు అనగా నేటి కారేండ్లకు 3౧ మొదలు ౬౦ వరకు గల స్థానములు ఖాళీయగును. ఇట్లే మరల ఆస్థానములకు ఎన్నికలు జరుగుటయు అటుపై మూడేండ్లకు అనగా నేటికి తొమ్మిదేండ్లకు మిగిలిన 3౦ స్థానములు ఖాళీయగుటయు మరల పూర్తిచేయుటయు కలుగుచుండును. ఈపద్ధతివలన పైసభ యొకవిధమగు శాశ్వతత్వమును, పూర్వాచారపరాయణత్వమును పొందుచున్నది. క్రిందిసభయొక్క నూతనప్రియత్వమునకు, తీవ్రగమనమునకు కొంతయడ్డు గలిగించుట కీసభ యవసరమగుచున్నది.

౬. పైసభకు క్రిందిసభకు గల అధికారములు, సంబంధము.

ద్వంద్వశాసనసభ యున్న రాజ్యములలో రెండు సభలకును గల సంబంధమును, అధికారములను ఖచితముగా నిర్వచింపవలసిన అవసర మేర్పడుచున్నది. రెండు సభలకును సమానాధికారము లుండవలయునా లేక అం

దొకదానికంటె మరియొకదాని కెక్కు డాధిక్యత యుండ వలయునా అనుసమస్య ప్రతిరాజ్యమునందును బయలు దేరెను. మొత్తముమీద కొన్ని సందర్భములయందు పైసభకంటె క్రిందిసభ కెక్కు డాధిక్యత యుండవలెనని రాజకీయశాస్త్రజ్ఞులలో అధికసంఖ్యాకుల యభిప్రాయ మని చెప్పవచ్చును. దీనికి కారణ మేమనగా రెండుసభ లకు నభిప్రాయభేదము లేర్పడినపుడు రాజ్యవ్యవహార ములు స్థంభించిపోవుట తటస్థించవచ్చును. అట్టి సందిగ్ధా వస్థనుండి బయటపడుటకు సులభమైన మార్గ ముండవల యును. అది యెట్టిదనగా అం దొకటి రెండవదానికి లొంగి పోవుటయే. అట్లైన లొంగిపోవలసిన సభ యేది? ప్రజా ప్రాతినిధ్యమును సంపూర్ణముగా గలిగి ప్రజలవిశ్వాసము నెక్కుడుగా చూరగొనుచున్న క్రిందిసభకు, సంఘమునం దల్పసంఖ్యాకుల ప్రాతినిధ్యము గల పైసభ లొంగి పోవుటయే ప్రజాప్రభుత్వసిద్ధాంతముల కనుగుణ్యముగా నుండును.

ఇట్టి పద్ధతి మనము బ్రిటిష్‌పార్లమెంటునందు చూ చుచున్నాము. ఇచ్చట ప్రభువుల సభకును, సామాన్యుల సభకును తీవ్రభేదాభిప్రాయ మేర్పడినపుడు సామాన్యుల సభయే తప్పక జయము గాంచును. సామాన్యులసభ ఏప్రతిపాదనను గాని మూడుసారు లంగీకరించిన యెడల దానిని ప్రభువు లంగీకరించినను, అంగీకరించకున్నను అది సార్వభౌముని యంగీకారముతో శాసనమగును. ఆదాయ వ్యయములకు సంబంధించిన ప్రతిపాదనలవిషయమ్మున ప్రభువులసభ కధికారమేమియు లేదని చెప్పవచ్చును.

ఆదాయవ్యయమునకు సంబంధించిన ప్రతిపాదనలను ప్రవేశపెట్టుటకు గాని, సవరించుటకు గాని, నిరాకరించుటకు గాని ప్రభువులసభ కధికారము లేదు. ఇతర ప్రతిపాదనల సందర్భమున గూడ చిట్టచివరకు ప్రభువులు సామాన్యులకు లొంగవలసియే యున్నది. అయితే, అన్ని దేశములందునను పై సభలు బ్రిటిష్ ప్రభువులసభను పోలియుండుట లేదు. ఇందులకు నిదర్శనముగా. అమెరికాసంయుక్త రాష్ట్రములు, ఫ్రాన్సు మొదలగు దేశములను జూపవచ్చును. రెండుసభలకును తీవ్రభేదాభిప్రాయము లేర్పడినపుడు రెంటిని యొకమార్గమునకు త్రిప్పుట కనేకపద్ధతుల నవలంబించుచున్నారు. (౧) రెండుసభలును కలిసి సమావేశమై భేదాభిప్రాయ మేర్పడిన ప్రతిపాదనను మరల చర్చించి, తదుపరి అధికసంఖ్యాకుల యంగీకారముప్రకారము పోవుట. (౨) రెండుసభలును నేకాభిప్రాయమునకు రానపుడు రెంటిని రద్దుచేసి మరల యెన్నికలు జరిపెదరు. అప్పుడును అంగీకారము కుదరనియెడల రెండును కలసి సమావేశమై అధికసంఖ్యాకుల యభిప్రాయము ప్రకారము తీరుమానించుట. (౩) రెండుసభలును తమతమసభ్యులనుండి రెండుసంఘముల నేర్పాటు చేయును. ఈరెండుసంఘములు కలసి సమావేశమై తీరుమానించిన ప్రకారమునడుచుట.

సామాన్యముగా ద్రవ్యమునకు సంబంధించిన ప్రతిపాదనలసందర్భమున తప్ప ఇతరవిషయములందు రెండుసభలకును ఇంచుమించుగా సమానాధికారములే యుండును. ఏసభ గాని యొకప్రతిపాదనను చేయవచ్చును,

సవరణల ప్రతిపాదింపవచ్చును, లేక నిరాకరింపవచ్చును. ఏప్రతిపాదనగాని రెండుసభలును ఆమోదించిన గాని శాసనము గానేరదు. క్లిష్టపరిస్థితు లేర్పడినపుడు పైన తెలిపినట్లు పైసభ క్రిందిసభకు తలయొగ్గుచున్నది.

౭. ప్రజా ప్రతిపాధన, ప్రజాంగీకారము.

ప్రజాపరిపాలన యన్న ప్రజలు తమప్రయోజనములకొరకు తమను తామే పరిపాలించుకొనుట యని భావము. అట్టిచో, ప్రజ లెన్నుకొనిన ప్రతినిధులు పరిపాలనావిధానమును నిర్ణయించుట, లేక నిర్వహించుట సంపూర్ణమగు ప్రజాపరిపాలన కానేరదు. సంపూర్ణప్రజాపరిపాలనను గలిగియుండుటకు ప్రజలు తమంతటతామే శాసనముల చేసికొనవలయును: తమంతట తామే పరిపాలనను నిర్వహించవలెను. అట్టిది సాధ్యమా? కోట్లకొలది జనాభా గలిగిన సంఘములయందు వ్యక్తు లందరు నొకచోట సమావేశమై, తమ కవసరమగు శాసనములను చేసికొనగలరా? నేటి తపాలా, తంతి మొదలగు వసతులవల్ల ప్రజ లందరొక్కచోట చేరకయే తమయుద్దేశ్యముల నొక కేంద్రస్థానమునకు పంపుటకు సావకాశము కలదు. కావున, ప్రజలు ప్రతిపాదనల చేయుటకును, అంగీకరించుటకును, లేక నిరాకరించుటకును సావకాశము గలదని వాదించు ప్రజాప్రభుత్వవాదులు కొందరు గలరు. కాని, కోట్లకొలది జనాభా గలిగిన సంఘములందు దాని కగు వ్యయప్రయాస లత్యధికము. అదియునుగాక, సామాన్యపౌరునకు ప్రభుత్వవిషయములందు అవగాహనము, అనుభవము తక్కువ. ప్రతిపాదనపై సమగ్రమగు చర్చ జరు

గుటకు సావకాశము లేదు. అనగా తోచినది తోచినట్లు
గా ప్రతివ్యక్తియు తనయభిప్రాయ మీయగలడే గాని అం
దరును కలసి ఒకచో కూడి చర్చించి సారాంశమును
తేల్చుటకు మార్గము లేదు. సామాన్యవ్యక్తి తనస్వంత
వ్యవహారములలో నెల్లప్పుడు మగ్నుడై ఉండుటచే ప్రభు
త్వవిషయములందు తగినంత శ్రద్ధతో పనిచేయజాలడు.

కాని కొద్దిజనాభా గల కొన్నిరాజ్యములందు
పౌరులు శాసనసభాకార్యముల కొన్నిసందర్భములయందు
నిర్వహించుట అమలునం దున్న విషయమే. ఈవిధానము
నేడు క్రొత్తగా కనిపెట్టినదికాదు. క్రీస్తు పూర్వము
౫౦౦ సంవత్సరముల క్రితమే, గ్రీసుదేశమున ఆథెన్సుపట్ట
ణమందు పౌరు లందరు ఒకచోట సమావేశమై శాసన
నిర్మాణవ్యవహారములను నెరవేర్చినట్లు చరిత్ర చాటుచు
న్నది. తదుపరి రోముపట్టణమున కూడ ఈపద్ధతి కొంత
కాలమువరకు అమలునం దుండెను.

ప్రస్తుతకాలమున సిడ్జర్లాండునందును, అమెరికా
సంయుక్తరాష్ట్రములందును ప్రజలు శాసనసభాకార్య
ములలో పాల్గొనుట కొంతవరకు గలదు. స్విడ్జర్లాండు
నందు మూడువిధములుగా ప్రజ లీహక్కులను చెలాయిం
చుచున్నారు. అందొకటి ప్రజాప్రతిపాదన యనునది.
ప్రజలలో నొకనిర్ణీతసంఖ్యకు తక్కువకాని వారలు మహా
జరురూపమున నొకప్రతిపాదనను చేసి, దానిని వారిసంత
కములతో శాసనసభకు పంపవచ్చును. అంతట ఆప్రతి
పాదన శాసనసభలో ప్రవేశపెట్టబడును. రెండవది
ప్రజాంగీకార మనునది. పైవిధముగానే కొందరు పౌరులు

కలసి శాసనసభ చేసిన శాసనముపై, వ్యక్తిగతముగా ప్రజల యంగీకారమును తీసికొనవలయు నని కోరవచ్చును. కొన్ని రాష్ట్రములలో (క్యాన్టనులలో) ప్రతిశాసనము నకు ప్రజల యంగీకారమును పొందితీరవలయును. మూడ వది అట్లే కొందరు ప్రజలు కలసి యొకయుద్యోగస్థుని యుద్యోగమునుండి తొలగించవలసినదిగా కోరవచ్చును. ఇట్టి విధానము స్విడ్జర్లాండునందు సాగుచున్నదని ప్రతిరా జ్యమునందునను ప్రవేశపెట్టుటకు వీలులేదు. స్విడ్జర్లాండు చాల చిన్న దేశము. స్విడ్జర్లాండునం దొక్కొక్క రాష్ట్ర ములో జనాభా కొన్ని వేలకు మించి లేదు. ఈపద్ధతి యా దేశమునకు సరిపోయినదేగాని విశేషజనసంఖ్య గల ఇండి యా, చైనా మొదలగు దేశములందు కేవలము దుర్లభము.

## ౮. శాసనసభావ్యవహారకాండ.

శాసనసభాసభ్యులసంఖ్య యెంత బాహుళ్యముగా నుండునో, మన మిదివరకే తెలిసికొనియుంటిమి. అంత మంది సభ్యులను గలిగిన సభలలో కార్యములు సక్రమ ముగాను, శీఘ్రముగాను జరుగవలెనన్న సభ్యులు కొన్ని నియమముల ననుసరించి నడచుకొనవలయును. ఈనియ మములనే సామాన్యముగా వ్యవహారకాండ అందురు. అనగా నొకకార్యమును వ్యవహరించుటలో గల విధా నము. ఇట్టివిధానమే లేనియెడల సభ యొకయల్లరిమూ కయై యసంబద్ధప్రలాపములలోనికి దిగును. కావున ప్రతి శాసనసభయు తన ధర్మమును సరళముగాను, సవ్యము గాను నెరవేర్చుట కనుకూలపరిస్థితుల గల్పించు నియమా వళి నొకదానిని తయారుచేసికొనును. ఆనియమముల్లను

సభ్యు లందరును తలయొగ్గవలయును. ఉదాహరణము నకు కొన్ని నియమముల నిచ్చట చూపవచ్చును. (౧) ఏ సభ్యుడుగాని సభయం దొకప్రతిపాదనను ప్రవేశపెట్టదల చినయెడల అట్టిప్రతిపాదనను దానియుద్దేశ్యములను నొక నిర్ణీతకాలమునకు ముందే శాసనసభాధ్యక్షునకు పంపవల యును. (౨) సభాసమావేశమున నొకసభ్యుడు మాట్లా డుచుండగా మరియొకడు లేచి మాట్లాడకూడదు. (౩) సభయందు ప్రతిపాదనను మూడుప్రత్యేకపర్యాయములు చర్చించి మూడు ప్రత్యేకపర్యాయములు వోటింగునకు బెట్టవలయును. (ఇది సభ్యుల తాత్కాలికోద్రేకముల నరికట్టుటకు చేర్చిన సూత్రము.) (౪) సభ యొక ప్రతి పాదనను ప్రవేశపెట్టుట కంగీకరించినవెంటనే, దాని కవస రమగు సవరణల చేయుటకు కొంతమంది సభ్యులు గల ఉపసంఘము నొకదానిని నియమింతురు. ఆప్రతిపాదన ఉపసంఘమువారి సవరణలతో వెలువడినరూపమున సభ యందు చర్చకువచ్చును. (౫) కేవలము తర్కవితర్క ములతోనే కాలము బుచ్చక సభాకార్యక్రమమును శీఘ్రముగా పూర్తిచేయుటకు చర్చను బలవంతముగా ముగించుమార్గ మవసరము. సభ్యులు వాదవివాదము లతో కాలయాపన చేయుచున్నపుడు, "చర్చను ముగింప వలెను" అను ప్రతిపాదనను పెట్టి సభయొక్క అంగీకా రమును బడసి చర్చను ముగింపవచ్చును.

ఇట్టివే యనేకసూత్రము లున్నవి.

౮. సభాధ్యక్షుడు.

శాసనసభ తన ధర్మమును సవ్యముగా నెరవేర్చ

నట్లు జూచుటకును, వ్యవహారకాండ ననుసరించి సభను పాలించుటకును, అందులకు విరుద్ధముగా ప్రవర్తించిన సభ్యులపై తగిన చర్య తీసికొనుటకును ఒకయధికారి యవసరము. ఈయధికారినే సభాధ్యక్షు డందురు. శాసన సభ యధ్యక్షుని సభ్యులలోనుండి యెన్నుకొనును. అది వరకు తాను సభయం దేకక్షకు చెందినవాడైనను అధ్యక్షుడు పీఠ మెక్కుటతోడనే యన్నికక్షులకును సమాను డగుచున్నాడు. అనగా ఏకక్షకును చెందడు. అధ్యక్షుడు చర్చలలో పాల్గొనకూడదు. సాధారణముగా ఏప్రతిపాదనకును ఆతనియంగీకారముతో పనిలేదు. కాని యొకప్రతిపాదన కనుకూలురు, ప్రతికూలురు సమానముగా నున్నపుడు అధ్యక్షుడు తనయంగీకార మెట్లుయిచ్చిన ప్రతిపాదన యట్లగును. అధ్యక్షునే గాక ఒకయుపాధ్యక్షుని కూడ సభ యెన్నుకొనును. అధ్యక్షుడు లేనపుడు ఆతని యుద్యోగము నుపాధ్యక్షుడు నిర్వహించును. రెండుసభ లున్నచోట వాని కధ్యక్షులును వేరువేరుగా ఉందురు.

---

## ౪

# కార్యనిర్వాహకవర్గము

### ౧. ఏకనాయకత్వము.

కార్యనిర్వాహకవర్గము శాసనసభ కంటెను, న్యాయస్థానముల కంటెను ఉద్యోగులసంఖ్యయం దెన్నియో రెట్లు బాహుళ్యమైనది. దీనియం దెన్నియో యుపశాఖ

లుండును. సిస్తువసూలు, నీటిపారుదల, అడవి, ఆబ్కారి, తపాల, వర్తకము, వ్యవసాయము, పరిశ్రమలు, ఆరోగ్యము, విద్య, అభివృద్ధి, స్థానికపరిపాలన, రైలుమార్గములు, విదేశవ్యవహారములు, పోలీసు, సైన్యము మొదలగున వన్నియు నిందుగల యుపశాఖలే. ఇందు ప్రతి యుపశాఖకు నొక యున్నతోద్యోగి యుండును. ఈ యున్నతోద్యోగులపైన మంత్రివర్గ ముండును. ఈ యున్నతోద్యోగుల క్రింద, ఒకరికంటె మరియొకరు తక్కువగా పెక్కుతరగతుల యుద్యోగస్థు లుందురు. ఈ యుపశాఖలకు చెందిన యుద్యోగస్థుల నందరిని మినహాయించి, వీనిపై యధికారమును చెలాయించు మంత్రివర్గమునకు మాత్రమే కొన్నిసందర్భములలో ప్రభుత్వ మనుపదము వర్తించుచున్నదని మన మిదివరలో తెలిసికొనియుంటిమి. ఈ ప్రకరణమున ప్రభుత్వ మనుపద మీసంకుచితార్థమునందుపయోగింపబడుచున్నది. కావున ఒక్కమంత్రివర్గమును మాత్రమే పాఠకులు ప్రభుత్వముగా నెరుంగవలయును. ఈయర్థమున ప్రభుత్వము తక్కిన రెండుశాఖలకంటె సభ్యులసంఖ్యయందు మిక్కిలి చిన్నది. బ్రిటిష్ ప్రభుత్వము సార్వభౌముడును, సుమారు ౨౦ లేక ౨౫గురు మంత్రులును కలసి యేర్పడుచున్నది. అమెరికా సంయుక్తరాష్ట్రములయందు అధ్యక్షుడును, ఆతనిమంత్రులు సుమారు పదిమందియు కలసి ప్రభుత్వభారమును వహించుచున్నారు. ఇట్లే యేరాజ్యమునందు జూచినను, ప్రభుత్వసభ్యులసంఖ్య చాలతక్కువ. దీనికి కారణ మేమనగా ప్రభుత్వపరిస్థితి పెక్కుమందితోడి సమాలోచనలకు

తావియ్యదు. శాసనసభవలె ప్రభుత్వము దీర్ఘచర్చలు చేయుచు కాలవిలంబము చేయుటకు వీలులేదు. ప్రభుత్వములకు శీఘ్రనిశ్చయము, కార్యదీక్షయు నత్యంతముఖ్యములు. ఈకారణమున సంఖ్య యెంతతక్కువైన నంత యుపయోగము. ఒక కార్యమును నిర్వహింపవలెనన్న పదుగురు పెత్తనదారు లెప్పుడును పనికిరారు. బహునాయకత్వము కార్యవినాశమునకు హేతువగును. మంచియో, చెడ్డయో కార్యనిశ్చయము ఎప్పుడును ఒక్కనినాయకత్వమునం దుండుట శ్రేయస్కరము. బ్రిటిష్ప్రభుత్వమున పైకి సార్వభౌముడును అతని గురు మంత్రులును కనబడుచున్నను నిజమునకు ప్రధానమంత్రి యొక్కడే సర్వాధిపత్యము వహించుచున్నాడు. పరిపాలనావిధానమున సార్వభౌముని యధికారములు కేవలము నామమాత్రములు. ఇక తక్కిన మంత్రులన్ననో ప్రధానమంత్రి తనచిత్తము వచ్చిన చొప్పున శాసనసభనుండి యేరుకొనినవారే. ఏవిషయమునందు గాని, ప్రధానమంత్రి యిటు సార్వభౌమునితోడను, అటు తోడిమంత్రులతోడను సమాలోచనలు చేసినప్పటికిని, అభిప్రాయభేదము లేర్పడినపుడు ప్రధానమంత్రికి తక్కిన వారందురు లోబడితీరుదురు. అట్లు లోబడని మంత్రి తనపదవికి రాజీనామా నిచ్చి తొలగవలయును. ఇట్లే అమెరికాసంయుక్తరాష్ట్రములయందు ప్రభుత్వవిధాన మంతయు అధ్యక్షుని హస్తగతమై యున్నది. అధ్యక్షునికి పరిపాలనయందు తోడుపడుటకు సుమారు పదిమందిమంత్రు లుందురు. వీరు కేవలము అధ్యక్షుని సమ్మతి యున్నంతకాలము మాత్రమే తమ

యుద్యోగములం దుండగలరు. అది లేనిపూట యుద్యోగమును లేదన్నమాటయే. ఒక్క స్విడ్జర్లాండు దేశమున తప్ప మరెక్కడను ప్రభుత్వమున బహునాయకత్వము లేదనియే చెప్పవచ్చును. ఈ దేశమున ఏడుగురు సమాన సభ్యులు ప్రభుత్వమును నిర్వహించుచున్నారు. శాంతి సమయములలో నిట్టిది చక్కగా పనిచేయుచున్నను, యుద్ధము, తిరుగుబాటులు మొదలగు అవసరసమయము లలో దీనిలోపములు తప్పక కనుపించును.

### ౨. వారసత్వము, ఎన్నిక, నియామకము.

ప్రభుత్వసభ్యులు వారసత్వముచేతను, నియామకముచేతను, ఎన్నికచేతను పదవి నలంకరింపవచ్చును. నిరంకుశప్రభుత్వమున రాజు వారసత్వముచే తనపదవిని పొందుచున్నాడు. ఆతనిమంత్రుల నాతడే నియమించును. నియమబద్ధరాజప్రభుత్వమున కూడ రాజు వారసత్వము చేతను, మంత్రులు ఆతడు నియమించుటచేతను ప్రభుత్వ స్థానముల నాక్రమించుకొనుచున్నారు. అధ్యక్షప్రభుత్వ మునందు అధ్యక్షుని ప్రజ లెన్నుకొనుచున్నారు. ఆతని మంత్రులను కొన్నిచోట్ల ఆతడే నియమించుటయు, మరి కొన్నిచోట్ల ప్రజలచే నెన్నుకొనబడుటయు జరుగుచున్నది.

### ౩. రాజప్రభుత్వము.

నిరంకుశప్రభుత్వము నందును, నియమబద్ధరాజ ప్రభుత్వము నందును రాజు ప్రభుత్వమునకు మూలవిరా టుగా నుండును. ఈతడు వారసత్వపుహక్కుచే ప్రభుత్వ సింహాసన మధిష్ఠించును. వారసత్వముచే ప్రభుత్వమున అగ్రస్థానము వహించుట యనునది యిప్పటి రాజకీయ

శాస్త్రజ్ఞులలో నెవరును సమర్థించు నట్టిది కాదు. కాని ప్ర పంచమునం దనేక రాజ్యములం దిప్పటికిని రాజు లున్నారు. చరిత్రను బట్టి చూచిన రాచరికము మిక్కిలి పురాతన మైనది. నాటినుండి నేటివరకును మధ్య యెన్ని యవాం తరములు వచ్చినను నశించక ఇంకను భూమిమీద నిలిచి యున్న యొక గొప్ప రాజకీయదృశ్యమై యున్నది. నిజము నకు ప్రజాప్రభుత్వమున కింతటి చరిత్రయు, ప్రతిష్ఠయు, పురాతనత్వమును లేవనియే చెప్పవలయును. ఏమైనను నేటి రాజకీయవేత్తలకు ప్రభుత్వమున వారసత్వ మను నది కేవల మర్థవిహీనముగా గన్పట్టకమానదు. ఏలననగా వారసత్వముచే కవులు, పండితులు ఏర్పడుట యెట్టిదో యిదియు నట్టిదే. ఈకాలమున ప్రజలలో గల రాజకీయ విజ్ఞానమును బట్టి సామాన్యముగా నేటి రాజులు తమ నిరంకుశత్వమునుమాని, నియమబద్ధు లగుచున్నారు. వారు నామకః సింహాసన మధిష్టించినను, ప్రజాప్రభుత్వసూత్ర ముల నంగీకరించి పరిపాలనావ్యవహారముల సంపూర్ణ ముగా ప్రజాప్రతినిధులగు మంత్రులవశము చేయుచు న్నారు. ఇట్టి రాజులలో బ్రిటిష్‌ప్రభుత్వమునకు శిరోభూ షణమగు సార్వభౌముడగ్రగణ్యుడు. బ్రిటిష్‌ప్రభుత్వమున సర్వము సార్వభౌముని పేరట జరుగుచున్నను నిజమైన పరి పాలనాధికారములు ప్రధానమంత్రియం దున్నవి. రాజ ప్రభుత్వములలో నిజమైన పరిపాలనాధికారము వహించిన రాజులుకూడ ఉండవచ్చును. ఐరోపాయుద్ధమునకు పూ ర్వము ప్రషియారాజు ఇట్టివాడు. ప్రభుత్వవ్యవహార ములు ఈతని పేరిట జరుగుటయేగాక, ఈతని సమ్మతి

ననుసరించియే జరుగుచుండెను. ఇట్టి రాజులసంఖ్య యుద్ధానంతరము సన్నగిలి పోజొచ్చెను. నేటి ఇటలీ, హంగేరీ, బెల్జియం మొదలగు దేశముల రాజులు ప్రభుత్వమున కేవలము నామమాత్రు లనియే చెప్పవలయును. నేటి రాజకీయతత్వమును బట్టి చూచిన, అధికారము లేని రాజులనవసరమును, అధికారము గల రాజు లపాయమును అగుచున్నారు. ఐనను నియమబద్ధరాజప్రభుత్వములను, అనగా నాషుకః రాజును గలిగియున్న ప్రజాప్రభుత్వములను నాశనముచేయుట కంత అగత్యము కనుపించదు. ముఖ్యముగా బ్రిటన్ దేశమున రాజును ప్రజలు గౌరవముతోను, భక్తితోను జూచుచున్నారు. సింహాసనము, కిరీటము, దండము మొదలగు చిహ్నములను పవిత్రపురాతనసంప్రదాయములుగా భావించుచున్నారు. వానిని సంరక్షించుటకు ప్రాణము లొడ్డుటకైనను వెనుదీయని భక్తి విశ్వాసములను గలిగియున్నారు.

౮. అధ్యక్షప్రభుత్వము.

ప్రభుత్వమున అగ్రస్థానమును ప్రజ లెన్నుకొనిన అధ్యక్షు డధిష్టించినప్పుడు దానిని అధ్యక్షప్రభుత్వ మందురు. ఈయధ్యక్షుడు ప్రత్యక్షపు ఎన్నికచే గాని, పరోక్షపు ఎన్నికచే గాని తన పదవిని బొందుచున్నాడు. రాజులలో వలెనే యీయధ్యక్షులలో కూడ కొందరి యధికారము నిజమైనదిగాను, మరికొందరి యధికారము నామమాత్రముగాను ఉన్నది.

అమెరికాసంయుక్తరాష్ట్రాధ్యక్షుడు ప్రభుత్వమునందు నిజమైన యాధిపత్యము వహించుచున్నాడు. ఈతడు

తనచిత్తమునకు వచ్చిన వారిని సుమారు పదిమందిమం
త్రులను కార్యనిర్వాహణమున తనకు సహాయముగా నుం
డుటకు నియమించుకొనుచున్నాడు. మంత్రులను నియమిం
చుటలో అధ్యక్షుడు శాసనసభయొక్క యొప్పుదలను
పొందవలసిన యవసరముగాని, లేక వారితో సంప్రదించ
వలసిన అగత్యముగాని లేదు. ఈతడు మంత్రులను తన
యిచ్ఛవచ్చినప్పుడు బరతరఫు చేయగలడు. మంత్రులు
ఎల్లప్పుడు అధ్యక్షునకు లోబడియే తమతమ విధ్యుక్త
ధర్మములను నెరవేర్చవలెను. ప్రభుత్వవిధానమును అధ్య
క్షుడే నిర్ణయించును. ఇంతకు ఒక్కమాటలో ప్రభుత్వ
కార్యనిర్వాహణమునందు అధ్యక్షుడు సర్వాధికారి.

ఇందులకు వ్యతిరేకముగా నామకః పీఠము నలంక
రించుచు కార్యనిర్వాహణమునం దెట్టి యధికారమును
లేని యధ్యక్షుని మనము ఫ్రాన్సుదేశమున చూడగలము.
ఫ్రెంచియధ్యక్షుడు శాసనసభాసభ్యులలో నొకనిని తనకు
ప్రధానమంత్రిగా నియమించుకొనును. తదుపరి ప్రధాన
మంత్రి యిష్టముపై తక్కిన మంత్రులను కూడ తానే
శాసనసభనుండి నియమించును. ప్రభుత్వాధికారము
లన్నియు మంత్రివర్గవశమై, అందునను ముఖ్యముగా
ప్రధానమంత్రివశమై యున్నవి. కావున, ఆంగ్లసార్వభౌ
మునివలె ఫ్రెంచియధ్యక్షుడు ప్రభుత్వమున కేవల మొక
యలంకారవిగ్రహము. ఫ్రెంచియధ్యక్షుని రెండుశాసన
సభలును కలసి సమావేశమై యెన్నుకొనును. అమెరికా
యధ్యక్షుని ప్రజలే ప్రత్యక్షముగా ఎన్నుకొందురు. రాజరిక
మువలె గాక, అధ్యక్షపదవి కొక కాలనిర్ణయ ముండును.

సాధారణముగా ఈనిర్ణయ మైదుసంవత్సరములకు మించి యుండదు. ఒకవ్యక్తి తనజీవితకాల మంతయు, లేక అందు చాలభాగము వరకు అధ్యక్షపదవి నలంకరించుట సందర్భపడినయెడల ఆతనియం దొకవిధమగు నధికార వాంఛయు, సామ్రాజ్యాకాంక్షయు బయలుదేరు నను కారణముచే ప్రస్తుతప్రజాప్రభుత్వము లన్నిటియందును ఈమైదుసంవత్సరముల కాలపరిమితినియమ మనుకరింప బడుచున్నది. ఫ్రాన్సుదేశమున నెపోలియన్, తొలుదొలుత తనపదిసంవత్సరముల ప్రభుత్వాధిపత్యమును, కాల పరిమితిలేని ప్రభుత్వాధిపత్యముగా మార్చుటయు, తదుపరి ఏకఛత్రాధిపత్యమును బొందుటయు, చరిత్రయందు లిఖింపబడియే యున్నది. నేటి ప్రజాప్రభుత్వములలో ఇట్టి ప్రమాదమును తొలగించుటకే, అధ్యక్షపదవికి కాలపరిమితిని సాధ్యమైనంతవరకు తగ్గింపచూచుచున్నారు. కొన్ని ప్రభుత్వములలో నొకసారి యధ్యక్షపదవి నలంకరించినవాడు, రెండవసారి యాపీఠ మెక్కుటకు వీలులేదు. కాని మరికొన్నిటియం దిట్టి నియమములేదు. అమెరికాసంయుక్తరాష్ట్రములలో నొకవ్యక్తి అధ్యక్షపదవిని రెండు పర్యాయములకు మించి పొందగూడదను నియమము శాసనరూపమున లేనప్పటికిని, ఆచారముగా వచ్చుచున్నది. ఇట్టి నియమమువల్ల కొంతచెరుపు లేకపోలేదు. దీనివలన సమర్థులును, ప్రజ్ఞావంతులు నగువారు ఒకసారి మైదేండ్లపాటు అధ్యక్షపీఠ మలంకరించి వెంటనే, యాపదవినుండి విరమించవలసివచ్చుచున్నది. ఈకొద్దికాలములో అధ్యక్షుడు గొప్పగొప్పకార్యముల తలపెట్టుటకు

కాని, తల పెట్టిన కార్యముల ముగించుటకు కాని తగినంత సావకాశము లేదు; అట్టి వారి ప్రజ్ఞాసామర్థ్యములను కోల్పోవుటలో దేశమునకు తీరనినష్టము సంభవించవచ్చును. కావుననే, కొన్ని రాజ్యములు ఈనియమమును పాటించుట లేదు.

౫. బాధ్యతాయుత ప్రభుత్వములు, బాధ్యతారహిత ప్రభుత్వములు.

ఏప్రభుత్వము గాని శాసనసభకు బాధ్యత వహించియున్నపుడు దానిని బాధ్యతాయుతప్రభుత్వ మనియు; అట్టి బాధ్యత లేనపుడు బాధ్యతారహితప్రభుత్వమనియు నందురు. బాధ్యతవహించుట యనగా శాసనసభకు ప్రభుత్వము తనచర్యలకు తగినజవాబు యివ్వవలసియుండుట. ఏసందర్భమున గాని, ప్రభుత్వ మిచ్చిన జవాబుల నసంతృప్తికరములుగా నెంచి, శాసనసభ ప్రభుత్వచర్యను ఖండించి తమయవిశ్వాసమును వెల్లడించినయెడల ఆ ప్రభుత్వసభ్యులు వెంటనే తమపదవులకు రాజీనామాల నిచ్చి తొలగవలయును. ప్రభుత్వచర్యలకు మంత్రులు అందరు సమష్టిగా బాధ్యత వహించుచున్నారు. శాసనసభ ఖండించిన చర్య నిజమున కేమంత్రి చేసినను అది మంత్రు లందరును కలసి చేసినట్లే భావింపబడుచున్నది. ఆచరణయందు కూడ ఏమంత్రియు తన సహాధ్యాయులతో అందు ముఖ్యముగా ప్రధానమంత్రితో సంప్రదించనిదే యెట్టిచర్యను తీసికొనుటకు సామాన్యముగా సాహసించడు. బాధ్యతాయుతప్రభుత్వములో మరియొకసూత్రమేమనగా, మంత్రులెప్పుడును శాసనసభలో సభ్యులై యుందురు. సాధారణముగా వారుశాసనసభలో అధిక సంఖ్యాకుల విశ్వాసమును గలిగియుందురు.

ఈబాధ్యతాయుతప్రభుత్వవిధానము తొలుదొలుత బ్రిటన్ దేశమున పుట్టిన దని చెప్పవచ్చును. ఇది బ్రిటిష్ ప్రజలు గాని, పార్లమెంటు గాని ఒకనా డాలోచించి తయారుచేసిన పద్ధతికాదు. దీనిని బ్రిటిష్ శాసనగ్రంథము లలో నెక్కడ మనము చూడము. నార్మన్ రాజుల పరిపా లననాటికే రాజున కొక సలహాసంఘ ముండెడిది. ఈ సలహాసంఘమే కాలప్రవాహమున పెక్కుమార్పులను చెందుచు నేటి బాధ్యతాయుతమంత్రివర్గ మైనది. దీనినే 'కాబినెట్' అని కూడ పిలిచెదరు. ఈనార్మన్ సలహా సంఘమే నాల్గవ హెన్రీరాజుకాలమున 'ప్రీవీకౌన్సిల్' అని పిలువబడుచుండెను. ఆకాలమున సార్వభౌము డీసంఘము నకు తనయిష్టము వచ్చిన వారిని నియమించుచుండెను. అప్పటిలో వారు శాసనసభకు బాధ్యులుకారు. నేటి బ్రిటిష్ పార్లమెంటు ౧౨౬౫వ సంవత్సరమునాటికే ఏర్పడి యున్నప్పటికి అప్పటిలో దానికి మంత్రులచర్యలపై ఎట్టి యధికారమును లేదు. మంత్రులు పార్లమెంటులో సభ్యులై యుండవలయు ననెడి నియమమును లేదు. తదు పరి స్టుఅర్టుప్రభువుల నిరంకుశత్వమును విధ్వంసముచేసి పార్లమెంటు తన సర్వాధికారమును స్థాపించిన పిమ్మట, వెనుకటి మంత్రులపొత్తు దుర్లభమాయెను. అందుచేత, మూడవ విలియంరాజు, తనమంత్రులను పార్లమెంటు సామాన్యులసభలో అధికసంఖ్యాకకక్షకు చెందినవారి నుండి తీసికొనెను. ఇదియే బాధ్యతాయుతప్రభుత్వమున కంకురార్పణయని, చెప్పవచ్చును. మంత్రు లందరు ఒక సారిగా ఉద్యోగముల స్వీకరించుటయు, పార్లమెంటు

అసమ్మతిపై తనయుద్యోగములకు సమష్టిగా రాజీనామాల నిచ్చుటయు మొదలయినవి దరిమిలా యేర్పడిన మార్పులు. ఇప్పటికిని మంత్రుల బాధ్యతయనునది బ్రిటిష్ ప్రభుత్వమున ఒకయాచారమే గాని శాసనరూపమున లేదు. ఫ్రాన్సుదేశమున ఈబాధ్యతాసూత్రము రాజ్యాంగ చట్టమునం దొకభాగమై యున్నది.

బాధ్యతారహితప్రభుత్వము కేవల నిరంకుశప్రభుత్వముగా భావింపరాదు. శాసనసభకు బాధ్యత వహించని రాజప్రభుత్వములు,—అధ్యక్షప్రభుత్వములు ఉండవచ్చును. ఐరోపాయుద్ధమునకు పూర్వము ప్రష్యారాజప్రభుత్వము శాసనసభావిశ్వాసముపై నాధారపడి యుండెడిదికాదు. అమెరికాఅధ్యక్షప్రభుత్వము కూడ ఇట్టి బాధ్యతలేని ప్రభుత్వమే. అమెరికాకాంగ్రెసు అనగా, శాసనసభ మిక్కిలి కష్టసాధ్యమగు "ఇంపీచిమెంటు" అను నేరారోపణవల్ల తప్ప అధ్యక్షుని పదవినుండి తొలగింపజాలదు. అధ్యక్షుడుగాని, ఆతని మంత్రులుగాని తమ విధానమునకు, చర్యలకు కాంగ్రెసునకు బాధ్యులుకారు. మంత్రులను నియమించుటలో అధ్యక్షుడు శాసనసభతో సంప్రదించవలసిన అగత్యము లేదు. తనయిష్టమునకు వచ్చిన వారిని నియమించును.

౬. ప్రభుత్వమునకును, దాని యుపశాఖలకును గల సంబంధము.

ప్రభుత్వసభ్యులు పరిపాలనానిర్వహణమునం దధికారములను, తమలో తాము విభాగించుకొనుచున్నారు. ప్రభుత్వాధికారము లన్నిటిని నొకవ్యక్తియే చెలాయించుట యసాధ్యమైన విషయము. అందుచేతనే, క్రింది

యుపశాఖలను బట్టియు, అందు గల్గ కార్యభారమును బట్టియు ప్రభుత్వసభ్యులసంఖ్య హెచ్చుటయు, తగ్గుటయు జరుగుచుండును. ప్రధానమంత్రికి సామాన్యముగా సర్వ విషయములపై నధికార మున్నప్పటికిని, ఆచరణలో కొన్నిటిని మాత్రమే ప్రత్యక్షముగా తనక్రింద ఉంచుకొని మిగిలిన వానిని విభాగించి తోడిమంత్రుల పరముచేయును.

ఉపశాఖలయందలి యుద్యోగులను క్రిందియుద్యోగు లందరు. వీరి యుద్యోగవిధులు సాధారణముగా ఎప్పుడును యొకమామూలుధోరణిలో నుండును. ప్రభుత్వమున గలుగుచుండు రాజకీయపుమార్పులతో వీరి కెట్టి ప్రస క్తియు నుండదు. ఏరాజకీయకక్షి ప్రభుత్వస్థాన మలంక రించినను వారియుత్తరువుల నెదురుమాటలేక శిరసా వహించి చెల్లించుటయే వీరివిధి. క్రిందియుద్యోగస్థుల నియమించుట, తొలగించుట మొదలగు యధికారములు ప్రభుత్వమునందు గాని, లేక వారికి లోబడివర్తించు ఇత రులయందు గాని యుండును. అట్లని యొక ప్రత్యేకకక్షి ప్రభుత్వమునకు వచ్చినపుడు అప్పటికున్న క్రింది యుద్యో గులలో తమకక్షకు చెందనివారిని తొలగించి ఆస్థానము లకు తమవారిని నియమించకూడదు. ఉద్యోగుల నొక సారి నియమించినవెనుక తగినకారణము లేనిదే వారిని యుద్యోగములనుండి తొలగింపరాదు. ఏయుద్యోగి గాని తనవిధులను సక్రమముగా నెరవేర్చుచున్నంతకాలము ఆతనియుద్యోగమున కెట్టి యొడుదుడుకులను కలుగ చేయకూడదు.

## ౭

# న్యాయస్థానము

### ౧. న్యాయమూర్తుల తీర్పులు.

న్యాయస్థానశాఖయొక్క ముఖ్యవిధి న్యాయపరిపాలన. న్యాయమనగా శాసనసమ్మత మని యర్థము. ఇటు ప్రభుత్వము, అటు వ్యక్తులు, శాసనములకు లోబడి ప్రవర్తించుచున్నారా లేదా యను విచారణయే న్యాయ విచారణ. ఈవిచారణ చేయునదే న్యాయస్థానము. ఒకానొకచర్య శాసనసమ్మత మగునో, కాదో విచారించుటకు గొప్ప శాసనశాస్త్రపాండిత్య ముండవలయును. శాసన శాస్త్రపాండిత్య మనగా, శాసన మనగా నేమి, దాని స్వభావ మెట్టిది, దాని నె ట్లన్వయించవలెను, ఎ ట్లనుకరించవలెను మొదలగువిషయములందు మంచిజ్ఞానమును, నైపుణ్యమును గలిగియుండుట. అట్టి శాస్త్రపటిమయే గాక, అమలునందున్న శాసనముల పూర్తిగా చదివి యవగాహనచేసికొని యుండవలయును. తా ననుసరించవలసిన శాసనము మంచిదా, లేక చెడ్డదా యను విచారణతో న్యాయమూర్తికి పనిలేదు. ఉన్నది యున్నట్లుగా, శాసనము నన్వయించి దాని నిజార్థమును ప్రకటించుటయే యాతనివిధి. శాసనముయొక్క కీడుమేళ్ళను పరికించి, సవరించవలసినది శాసనసభ. న్యాయమూర్తి తనయుద్దేశ్యముల ననుసరించి శాసనముల సవరించు నెడల, ఆతడు శాసనసభాధికారములను కబళించినవాడగును.

అదియునుగాక, శాసనమును చేయుటయు, దాని ననుస రించి న్యాయమును పాలించుటయు, ఒకవ్యక్తియందే కేంద్రీకరించుచో న్యాయపరిపాలన ఆతని యిష్టానిష్ట ములపై ఆధారపడినదగును. అది సంఘమునకు చాల ప్రమాదకరమని వేరుగా నిరూపించవలసిన పనిలేదు. కాని, యాచరణలో న్యాయస్థానములు, తమతీర్పుల ద్వారా, శాసనముల చేయుచున్నవనియే చెప్పవలయును. శాసనసభ యెంతటి దూరాలోచన గలిగి యున్నప్పటికిని, ముం• దెప్పుడో యేర్పడనున్న వివిధములగు అన్నిపరిస్థితు లను యూహించి, శాసనములను చేయుట కేవలము దుర్లభము. ఒకానొక పరిస్థితికి వర్తించగల సూత్రము శాసనమున స్పష్టముగా వ్యక్తీకరింపబడకపోవచ్చును ; అట్టిచో, నాయమూర్తి శాసనముయొక్క ముఖ్యోద్దేశ్య ముల కనుగుణ్యముగా న్యాయమును నిశ్చయింపవలయును. మరికొన్ని సందర్భములకు శాసనమునం దెట్టియాధార మును లేకపోవచ్చును; అట్టిచో నాతడు సామాన్యధర్మ ముల ననుసరించి యాత్మశుద్ధితో తనబుద్ధికి తోచిన విధముగా తీర్పు చెప్పవచ్చును. ఈవిధముగా ఇచ్చిన తీర్పులను శాసనములుగా భావించి యనుకరించవలెననెడి యాచార మిప్పుడించుమించుగా అన్నిదేశము లందునను యున్నది. ఇట్టితీర్పులను నిజముగా న్యాయమూర్తులు చేసిన శాసనము లనవచ్చును.

న్యాయపరిపాలనకు ముఖ్యముగా పక్షపాతమును, భయమును కూడదనివి. శాసనమున కర్థముచెప్పుటలో నిష్పక్షపాతముగాను, నిర్భయముగాను ప్రవర్తించ

వలెను. ఇందులకు న్యాయమూర్తులకు తగినంత జీతముల నేర్పాటు చేయుటయు. వారిని యితరశాఖలసందర్భమున స్వాతంత్ర్యయుతులుగా చేయుటయు అవసరము. న్యాయమూర్తుల యుద్యోగకాలము మరియొకశాఖ యిష్టానిష్టములపై ఆధారపడియుండఁకూడదు. వారు సత్ప్రవర్తనలో నున్నంతకాలము వారి యుద్యోగమున కెట్టిభంగమును కలుగకూడదు. వారిజీతములు వారిచ్చు తీర్పులసంఖ్యను బట్టి గాని, లేక యాతీర్పుల మంచిచెడ్డలనుబట్టి గాని యుండగూడదు. బ్రిటిష్‌సామ్రాజ్యమున న్యాయమూర్తులకు గొప్పజీతముల నేర్పాటుచేసియున్నారు. వారి యుద్యోగకాలము కూడ సాధారణముగా వారిసత్ప్రవర్తనను బట్టియే యుండును. ఒకన్యాయమూర్తిని పదభ్రష్టుని చేయవలె నన్న పార్లమెంటు రెండుసభలును కలసి సార్వభౌమునకు తత్సంబంధమున ఒకవిన్నపమును పంపవలయును. ఇట్లే అమెరికాసంయుక్తరాష్ట్రములు, ఫ్రాన్సు మొదలగు ముఖ్యదేశములందు న్యాయమూర్తులు అవిచ్ఛిన్నమగు యుద్యోగపరిమితిని, తమయుద్యోగనిర్వహణమునం దెక్కుడు స్వాతంత్ర్యమును గలిగియున్నారు. కాని, అమెరికారాష్ట్రప్రభుత్వములలో నీసూత్రములకు ప్రతికూలపద్ధతి యనుకరింపబడుచున్నది. అచ్చట ఒకనిర్ణీతకాలమునకు న్యాయమూర్తులను ప్రజలే యెన్నుకొనుచున్నారు. కొన్నిరాష్ట్రములలో ఈయుద్యోగకాలము రెండుసంవత్సరములుగా నిర్ణయింపబడుచున్నది. అదియునుగాక, ప్రజలలో నొకనిర్ణీతమగుసంఖ్య యొకానొక న్యాయమూర్తిని తొలగించవలెనని కోరినయెడల ఆతడు

పదభ్రష్టు డగున్నాడు. ఇట్టిపద్ధతియందుగల లోపములను మిక్కిలిగా చెప్పనవసరము లేదు. ఇందు న్యాయమూర్తి తనకు న్యాయమనితోచినరీతిని గాక ప్రజలలో గల రాజకీయాభిప్రాయములను బట్టి ప్రవర్తించవలసినవా డగుచున్నాడు.

### ౨. న్యాయమూర్తులు-నియామకము, ఎన్నిక, వారసత్వము.

సామాన్యముగా న్యాయమూర్తులను కార్యనిర్వాహకవర్గాధిపతి నియమించును. అమెరికాసంయుక్తరాష్ట్రములందును, బ్రిటిష్‌సామ్రాజ్యమునందును ఈపద్ధతియే అమలునం దున్నది. న్యాయమూర్తులను ప్రజ లెన్నుకొను పద్ధతి అమెరికారాష్ట్రప్రభుత్వములలో కొన్నిటియందు గలదు. నిజమునకు వారసత్వపున్యాయమూర్తులు ఏరాజ్యమునందునను లేరనియే చెప్పవచ్చును. కాని, బ్రిటిష్‌ప్రభువులసభ బ్రిటన్ దేశములో అగ్రన్యాయస్థానముగా వ్యవహరించుచున్నది. ప్రభువు లాసభలో వారసత్వమురీత్యా సభ్యత్వమును పొందుచున్నారని మన మిదివరకే తెలిసికొనియుంటిమి. మన మిక్క డొక్కవిషయమును జాగ్రతగా గమనించవలసియున్నది: న్యాయపరిపాలనాధికారములను ప్రభువులసభ సక్రమముగా నెరవేర్చునిమిత్తము, సార్వభౌము డాసభకు శాసనశాస్త్రపండితులను కొందరిని జీవితసభ్యులుగా నియమించును. పేరునకు ప్రభువులసభయనియే గాని, నిజముగా న్యాయవిచారణ చేయునది ఈనియమితసభ్యులే.

### ౩. న్యాయస్థానమున కితరశాఖలతోడి సంబంధము.

న్యాయస్థానముపై తక్కిన రెండుశాఖలకును ఎట్టి

యధికారము నుండగూడదని ఇంతకుముందే నిశ్చయించి తిమి. ఇప్పుడు న్యాయస్థానముయొక్క బారినుండి యితర శాఖల నెంతవరకు సంరక్షించవలెనో చూడవలసియున్నది. న్యాయస్థానమునకును, శాసనసభకునుగల సంబంధము ఆరాజ్యాంగముయొక్క స్వభావముపై నాధారపడియుండును. శాసనసభ సర్వాధికారియైన, అనగా, హద్దులేని యధికారముల గలిగియున్నయెడల, దాని యధికారములనుగూర్చి గాని, చర్యలనుగూర్చి గాని, న్యాయస్థానము ప్రశ్నింపజాలదు. అట్లుగాక, శాసనసభయొక్క యధికారములకు కొన్నిహద్దు లేర్పడియున్నయెడల, శాసనసభ యాహద్దులలో ప్రవర్తించెనా, లేక, హద్దుల నతిక్రమించెనా యను విచారణాధికారము న్యాయస్థానముల కుండును. బ్రిటిష్‌పార్లమెంటుయొక్క చర్యలపై ఎట్టి యధికారమును లేదు. అమెరికాకాంగ్రెసు ఇట్టి సర్వాధికారి గాదు: దాని యధికారములకు హద్దులు రాజ్యాంగశాసనమున ఖచితముగా నిర్వచింపబడియున్నవి. కావున, అమెరికాసంయుక్తన్యాయస్థానము కాంగ్రెసుచర్యలు రాజ్యాంగశాసనసమ్మతమా అను విషయవిచారణ చేయుటకును, దానిపై తీర్పుచెప్పుటకును అధికారమును గలిగియున్నది. న్యాయస్థానమునకును, కార్యనిర్వాహకవర్గమునకును ఉండవలసిన సంబంధవిషయమున రెండువ్యతిరేక సిద్ధాంతములు లమలులో ఉన్నవి. (౧) అధికారమును, బలమును గల కార్యనిర్వాహకవర్గపు యుద్యోగుల యక్రమచర్యలనుండి వ్యక్తులను, వారిహక్కులను సంరక్షించుట అత్యంతావసరము. ప్రభుత్వోద్యోగులు తమయధి

కారబలముల చెలాయించుటలో హద్దుమీరుట సామా న్యసంభవము. ప్రజల ప్రధానసుగుహక్కులను అట్టి యధి కారుల దురాగ్రహములకు గురిచేసినయెడల, రాజ్యము యొక్క ముఖ్యోద్దేశ్యముననే భంగము వాటిల్లును. కావున ప్రభుత్వోద్యోగులును సామ్రాన్యులవలెనే తమ ప్రవర్తనకు, న్యాయస్థానముల విచారణకు బద్ధులుకావల యును. (౨) పౌరునిహక్కులకంటె సంఘముయొక్క శాంతిభద్రతలును, సౌభాగ్యమును ఎక్కుడు ప్రాముఖ్య మును గలిగియున్నవి. కావున, రాజ్యశాసనము లమలు జరుపుటలో యుద్యోగులకు కొంతస్వాతంత్ర్య ముండవల యును. వారిచర్యలను ఖండించుటకు సామాన్యన్యాయ స్థానముల కధికార మిచ్చినయెడల వారు రాజ్యశాసన ముల సుస్థిరముగా నమలుజరుపజాలరు. వారి యుద్యోగ నిర్వహణమునందు ప్రజలు చీటికిమాటికి వారిని న్యాయ స్థానముల కీడ్చెదరన్న భయ మెంతమాత్రమును ఉండ గూడదు. అట్టిభయమే యున్నచో, పరిపాలన దుస్తర మగును. ప్రభుత్వోద్యోగులను విచారించుటకు సామాన్య న్యాయస్థానములకు హక్కుండకూడదు. బ్రిటిష్‌సామ్రా జ్యమును, అమెరిసంయుక్తరాష్ట్రములును ఇందు మొదటిసిద్ధాంతమునే యంగీకరించి ప్రభుత్వోద్యోగులను న్యాయస్థానములవిచారణకు బద్ధులను జేయుచున్నవి. ఐరోపాఖండమున గల ప్రధానరాజ్యములన్నియు రెండవ సిద్ధాంతము నంగీకరించి ప్రభుత్వోద్యోగులను సామాన్య న్యాయస్థానముల భారినుండి తప్పించుచున్నవి. ఈరాజ్య ములందు ప్రభుత్వోద్యోగుల యక్రమచర్యలను ఖండించి

శిక్షించుటకు మరియొక యవకాశ మేర్పరుపబడినది. ప్రభుత్వోద్యోగులచర్యలపై విచారణసల్పుటకు సామాన్య న్యాయస్థానములు గాక ప్రభుత్వన్యాయస్థానము లనుపేరుతో, మరియొక శాఖ నెలకొల్పబడినది. ఇందు న్యాయమూర్తులు కార్యనిర్వాహకవర్గమునకు చెందినవారై యుందురు.

---

## ౬

# ఐక్య, సంయుక్తప్రభుత్వములు

ఈ రెండురకముల ప్రభుత్వము లేర్పడుటకును ముందు కొన్ని రాజ్యముల కలయిక యవసరము. ఇట్టి కలయిక జరుగుట కనేకమార్గములు గలవు. (౧) యుద్ధము:- ఒకరాజ్యము ఇతరరాజ్యములను యుద్ధమున జయించి తనలో కలుపుకొనవచ్చును. (౨) ఒడంబడిక:—కొన్ని రాజ్యములు కలసి ఒకసంఘముగా ఏర్పడుటకు బుద్ధిపూర్వకమగు ఒడంబడిక చేసికొనవచ్చును. (౩) దత్తత:— ఒకరాజ్యము మరియొకరాజ్యమునకు తనలో కొంతభాగము నీయవచ్చును. (౪) వలస లేర్పరుచుట:—ఒకరాజ్యములోని ప్రజలు, ఇదివర కేరాజ్యమునకును జెందని ప్రదేశములకు వలసపోయి, యామండలములను వశపరచుకొని, తమ మొదటిరాజ్యమునకు స్వాధీనముచేయవచ్చును.

రాజ్యము లిట్లు కలయుటతోడనే, తమతమ ప్రత్యేక రాజ్యత్వములను కోలుపోయి, అన్నియు కలిసి యొక్కటే

రాజ్యమగుచున్నవి. అంతటితో, కలసిన రాజ్యము లన్నియు రాష్ట్రములుగా మారుటయు, అట్టిరాష్ట్రముల నన్నిటిని ఒక్కటిగా బంధించెడి కేంద్రస్థాన మొక్క టేర్పడుటయు జరుగును. రాష్ట్రవ్యవహారములను పరిపాలించు ప్రభుత్వములు రాష్ట్రప్రభుత్వము లనియు, కేంద్రమునుండి సంయుక్తవిషయముల వ్యవహరించునట్టిది కేంద్రప్రభుత్వ మనియు పేర్కొనబడుచున్నవి. కేంద్రప్రభుత్వమునకు రాష్ట్రప్రభుత్వములు లోబడి వ్యవహరించుపద్ధతినే ఐక్యప్రభుత్వవిధాన మందురు. అనగా ఐక్యవిధానమునందు కేంద్రప్రభుత్వము సర్వాధికారి. దాని యుత్తరువులకు రాష్ట్రప్రభుత్వము లన్నియు తలయొగ్గవలయును. అది రాష్ట్రప్రభుత్వములను మార్పు చేయగలదు; రద్దు చేయగలదు; రాష్ట్రప్రభుత్వపు శాసనములను, చర్యలను త్రోసివేయగలదు; రాష్ట్రము లన్నిటికిని తానే శాసనముల జేయగలదు. ఇందుల కుదాహరణముగా బ్రిటిష్‌ప్రభుత్వమును జూపవచ్చును. బ్రిటిష్ రాజ్యమున, వలస లేర్పరచుటమూలముగా దక్షిణాఫ్రికా, కెనడా దేశములును, జయించుటమూలముగా హిందూదేశమును, ఇచ్చుటమూలముగా ఆస్ట్రేలియా దేశమును కలసినవి. అనగా, ఈరాజ్యము లన్నియు బ్రిటిష్‌సామ్రాజ్యమున రాష్ట్రము లాయెను. ఇన్ని దేశములు కలసి యేర్పడిన బ్రిటిష్‌సామ్రాజ్యమున ఐక్యప్రభుత్వవిధాన మమలునందున్నది. అది యెట్లనగా హిందూదేశపురాష్ట్రములకును, దక్షిణాఫ్రికా కెనడా ఆస్ట్రేలియా మొదలగు దేశములందుగల రాష్ట్రములకును బ్రిటన్ కేంద్రస్థాన మగు

చున్నది. ఈరాష్ట్రము లన్నిటియందును ప్రత్యేకప్రభుత్వము లేర్పడియున్నను, బ్రిటిష్ప్రభుత్వముయొక్క సర్వాధికారమున కద్దుతెగులజాలవు. అది యేమి చేయదలచినను చేయగలదు. నిజమునకు కెనడా, దక్షిణాఫ్రికా, ఆస్ట్రేలియా దేశములందు ఈయధికారము కేవలము నామమాత్రముగా నున్నను శాస్త్రీయముగా చూచిన ఆ దేశములు లోబడియున్నవని యొప్పుకొని తీరవలయును.

ఇక సంయుక్తవిధాన మెట్టిదనగా, ఇటు కేంద్రప్రభుత్వము, అటు రాష్ట్రప్రభుత్వములు రాజ్యాధికారములను విభాగించుకొని దేనిహద్దులలో నవి సంపూర్ణస్వాతంత్ర్యమును గలిగియుండును. రాష్ట్రప్రభుత్వములకు సంక్రమించిన అధికారార్హతలతో కేంద్రమున కెట్టి జోక్యమును ఉండదు. కేంద్రమునకు సంబంధించిన పరిపాలనతో రాష్ట్రముల కెట్టి ప్రసక్తియు లేదు. ఒకదానిపై మరియొకటి ఆధారపడియుండదు. ఇందుల కుదాహరణముగా, అమెరికాసంయుక్తరాష్ట్రముల నెత్తవచ్చును. మొట్టమొదట పదునాలుగు అమెరికారాజ్యములు కలసి ఒకరాజ్యముగా నేర్పడుటకు ఒడంబడిక చేసికొనెను. ఏతత్ఫలితముగా నేర్పడిన రాజ్యమున, ప్రభుత్వము సంయుక్తవిధానము ననుసరించి యుండునట్లు నిశ్చయింపబడినది. ఈనిశ్చయమును కలిగియున్న పత్రమే అమెరికాసంయుక్తరాష్ట్రరాజ్యాంగచట్టమని పిలువబడుచున్నది. ఇందు కేంద్రమునకు వదలిన రాజ్యరక్షణ, యుద్ధము, ఒడంబడికలు, విదేశవ్యవహారములు మొదలగు సర్వరాష్ట్రప్రాముఖ్యముగల విషయములకు మినహా,

తక్కినవిషయములందు ఏరాష్ట్రమున కారాష్ట్రము సంపూర్ణస్వాతంత్ర్యమును కలిగియున్నది.

సంయుక్తవిధానమునం దొకసారి చేరిన రాష్ట్రము నకు విడిపోవుహక్కుండదు. ఏరాష్ట్రము గాని, సమ్మేళ నమునుండి విడిపోవ ప్రయత్నించినయెడల కేంద్రప్రభుత్వ ము తక్కిన రాష్ట్రప్రభుత్వములు కలసి బలప్రయోగ ముచే అట్టిరాష్ట్రమును సంయుక్తబంధమున నిలుపును. కొన్నిరాజ్యములు విడిపోవుహక్కును తమయందేయుంచు కొని ఒకసంఘముగా నేర్పడవచ్చును. ఇట్టికలయికను రాజ్యసమితియని యందురు. ఇందే రాజ్యముగాని తన యిచ్చవచ్చినప్పుడు తొలగిపోవచ్చును. ౧౮౧౫ వ సంవ త్సరపు "జర్మన్ కాణ్ ఫెడరేషన్" (సమితి) అనునది యిట్టిది. ప్రస్తుత మమలునందున్న "లీగ్ ఆఫ్ నేషన్సు" (నానారాజ్యసమితి) కూడ ఇంచుమించుగా ఈతరగతి క్రిందికే వచ్చును.

రెండు లేక రెంటికిమించిన సంఖ్యగల రాజ్యములు కలయుటలో గల ముఖ్యోద్దేశ్యము ప్రథమమున ఆత్మరక్ష ణార్థమైయుండును. ఒకపెద్దరాజ్యముయొక్క ధాటికి భయ పడి, పరిసరప్రాంతములనున్న చిన్నచిన్నరాజ్యము లొక సంఘముగా నేర్పడి, తమతమస్వాతంత్ర్యముల కాపాడు కొన నెంచుట స్వభావసిద్ధము. క్రీస్తుపూర్వము కొన్ని వందలసంవత్సరముల క్రిందటనే గ్రీసుదేశమున "యేజి యన్ లీగ్" అనుపేరుతో ౧౨ చిన్నపట్టణరాజ్యముల సమ్మేళన మొకటి జరిగినట్లు చరిత్రవల్ల తెలియవచ్చు చున్నది. దరిమిలా ఇట్టివే అనేకసమ్మేళనలు అనేకపరి

స్థితులలో అనేకవిధములుగా ఏర్పడుటయు, నశించుటయు చరిత్రయందు గానవగును. ఈ వివిధములగు సమ్మేళనలే నేటి సంయుక్తవిధానమునకు దారిచూపెను. ప్రపంచమంతయు నేడు మిక్కిలి యాతురతతో నిరీక్షించుచున్న విశ్వమానవసామ్రాజ్యాదర్శము కూడ ఈసంయుక్తసూత్రముపైనే ఆధారపడియున్నది. అది జరిగినయెడల సంయుక్తవిధానము సంపూర్ణత్వమును చెందినదనే చెప్పవచ్చును.

---

# ౭
# పార్టీప్రభుత్వము, రాజకీయకక్షలు

## ౧. పార్టీయనగానేమి?

రాజకీయకక్ష యనగా, ప్రభుత్వస్థానముల వశపరచుకొనవలెననెడి కాంక్షతో ఏర్పడెడి కొందరి వ్యక్తుల సమూహము. ఇట్టి కక్షలకు (పార్టీలకు) నిరంకుశరాజప్రభుత్వములందు స్థాన ముండదని చెప్పవలసిన పనిలేదు. నిరంకుశుడు తనకు మినహా తనరాజ్యమున మరియొకని యుద్దేశ్యముల పాటించడు. ప్రజాప్రభుత్వపరిస్థితి యట్టిది కాదు. ఇందు పరిపాలనావిధానమును నిర్ణయించు అధికారము ప్రజల వశమైయుండును. ఏతద్విషయమున ప్రజలందరును సమానభాగస్వాములే యగుటచే పరిపాలనయందు ఒకవ్యక్తి తనంతట ఒంటరిగా సాధించగలిగిన దెద్దియు నుండదు. ఒకకార్యమును సాధించవలె నన్నను,

లేక యొకవిధానము నయులు జరుపవలెనన్నను అధిక సంఖ్యాకు లందులకు పూనుకొనవలయును. అనగా, అధిక సంఖ్యాకు లావిషయమున నేకోన్ముఖులై యైకమత్యముతో పనిచేయవలయును. ఇదియే రాజకీయకక్ష యనునది.

ప్రజ లందరును ఏవిషయమున గాని, యేకాభిప్రాయముతో నుండుట కేవల మసంభవమని చెప్పవచ్చును. నిజమునకు, ఎంతమంది వ్యక్తు లుందురో, అన్నియభిప్రాయభేదములును బయలుదేరును. అట్లయిన నిక ప్రజాపరిపాలనయనునది సాగు టెట్లు? ఇందుల కొకసూత్రము గలదు. ఈయభిప్రాయభేదములకు కొంతవరకు మానవప్రకృతియు, కొంతవరకు తలపెట్టిన కార్యముయొక్క స్వభావమును కారణము. మంచి గాని, చెడ్డ గాని, కలగలుపులేని విషయమే లేదు. ఒకవేళయున్నను, అది మానవుల కబ్బునట్టిది కాదు. ఏకార్యమునైనను దలపెట్టుడు. అందు కొందరికి మంచియు, మరికొందరికి చెడ్డయు నెక్కువగా గోచరించును. సూక్ష్మముగా జూచిన, ప్రతియొక్కనికి అభిప్రాయభేద మున్నప్పటికిని, మొత్తముమీద, సామాన్యముగా ముఖ్యమగు భేదాభిప్రాయములు రెండేయని చెప్పవచ్చును. సూక్ష్మభేదములను, కారణములను అలుంచినయెడల పర్యవసానమున నౌననువారు కొందరును, కాదనువారు కొందరును తేలెదరు. కావున ముఖ్యమగు పార్టీ లెప్పుడును రెండే. ప్రజాప్రభుత్వమున అధికసంఖ్యాకపక్షము మ్మాట చెల్లును. అనగా ప్రభుత్వము ఆపక్షము వశమగును.

పై న తెల్పిన దానిని బట్టి ముం దొకసమస్య ఏర్ప డుటయు; దానిపై నౌననువారు కొందరు, కాదనువారు కొందరు, రెండుకక్షు లేర్పడుటయు జరుగునని తెలుచున్నది. ఒకసందర్భమున నొకపార్టీకి చెందిన వ్యక్తి మరియొక సందర్భమున తనయభిప్రాయము ననుసరించి యెదిరికక్షను చేరవచ్చును. ఈరెండుకక్షులును ఎప్పటికప్పటి కాసమ స్యపై నాధారపడియుండును. అంతియెగాని, యొక ఖాయ మగు కక్షయని గాని, యొకడు ఖాయముగా ఒకకక్షకు చెందినవా డనిగాని చెప్పుటకు వీలు- లేదు. ఇదం తయు నిజమే, కాని, ప్రస్తుతకాలపు రాజకీయకక్ష లట్టివి కావు. అవి సంవత్సరముల తరబడి ఖాయముగా నిలిచి పనిచేయుచున్న సమూహములు. నేటి రాజకీయకక్షలు ఒకసమస్యతో పుట్టి, యాసమస్యాపరిష్కారముతో నంత మొందుట లేదు. నిజముగా నేడు సమస్య ననుసరించి కక్ష లేర్పడుచున్నవనుట కంటె, కక్ష ననుసరించి సమస్యలు పరి ష్కరింపబడుచున్నవనుటయే సమంజసము. ఇప్పుడు దాదా పు ప్రతిరాజ్యమునందు నిట్టి ఖాయపుకక్ష లేర్పడియున్నవి. నేటిరాజకీయకక్షల కొకనిశ్చయమగు విధానము, సూత్ర ములు, నిబంధనలు ముందే తయారుచేయబడుచున్నవి. ఇకముం దెప్పుడో యేర్పడు రాజకీయసమస్య లన్నిటిని, ఈ సూత్రముల ననుసరించియే పరిష్కరింపవలయును. అనగా, సమస్యయున్నను లేకున్నను పరిష్కరించుటకు విధాన ము, సూత్రములు మాత్ర మెప్పుడును తయారుగా ఉం డును. అట్లే కక్షలును ఆసూత్రములనుబట్టి ప్రవర్తించు చుండును. సభ్యు లందరు ఆసూత్రములకు కట్టుబడి యుం

డవలెను. వారు (వ్యక్తిగతమగు అభిప్రాయము లెట్లున్నను) పార్టీనిర్ణయములను మన్నించి బలపరచవలయును. ఒకపార్టీకి చెందిన సభ్యు డేకారణముచేతనైనను తన పార్టీని విడనాడిన యెడల యాతడాపార్టీసభ్యులయొక్కయే గాక, ఇతరులయొక్క యభిప్రాయములకు గూడ గురియగుచున్నాడు. ప్రజలాతని కృతఘ్నుడనియు, దుర్మార్గుడనియు, స్వలాభపరాయణుడనియు పెక్కువిధముల నిందించుచున్నారు. అనేకసమయములలో వ్యక్తులు తమ స్వాభిప్రాయములను పార్టీనిర్ణయములకు బలిగా నీయవలసియుండును.

తరువాత నేడు దాదాపుగా అన్నిదేశములందును రెండు రాజకీయకక్షలకు బదులుగా ననేకకక్షలను మనము ప్రత్యక్షముగా జూచుచున్నాము. ఒకముఖ్యమగు రాజకీయసమస్యయే యున్న యెడల పైన తెల్పినట్లుగా 'ఔను, కాదు' అను రెండుపార్టీలే యుండగలవు. అట్టి సమస్య లేనప్పుడు పెక్కుపార్టీలు బయలుదేరును. ప్రతివారికిని అధికారము వహించవలె ననెడి కుతూహలమే ఇందులకు కారణము. ప్రతిపార్టీయు ప్రజలవిశ్వాసమును సంపాదించుటకు విచ్చలవిడిగా వాగ్దానముల చేయును. సంఘమున కెన్నియో మేళ్లు చేకూర్చెదమని శపథములు చేయుదురు. ఈపార్టీలకు తీవ్రమగు భేదాభిప్రాయము లుండవు. పేళ్లను బట్టి చూచిన అన్నియు అన్నిపార్టీలే గాని, ఆచరణలో ఇంచుమించుగా నందరును నొక్కపంథానే త్రొక్కెదరు. సామాన్యముగా ప్రభుత్వపుటెన్నికలలో ప్రతికక్షయు కొద్దిగనో, గొప్పగనో స్థానములు

సంపాదించుకొనును. ఒక్కొక్కప్పుడు మూడు లేక నాలు
గు పార్టీ లున్నచోట అన్నియు కొద్దివ్యత్యాసములతో
ఎన్నికలయందు జయమును పొందవచ్చును. అట్టియెడ,
ఏపార్టీయును తనంతట తాను ప్రభుత్వమును నిర్వహించ
జాలదు. ప్రభుత్వమును నిర్వహించుటకు, తగినంత అధిక
సంఖ్యాకబలమును సమకూర్చుకొనుట కేవో రెండుపార్టీ
లు సమ్మేళన మొందవలయును. ఈ సమ్మేళనమునుండి
యెవరు తొలగెదమని బెదరించినను ప్రభుత్వమున కుక్కిరి
బిక్కిరి యగుచుండును. తొలగినపూట ఆటకట్టిన దన్న
మాటే. ప్రస్తుతకాలమున ఫ్రెంచిప్రభుత్వ మీదురవస్థ
యందే యున్నది. అచ్చట ప్రభుత్వములు వారమున
కొకటి పుట్టుటయు, గిట్టుటయు గమనించదగిన విషయము.

౨. పా ర్టీ ని ర్మా ణ ము.

ప్రతికక్షకు దేశమున కంతకు ఒక కేంద్రసంఘ
ముండును. దా ని క్రి ం ద తగరగతివారిగా రాష్ట్ర
సంఘములు, జిల్లా సంఘములు, తాలూకాసంఘములు,
గ్రామసంఘములు ఏర్పాటుచేయబడును. గ్రామములో
ఆకక్షకు చెందిన వా ర ం ద రు గ్రామసంఘమునకు
స భ్యు ల నె న్ను కొ ం దు రు. ఈగ్రామసంఘములు
తమసభ్యులలో నుండి యొకనిని గాని, కొందరిని గాని
తాలూకాసంఘమునకు ఎన్నుకొందురు. మరల నట్లే
తాలూకాసంఘములు జిల్లాసంఘమునకు, జిల్లాసంఘము
లు రాష్ట్రసంఘమునకు, రాష్ట్రసంఘములు కేంద్రసంఘ
మునకు సభ్యుల నెన్నుకొనును. కేంద్రసంఘముయొక్క
తీరుమానములను దిగువసంఘము లన్నియు శిరసావహించి

యమేలు జరుపవలెను. కేంద్రసంఘము సర్వాధికారి. ప్రభుత్వపు టెన్నికలలో పాల్గొనుటకు ప్రత్యర్థులను కేంద్ర సంఘమే నియమించును. సాధారణముగా, దిగువసంఘములతో సంప్రదించియే యిట్టి నియామకముల చేయుచుండును. ఎన్నికలకు ముందు, ప్రతికక్షయు, తనవాగ్దానములను (అనగా తాను ప్రజలకు చేయబోవు మేళ్ళను) యొకప్రణాళికరూపమున ప్రచురించి యెన్నికల ప్రచారమునకు దిగును. సభ్యులలో ఎవరయినను పార్టీ నిర్ణయములకు వ్యతిరేకముగా ప్రవర్తించినయెడల, కేంద్రసంఘము వెంటనే యట్టివారిమీద తగినచర్య తీసికొని శిక్షించగలదు. సభ్యుల దుష్ప్రవర్తనసందర్భమున, చిట్టచివర శిక్ష సభ్యుని పార్టీనుండి తొలగించుట. దుష్ప్రవర్తనను తీరుమానరూపమున ఖండించుట, లేక ఆసభ్యుని మందలించుట, లేక బాధ్యతతో కూడుకొన్న పార్టీహోదాల కనర్హునిగా నిశ్చయించుట మొదలగునవి తక్కువ శిక్షలు. వీనినే మొత్తముగా శిక్షణ లందురు.

### ౩. పార్టీ ప్రభుత్వపు విమర్శ.

పార్టీప్రభుత్వమును ఖండించువారి సంఖ్య యంతకంతకు హెచ్చుచున్నదనియే చెప్పవచ్చును. రాజకీయకక్ష యనునది కేవల మస్వాభావికము. ఏలననగా, సభ్యు లందరు సర్వవిషయములందు ఏకాభిప్రాయముతో నుండుట దుర్లభము. ఒక డొకపార్టీకి చెందిన హేతువుచే స్వాభిప్రాయములకు విరుద్ధముగా ఆచరింప వలసి వచ్చుచున్నది. పార్టీనిర్ణయములను సభ్యు లందరు, తమతమ వ్యక్తిగతమగు ఉద్దేశ్యము లెట్లున్నను, బలపరచి తీరవలయును.

అట్టియెడ, పార్టీని విడనాడినయెడల ఆతడు నింద పాలు గా వలసివచ్చును; విడనాడకున్న, తన యాంతరంగికోద్దేశ్యము నకు వ్యతిరేకముగా ఆచరింపవలసినవా డగుచున్నాడు. అనగా, తనమనస్సులోనున్న దొకటి, తను పైకిచెప్పునది, చేయునది మరియొకటి. సామాన్యులలో ఇట్టి ప్రవర్తన గల వానిని దుర్జను డనియు, కృతిమి డనియు దూషించెదరు. రెండవది అది ప్రజాప్రభుత్వసిద్ధాంతమునకు విరుద్ధము. పార్టీవిధానమునందు వ్యక్తిగతమగు యభిప్రాయమునకు తావులేదు. ప్రతివ్యక్తియు తన యభిప్రాయములను నిర్భయముగా వెల్లడింపవచ్చు ననునది ప్రజాప్రభుత్వముఖ్య సూత్రములలో మొట్టమొదటిది. పార్టీప్రభుత్వమున, పార్టీవిధానము ననుసరించి వ్యక్తి తనయభిప్రాయములను సవరించుకొనవలెను. నిజముగా, వ్యక్త్యభిప్రాయములను బట్టి చూచినయెడల, నేడు బ్రిటిష్‌పార్లమెంటులో 'కన్సర్వేటివ్' సభ్యులలో అనేకులు 'లిబరల్సు' యుందురు. అట్లే 'లిబరల్సులో' అనేకులు 'కన్సర్వేటివ్'లుందురు. ఇట్లు, అంతరాత్మలో 'లిబరల్సు' ఆచరణలో 'కన్సర్వేటివ్' లయినవారలు, 'లిబరల్' పార్టీవారి ప్రతిపాదనను, దాని మంచిచెడ్డలతో నిమిత్తములేకుండ, రెండువిధముల 'కన్సర్వేటివ్' లయినవారితోపాటు, నిరాకరింపవలసినదే. ఈకారణముచే ఒక్కొక్కప్పుడు పార్లమెంటులో అధికసంఖ్యాకుల కంతరాత్మలో నచ్చిన ప్రతిపాదన నిరాకరింపబడవచ్చును. అది యెట్లనగా, పార్లమెంటులో నాలుగువందలమంది కన్సర్వేటివులు, మూడువందలమంది లిబరల్సు యున్నారనుకొనుడు. ఒకలిబరల్

సభ్యుడు ప్రవేశపెట్టిన ప్రతిపాదనకు ఆంతరంగికముగా జూచిన ౧౫౦ మంది కన్సర్వేటివులు, ౨౫౦ మంది లిబరల్సు అనుకూలురు. తక్కినవా రందరు ప్రతికూలురు. అనగా, ప్రతిపాదనకు ౪౦౦ మంది అనుకూలురు; ౩౦౦ మంది ప్రతికూలురు. కావున, ప్రతిపాదన నెగ్గవలెను గదా. కాని, యాచరణలో అట్లు జరుగుదురు. కన్సర్వేటివుల పార్టీసమావేశములో ముందీప్రతిపాదనను గూర్చి చర్చ జరుగును. అందు ౨౫౦ మంది ప్రతిపాదనను నిరాకరింపవలెననియు, ౧౫౦ మంది ఆమోదింపవలె ననియు నందురుగదా. అట్లయిన, చివరకు పర్యవసానము అధికంఖ్యాకులు (౨౫౦ మంది) ప్రతికూలు రగుటవల్ల నిరాకరింపవలెనను నిర్ణయమే జరుగును. అనుకూలురు ౧౫౦ మంది కూడ పార్టీనిర్ణయమునకు బద్ధులే. ఇట్లే లిబరలుపార్టీ సమావేశమునందు కూడ జరుగును. తుదకు పార్లమెంటులో ప్రతిపాదన వోటింగునకు వచ్చుసరికి, ౩౦౦ మంది లిబరల్ సభ్యులు అనుకూలురుగను, ౪౦౦ మంది కన్సర్వేటివుసభ్యులు ప్రతికూలురుగను, వోటుచేయుట సంభవించును. తత్ఫలితముగా, పార్లమెంటుసభ్యుల ఆంతరంగికోద్దేశ్యముల ప్రకారము నెగ్గవలసిన ప్రతిపాదన త్రోసివేయబడుచున్నది. కృత్రిమపుకక్షయనగా ఇట్టిది. ఇందు వ్యక్త్యభిప్రాయములు కక్షునిర్ణయములకు బలిగాబడుచున్నవి. నిజముగా, ఇది యొకవిధమగు నిరంకుశత్వమేయగును.

పార్టీప్రభుత్వమును సమర్థించువారివాదన ఈక్రింది విధముగా నున్నది. ప్రజలను, సామాన్యముగా, నాలుగు తరగతులుగా భాగింపవచ్చును. మొదటితరగతి, పురా

తనసంస్థలను పునరుద్ధరింపవలె ననెడివారు: వీరిని సనాతను లందురు. రెండవతరగతి, ఇప్పు డున్నసంస్థల నున్నట్లుగా కాపాడవలె ననెడి వారు: వీరిని మితవాదు లందురు. మూడవది, ఉన్న సంస్థలను సంస్కరింపవలె ననెడి వారు: వీరిని అతివాదు లందురు. నాల్గవది, ఉన్నవానిని ధ్వంసముచేసి క్రొత్తవానిని నెలకొల్పవలె ననెడివారు: వీరిని తీవ్రవాదు లందురు. సామాన్యముగా, పై రెండు తరగతులు ఒకప్రక్కను, క్రింది రెండుతరగతులు మరి యొకప్రక్కను కలసి పనిచేయుట సంభవించును. కార్య సానుకూలమునిమిత్తము వ్యక్తిగతమగు సూక్ష్మభేదముల త్రోచిపుచ్చి, పదుగు రొకపార్టీగా కలసి పనిచేయుట యనునది స్వాభావికమే గాని, అస్వాభావిక మెప్పుడును గాదు. అదియునుగాక, ఇది ప్రజాప్రభుత్వసిద్ధాంతమునకు విరుద్ధమును గాదు. నిజమునకు ప్రజాప్రభుత్వము కొనసాగవలె నన్న ఇది యొక్కటేమార్గము. ఒకనిశ్చయమగు విధానముతో దృఢముగా ఏర్పడిన రాజకీయకక్షయే లేనియెడల, ప్రజాప్రభుత్వము కేవలము దుస్తరమే యగును. ఎవరికి తోచినట్లు వారు మాట్లాడుటయు, ఎవరికి నచ్చినట్లు వారు చేయుటయు నైనయెడల, అది పరిపాలన గానేరదు. ప్రజాపరిపాలన యనగా, అధికసంఖ్యాకుల పరిపాలనయగును గాని, ప్రజ లందరి పరిపాలన యెప్పుడును గానేరదు. కావున, అధికసంఖ్యాకకక్ష యొకటి, అల్పసంఖ్యాకకక్ష యొకటి, ఈరెండును తప్పనిసరి యగుచున్నవి. పరిపాలన దృఢముగాను, స్థిమితముగాను జరుగవలెనన్న అధికసంఖ్యాకకక్ష దృఢముగాను, స్థిమితము

గాను ఉండవలయును. ఒకపార్టీకి దృఢత్వము, స్థిమితము ఉండవలె నన్న ఆపార్టీసభ్యు లందరు వ్యక్తిగతమగు సూక్ష్మభేదముల నావలయుంచి, పార్టీయొక్క ముఖ్యసూత్రములను, విధానమును నామోదించుట కంగీకరింపవలయును. ఈయంగీకరణయే యస్వాభావిక మయినయెడల, అది స్వాభావికమగు యస్వాభావికమే యగుచున్నది. ఇంత మాత్రము సామరస్యము, కలుపుగోలుతనము, ఐకమత్యము ప్రజలలో లేనియెడల ప్రజాప్రభుత్వ మనునది వట్టిబూటకము. అట్టిచో ప్రజాప్రభుత్వమునకును, అరాజకమునకును వ్యత్యాస మేమియు నుండజాలదు.

మొత్తముమీాద, ఈరెండువాదన లందునను సత్యము లేక పోలేదు. ఏదో యొకవిధమగు సంఘీభావము, ఐక్యమత్యము గల రాజకీయకక్షలు ప్రజాప్రభుత్వమునకు తప్పనిసరియే యగుచున్నవి. అమెరికాసంయుక్తరాష్ట్రము లిట్టికక్షలు కూడ దను పట్టుదలతో ప్రారంభించినను, చిట్టచివరకు తప్పనిసరియై పార్టీవిధానము నంగీకరించి యవలంబించవలసివచ్చినది. అట్లని కేవలము వ్యక్తిస్వాతంత్ర్యమున కుదాసీనము చెప్పుమని యర్థముగాదు.

ఏపార్టీగాని తనసభ్యుల వ్యక్త్యభిప్రాయములను మిక్కిలిగా గౌరవించవలయును. ఏసభ్యునకుగాని తనకు పార్టీతో తీవ్రమగు భేదాభిప్రాయ మేర్పడినపుడు, తన యభిప్రాయమును బట్టి నడచుటకు సావకాశము లుండవలయును. ఈసందర్భమున ఒక ఖండితమగు నిర్ణయమును జేయుట కేవల మసాధ్యముగా గన్పించుచున్నది. పార్టీ విధానము యొక్క భవిష్యత్తును గూర్చి ప్రపంచమున

నెల్లెడలను నేడు విపరీతమగు క్రొత్త ఊహలు బయల్వెడలుచున్నవి. ఈవిషయమున జోస్యము చెప్పుటంత తేలికగాదు.

---

౯

# స్థానిక ప్రభుత్వము

## ౧. స్థానిక ప్రభుత్వమనగా నేమి?

నేటి రాజ్యములలో ప్రభుత్వములు నిర్వహించవలసిన కార్యము లనేకములు, అతిభారములు. అవి ముఖ్యముగా రెండువిధములైనవి. (౧) విదేశములతో వర్తకము, ఒడంబడికలు, యుద్ధములు, రాజీలు సంప్రదింపులు మొదలుగా గలవి: వీనిని విదేశవ్యవహారము లనియందురు. (౨) దేశములోని వర్తకము, న్యాయపరిపాలన, శాంతిభద్రతలు, విద్య, ఆరోగ్యము, పారిశుద్ధ్యము, అభివృద్ధి, రాకపోకల సౌకర్యములు మొదలగునవి: వీనిని అంతర్వ్యవహారములని యందురు. ఇంతటి బాహుళ్యమైన వ్యవహారకాండను ప్రభుత్వ మొకకేంద్రస్థానమున నుండి, యెట్టి లోటుపాటులు లేక చక్కబెట్టుట సులభసాధ్యము కాదు. అది దుస్సాధ్య మనియే చెప్పవచ్చును. ప్రభుత్వ మొకముఖ్యపట్టణమున గూర్చుండి, దేశమునందంతటను పట్టణములలోను, మారుమూలగ్రామములలోను, కాపురముండు ప్రజల కష్టసుఖములను దినదినము గుర్తించి, తగురీతిగా వ్యవహరించుట యనునది యసం

భవము. అందునను, ముఖ్యముగా యావద్దేశమునకు సంబంధించిన సమస్యలే లెక్కకు మించిపోవుచున్న నేటి పరిస్థితులలో, దేశమునందు ప్రత్యేకప్రత్యేక ప్రదేశముల యొక్క సామాన్యావసరముల సంతృప్తికరముగా సర్దుబాటు చేయుటకు కేంద్రప్రభుత్వమున కేపాటి సావకాశ మునుండదని వేరె చెప్పనక్కరలేదు. కేంద్రప్రభుత్వము తనముఖ్యవిధులను సంతృప్తికరముగా నెరవేర్చవలె నన్న, పరిపాలనాభారమును కొంతవరకు తనసర్వాధికారమునకు లోబడి వర్తించు ఇతరులపై నుంచుట యవసరము. ఇందులకు దేశ మనేకభాగములు గాను, అంతర్భాగములు గాను విభజింపబడుచున్నది. ఇట్టిభాగము లందు స్థాపించిన పరిపాలనాసంఘములనే స్థానిక ప్రభుత్వము లందురు. హిందూదేశమున ప్రతిరాష్ట్రమును మొదట జిల్లాలుగను, ఇట్టి జిల్లాలు తాలూకాలుగను, యిట్టి తాలూకాలు మరల గ్రామములుగను, విభాగించి యున్నారు. అట్లే యింగ్లాండు దేశమున కౌన్టీలును, డిస్ట్రిక్టులును, ప్యారిషులును గలవు. అమెరికాసంయుక్త రాష్ట్రలందు ప్రతిరాష్ట్రమునందునను కౌంటీలు, టవున్ షిప్పులుగలవు. ఫ్రాన్సు దేశమునందు డిపార్టుమెంటులనియు, అరాండిస్ మెంటు లనియు, క్యాంటను లనియు, కమ్యూనుల నియు నాలుగువిధములగు విభాగము లున్నవి. ప్రతిదేశము నందునను ఈవిభాగములయందు స్థానికపరిపాలనాసంఘ ముల నెలకొల్పి వారిపై పరిపాలనాభారమును కొంత మోపుచున్నారు. హిందూదేశమున స్థానికప్రభుత్వమున జిల్లా బోర్డులనియు, తాలూకాబోర్డులనియు, గ్రామపంచాయితీ

లనియు, యూనియనులనియు, పురపాలకసంఘములనియు వివిధసంస్థలు గలవు. జిల్లాబోర్డు జిల్లామొత్తమునం దంతటను, తాలూకాబోర్డు తాలూకాయం దంతటను, గ్రామపంచాయితీ గ్రామమునందును వ్యవహరించును. (ఇటీవల మద్రాసు రాజధానిలో తాలూకాబోర్డుల నెత్తివేసిరి) పెద్దపెద్దగ్రామములందు వ్యవహరించు సంఘములను యూనియను లనియు, గొప్పపట్టణములయందు వ్యవహరించు సంఘములను పురపాలకసంఘములనియు (మ్యునిసిపాలిటీలు) అందురు.

ఈస్థానికసంఘముల చేతిలో పరిపాలన ఎంతవరకు బెట్టవచ్చు నన్నదియే ప్రశ్న. అన్నిరాజ్యము లందునను, స్థానికసంఘములు నిర్వర్తించు విధు లొక్కపోలికగా లేవు. అవి యొక్కొక్కదేశమున నొక్కొక్కవిధముగా నున్నవి. ప్రభుత్వముయొక్క ముఖ్యబాధ్యతలగు దేశసంరక్షణ, విదేశసంబంధములు, న్యాయపరిపాలన, వర్తకము మొదలగు యావద్దేశమునకు సంబంధించిన విషయములను స్థానికసంఘముల పరము జేయుటకు సావకాశము లేదని వేరే చెప్పనవసరములేదు. ఏదో యొక ప్రత్యేక ప్రదేశమున మాత్రమే ప్రాముఖ్యములగు కొన్నివ్యవహారములను ఆస్థానికసంఘములకు వదలివేయవచ్చును. ఉదాహరణముగా ఒకగ్రామమును తీసికొనుడు. ఆగ్రామమునకు పాఠశాల; పఠనమందిరము; గ్రామచావడి; వచ్చెడు 'పరదేశులకు' వసతిగృహము; వీధులను, మంచినీళ్ళబావులను, చెరువులను పరిశుభ్రముగా నుంచుట మొదలగునవి అత్యంతముఖ్యములు. ఇట్టి సామాన్యగ్రామవిషయము

లను, గ్రామమునకు కొన్నివందలమైళ్ళ దూరముననున్న రాజధానినగరమున, ఒకమహాభవనమునందు గొప్పగొప్ప రాజకీయముల చర్చించు మంత్రివర్గముపై బెట్టుటకంటె, నిత్యము నచ్చోట కష్టసుఖముల ననుభవించు గ్రామపంచాయితీవశముజేయుట ఎన్నియో రెట్లు మేలు. అట్లు చేయుటచే అచటి కార్యములు శీఘ్రముగాను, సులభముగాను జరుగును. గ్రామపంచాయితీదృష్టిలో అత్యంతావసరములుగా గన్పడు ఈ సామాన్యసౌకర్యములు, గొప్పగొప్పరాజకీయసమస్యల చర్చించు కేంద్రప్రభుత్వమునకు మిక్కిలి స్వల్పవిషయములుగా గన్పడును. అదియునుగాక, దేశమునందు గల అనేక వేలగ్రామముల యొక్కయు, పట్టణములయొక్కయు సౌకర్యములను గూర్చిన గ్రంథము ప్రభుత్వమునకు మిక్కిలి భారమగును. ఇట్టి విషయములను ఆయాస్థానికప్రభుత్వములకే వదలిపెట్టిన యెడల, కేంద్రప్రభుత్వమునకు భారము తగ్గుటయేగాక, ఆకార్యములును చక్కగా నెరవేరగలవు. అయితే, గట్టిగా ఇవి స్థానికవిషయము లనియు, ఇవి యావద్దేశవిషయములనియు విభజించుట సాధ్యమైనది కాదు. ఒకవిధముగా జూచిన విద్యను యావద్దేశవిషయముగా భావింపవచ్చును; మరియొకవిధముగా చూచిన స్థానికవిషయ మని చెప్పవచ్చును. అట్లే, ఆరోగ్యము, న్యాయపరిపాలన, రహదారులు మొదలగువానిని కూడ రెండువిధములుగా వాదింపవచ్చును. సామాన్యముగా, నేటి రాజ్యములందు విద్య, ఆరోగ్యము, వైద్యశాలలు, ముఖ్యమగు రహదారులు మొదలగు పెద్దవిషయములను జిల్లాబోర్డులపరమును-

గ్రామపారిశుద్ధ్యము, మంచినీళ్ళవసతులు, చిన్నచిన్న రోడ్లు, వీధులయందు దీపములు వెలిగించుట మొదలగు చిన్నచిన్న గ్రామసౌకర్యములను గ్రామపంచాయితీలు లేక పురపాలకసంఘముల వశము చేయబడుచున్నవి. గ్రామమున జరుగు స్వల్పములగు నేరములు, ఇచ్చిపుచ్చుకొనుటకు సంబంధించిన చిన్నచిన్న తగాయిదాలు గ్రామ పంచాయితీలకే వదలిపెట్టబడుచున్నవి.

౨. స్థా ని క ప్ర భు త్వ ము ల ని ర్మా ణ ము.

స్థానికప్రభుత్వనిర్మాణసందర్భమున ప్రస్తుతరాజ్యములందు ముఖ్యముగా రెండుపద్ధతు లాచరణయందున్నవి. అందు మొదటిది స్థానికపరిపాలనను సంపూర్ణముగా ఆస్థానికప్రజల హస్తగతము చేయుట : దీనినే స్థానికస్వపరిపాలనావిధాన మందురు. రెండవది, సదరు పరిపాలన కేంద్రప్రభుత్వము నియమించిన యుద్యోగుల వశమునం దుండుట. మొదటిదగు స్వపరిపాలనావిధానమునందు, స్థానికప్రజ లందరు కలసి యొకచోట సమావేశమై పరిపాలనావిధానమును నిర్ణయించెదరు. ఇట్టి పద్ధతి కొద్ది జనాభాగల గ్రామములందు మాత్రమే సాధ్యమగును గాని, పెద్దపెద్దపట్టణములందు కొనసాగనేరదు. చిన్న గ్రామములో గ్రామస్తులందరు సంవత్సరమున కొకపర్యాయము గాని, లేక యవసరమైన యెడల అంతకు మించి గాని, యొక సంకేతస్థలమున సమావేశమై జరుగనున్న సంవత్సరమునకు విధించవలసిన పన్నులను, ఖర్చుపెట్టవలసిన మొత్తమును, మంజూరుచేయుట; అవసరమగు కార్యనిర్వాహకుల నెన్నుకొనుట మొదలగు కార్య

ప్రధానోద్యోగు లందరు ఆతని యాజ్ఞలకు బద్ధులు. స్థానిక ప్రభుత్వముల ఆదాయవ్యయములకు అధ్యక్షుని అనుమతి యవసరము.

మరికొన్ని దేశములందు పై రెండుపద్ధతుల సమ్మేళనమును జూడవచ్చును. ప్రభుత్వము నియమించిన యుద్యోగులసంఘ మొకటియు, ప్రజ లెన్నుకొనిన ప్రతినిధులసంఘ మొకటియు, ఈరెండును కలసి స్థానికపరిపాలనను నడుపుచున్నవి. అయితే, యుద్యోగులసంఘమునకు స్థానికపరిపాలనావ్యవహారములం దెక్కడు సంబంధము లేదు. అది ముఖ్యముగా ఇక్కడివిషయములను ప్రభుత్వమునకు తెలియబరచుచు, ప్రభుత్వము తరఫున ఒకప్రతినిధిగా వ్యవహరించుచుండును.

౩. కేంద్ర, స్థానిక ప్రభుత్వములకు గల సంబంధము.

సాధారణముగా స్థానికప్రభుత్వములు కేంద్రప్రభుత్వముయొక్క ఉన్నతాధికారములకు లోబడి వ్యవహరించవలసియున్నవి. కొన్ని రాజ్యములయందు స్థానికప్రభుత్వములను కేంద్రప్రభుత్వ మొకశాసనముచే సృష్టించి నెలకొల్పుచున్నది. అట్టిచోట స్థానికప్రభుత్వముయొక్క యధికారార్హతలు కేంద్రప్రభుత్వముచే ప్రసాదింపబడుచున్నవి. అట్టి యధికారార్హతలను సవరించుటకు గాని, రద్దుచేయుటకు గాని కేంద్రప్రభుత్వమున కధికారము న్నది. కాని, స్థానికప్రభుత్వముల యధికారార్హతలు రాజ్యాంగచట్టమునందే నిర్వచింపబడి యున్నపుడు, సదరు రాజ్యాంగచట్టమును సవరించగల అధికారికి మాత్రమే స్థానికప్రభుత్వములు లోబడుచున్నవి. అమెరికాసంయుక్త

రాష్ట్రములవంటి రాజ్యములలో, స్థానికప్రభుత్వముల యధి కారార్హతలు రాజ్యాంగచట్టమునందు స్పష్టీకరింపబడి యున్నవి. సదరు రాజ్యాంగచట్టమును సవరించుటకు అమెరికా కేంద్రప్రభుత్వమునకు అధికారము లేదు. కావున, అచ్చట స్థానికప్రభుత్వములను, కేంద్రప్రభుత్వము రద్దు చేయజాలదు, సవరింపజాలదు. స్థానికప్రభుత్వములు తమ యర్హతకు మించి ప్రవర్తించిన యెడల అందుకు తగిన పరిహారమును న్యాయస్థానముద్వారా పొందవలసియున్నది. అంతేగాని, కేంద్రప్రభుత్వమునకు స్థానికపరిపాలనావిషయమున పైవిచారణాధికారము లేమియు లేవు. స్థానికస్వపరిపాలన ఉన్నచోట, సాధారణముగా, కేంద్రప్రభుత్వమున కొకవిధమగు పైపర్యాలోచన మక్క నిజముగు యధికారబాధ్యత లుండజాలవు. స్థానికపరిపాలన కేంద్రప్రభుత్వము నియమించిన యుద్యోగులచే నిర్వహింపబడుచున్న చోట, కేంద్రప్రభుత్వమునకు సర్వాధికార ముండును.

---

# ౯
# నియోజకవర్గము

## ౧. వోటింగు పద్ధతి.

ఎన్నికదారు లనగా, తమతరఫున పనిచేయుటకు ప్రతినిధుల నెన్నుకొనుటకు హక్కు గలవారు. వీరినే సమష్టిగా నియోజకవర్గ మని కూడ అందురు. ప్రతినిధుల నెన్నుకొను హక్కే నేటి వ్యవహారికభాషలో వోటింగు హక్కని పిలువబడుచున్నది. నేటి ప్రజాప్రభుత్వములలో

ఎన్నికయనునది మొట్టమొదటి కాండమే యగుచున్నది. ఎన్నికసూత్రము మాత్రము మానవసంఘమున మొదటి నుండియు గలదనియే చెప్పవచ్చును. తొల్లిటి సంఘముల యందు అధికసంఖ్యాకుల విశ్వాసమును గలిగియున్న వారలే నాయకు లగుచుండిరని వెనుక ఒకప్రకరణమున తెలిసికొనియుంటిమి. హిందూదేశమున పూర్వ మొక ప్పుడు విలసిల్లిన గ్రామపంచాయతీ లించుమించుగా నీసూ త్రముమీదనే యాధారపడియుండెడివి. ఐతే, ఆరోజులలో నేటి వోటింగుపద్ధతి లేకపోవచ్చును. అదియును కొన్ని పంచాయతీలం దున్నట్లు తెలియవచ్చుచున్నది. మొత్తము మీద, గ్రామపంచాయతీసభ్యులు గ్రామస్థులలో నధిక సంఖ్యాకుల విశ్వాసమును గలిగియున్నవారని చెప్పుటకు వెనుకాడవలసిన పనిలేదు. ఇంగ్లాండుదేశమున ప్రతినిధుల నెన్నుకొనెడి యాచారము ఆంగ్లోస్యాగ్జనుల కాలము నుండియు గలదు. ఇతరదేశములందు ఈయెన్నికవిధాన మట్లే అడుగంటి యుండగా, ఇంగ్లాండుదేశమున మాత్ర మది యానాటికానాటికి అభివృద్ధియై నేటి పార్లమెంటరీ పరిపాలనగా పరిణమించెను.

మొట్టమొదట, ఇంగ్లాండుదేశమున నీయెన్నిక హక్కు భూస్వాములకు మాత్రమే యుండెడిది. దరి మిలా, కౌలుదారులకు, ప్రభుత్వమునకు పన్ను చెల్లిం చువారికిని ఈహక్కు ప్రసాదింపబడెను. ఇట్లే, అంత కంతకు ఎన్నికదారులసంఖ్య యెక్కువ అగుచు వచ్చి నప్పటికిని, మొత్తముమీద ఆస్తిగలవారికే వోటింగు హక్కనుసూత్రము మాత్ర మట్లే యుండెను. ౧౮ దవ

శతాబ్దిని జరిగిన ఫ్రెంచి, అమెరికన్ తిరుగుబాటుల వలన ఈసూత్రమునకు గొప్పదెబ్బ తగిలెను. ఈతిరుగుబాటులలో ఆస్తిగలవారికే వోటింగుహక్కనుసిద్ధాంతము పోయి, సర్వజనులకు వోటింగుహక్కుగల దనుసిద్ధాంతము తలయెత్తెను. అప్పుడు బయలుదేరిన ప్రజాప్రభుత్వసూత్రముల కనుగుణముగా పౌరు లందరు ప్రభుత్వమున భాగస్వాములే యను వాదనకు మిక్కిలి బలముచేకూరెను.

౨౧ సంవత్సరముల వయస్సుగల పురుషు లందరికిని వోటింగుహక్కు నిచ్చు శాసనము ఫ్రాన్సుదేశమున ౧౮౭౮ సంవత్సరమున వచ్చెను. జర్మనీదేశమున ౨౫ సంవత్సరముల వయస్సు గల పురుషు లందరికిని వోటింగుహక్కు గలదని ఆదేశముయొక్క రాజ్యాంగచట్టమున నిర్వచింపబడెను. ఇంగ్లాండుదేశమున నీవిషయమున ననేకశాసనము లుండి మిక్కిలి చిక్కుగా నుండెడిది. ఐరోపామహాసంగ్రామమువరకు పరిస్థితి ఇట్లే యుండెను. కాని, యుద్ధానంతరము ౨౧ సంవత్సరముల వయస్సుగల పౌరు లందరిని యెన్నికదారులుగా నిర్ణయించు శాసనము గావింపబడెను. నేను ప్రజాప్రభుత్వములుగల దేశము లన్నిటియందును యుక్తవయస్కు లందరికిని నియోజకవర్గమున జేరుట కర్హతగలదు.

స్త్రీల వోటింగుహక్కు విషయమున ఈశతాబ్ది యొక్క ప్రారంభమున గొప్పయుద్యమము బయలుదేరెను. నిజమునకు, స్త్రీలహక్కులను గూర్చిన ఆందోళన ౧౯వ శతాబ్ది మధ్యనే ప్రారంభింపబడెను. ఐరోపాసంగ్రామమున స్త్రీలు చేసిన ఘనకార్యములను గుర్తించి, అది

వరకు వ్యతిరేకస్వభావులగువారు కూడ వారికి వోటింగు హక్కు నిచ్చుటకు సమ్మతించిరి. ఈవిషయమున ఇంగ్లండు అమెరికా దేశములు ముందంజవేసెను. ఇప్పుడు బ్రిటిష్ సామ్రాజ్యమున అధినివేశ దేశము లందును, హిందూ దేశము నందును స్త్రీలక్కు వోటింగుహక్కు ఉన్నది.

౨. అల్పసంఖ్యాకులు : యెన్నికపద్ధతులు.

ప్రజాపరిపాలన అనగా అధికసంఖ్యాకుల పరిపాలన యైనప్పటికిని, ప్రభుత్వమున ప్రజలప్రాతినిధ్యము సాధ్య మైనంత సంపూర్ణముగా నుండవలెనని అందరును అంగీకరించిన విషయమే. సంఘమునగల అన్నిజాతులకును, అన్నితరగతులకును, అన్నికక్షులకును సాధ్యమైనంతవరకు తగినంత ప్రాతినిధ్య మిచ్చుట్క కనేకపద్ధతులు అవలంబింప బడుచున్నవి. కొన్నిటి నిం దుదాహరించెదము.

సంఘమున అల్పసంఖ్యాకు లనేకవిధములుగా నున్నారు. ముందు జాతి, మతము మొదలైనవానినిబట్టి కొంద రల్పసంఖ్యాకు లగు చున్నారు. ఉదాహరణముగా, హిందూదేశమున హిందువులు ౨౫ కోట్లున్నారు, మహ మ్మదీయులు, సిక్కులు, క్రిష్టియనులు కలసి ౧౧ కోట్లు మాత్రమే గలరు. కావున, మనదేశమున హిందువులు అధికసంఖ్యాకులు, తక్కినజాతులు అల్పసంఖ్యాకులు అగు చున్నారు. ఈఅల్పసంఖ్యాకజాతులకు శాసనసభయందు వారిసంఖ్యనుబట్టి కొన్నిస్థానములు ప్రత్యేకింపబడుచున్నవి. (రిజర్వుడుసీట్సు.) అట్లొకజాతికి ప్రత్యేకింపబడిన స్థానము లకు ఆప్రత్యేకజాతివారికి మినహా ఇతరులు యెన్నికలందు పోటీచేయుటకు వీలులేదు. ఈవిధముగా అల్పసంఖ్యాక

జాతులకు శాసనసభయందు ప్రాతినిధ్య మేర్పడుచున్నది. ఈయెన్నికలసందర్భమున రెండుపద్ధతులు గలవు. అందు మొదటిది, ప్రత్యేకనియోజకవర్గపద్ధతి. రెండవది, సమష్టి నియోజకవర్గపద్ధతి. ప్రత్యేకనియోజకవర్గపద్ధతియందు ఆస్థానములకు అభ్యర్థులుగా నిలిచెడివారే గాక, నియోజకవర్గమున కూడ ఆప్రత్యేకజాతివారే వోటర్లుగా నుందురు. సమష్టినియోజకవర్గమైన యెడల, ఆస్థానములకు ఇతరులు అభ్యర్థులుగా నుండుటకు వీలు లేనప్పటికిని, నియోజకవర్గమున మాత్ర మిట్టి జాతిమతభేదము లుండవు.

తరువాత, సంఘమున భూస్వాములు, వర్తకులు మొదలగు తరగతులవారుకూడ సాధారణముగా నల్పసంఖ్యాకులై యుందురు. వీరల ప్రాతినిధ్యవిషయమున గూడ ప్రతితరగతికి కొన్నిస్థానములు ప్రత్యేకింపబడుచున్నవి. ఒక తరగతికి ప్రత్యేకింపబడిన స్థానములకు సంబంధించిన వోటర్ల జాబితాలో, ఆతరగతికి చెందినవారికి మినహా ఇతరు లుండుటకు వీలు లేదు గాని, ఎన్నికలో ఆతరగతికి చెందని వారు కూడ అభ్యర్థులుగా నిలువవచ్చును.

ఈ పై పద్ధతులతో సంఘమునకు సంపూర్ణ ప్రాతినిధ్యము చేకూరునని చెప్పుటకు వీలులేదు. ఏలననగా, ఎన్నికయందు దపజయము గాంచిన అభ్యర్థులకు వోటుల నిచ్చిన వారందరు శాసనసభయందు తమప్రతినిధులు లేనివారే యగుచున్నారు. వీరినే అల్పసంఖ్యాకకక్షయని, లేక, బహూకక్షులకు చెందియున్న అల్పసంఖ్యాకకక్షులని యందురు. వీరి ప్రాతినిధ్యముకొరకు పలువిధములగు మార

ము లవలంబింపబడుచున్నవి.

(౧) దేశమునందన్ని ప్రాంతముల నివసించువారికి ప్రాతినిధ్య మేర్పడుటకు దేశమును జిల్లాలుగా విభజించి ప్రతిజిల్లాకును ఇంతమంది సభ్యులని నిర్ణయించుచున్నారు. దీనిచే ప్రతిజిల్లావాసులును తమప్రతినిధులను పంపగలుగుచున్నారు.

(౨) సభ్యులను జిల్లాలువారీగా పంచినప్పటికిని ప్రాతినిధ్యము లేనివా రింకను మిగులుచున్నారు. జిల్లాయందు పోటీజేసి ఓడిపోయినవారికి వోట్లనిచ్చినవా రందరు నిట్టివారే. అదియును గాక, గెలుపొందిన యొక సభ్యున కవసరమగు వోట్లకంటె చాల యెక్కువసంఖ్య పడవచ్చును. అట్టిచో, ఆహెచ్చు వోట్లన్నియు కేవలము వృథాయగుచున్నవి. తక్కువవోట్లచే, ఒకపార్టీ యెక్కువస్థానముల సంపాదింపవచ్చును. ఈవిషయము నుదాహరణపూర్వముగా జూచిన బాగుగా బోధపడగలదు. ఒక జిల్లాయందు అతివాదులు, మితవాదులు అను రెండు పార్టీలవారు నాలుగుస్థానములకు పోటీచేయుచున్నా రనుకొనుడు. అనగా, అతివాదులు నలుగురు, వారికి పోటీగా మితవాదులు నలుగురు, నాలుగుస్థానములకు నిలిచియున్నారు. ఎన్నికలో వారల కీదిగువరీతిగా వోట్లువచ్చినవి:-

| | | అతివాదికి. | మితవాదికి. |
|---|---|---|---|
| ఒకటవస్థానము | = | ౫౦౦౦ | ౨౦౦౦౦ |
| రెండవస్థానము | = | ౫౫౦౦ | ౫౦౦౦ |
| మూడవస్థానము | = | ౬౦౦౦ | ౫౫౦౦ |
| నాల్గవ స్థానము | = | ౪౫౦౦ | ౩౫౦౦ |
| | | ౨౧౦౦౦ | ౩౪౦౦౦ |

ఈ పై సంఖ్యలను బట్టి, ముగ్గు రతివాదులును, ఒక్క మితవాదియు గెలుపొందుచున్నారు. ౨౧ వేల వోట్లతో అతివాదులు మూడుస్థానములను సంపాదించగా ౩౭ వేల వోట్లతో మితవాదులు ఒకస్థానమును మాత్రమే పొందగలుగుచున్నారు. అనగా, ౩౭ వేల వోటర్లు ఒక ప్రతినిధిని, ౨౧ వేల వోటర్లు ముగ్గురు ప్రతినిధులను పంపగలుగుచున్నారు. దీనిని బట్టి చూచిన, మొదటిస్థానమునకు గెలుపొందిన మితవాదసభ్యునకు ౫౦౦౧ వోటు వచ్చియున్న చాలియుండెడిది. అంతకు పైగా వచ్చిన వోట్లన్నియు కేవలము నిష్ప్రయోజనమేగదా! అదియునుగాక, ఈ పై నాలుగుస్థానముల ఎన్నికలో ఓడిపోయిన సభ్యులకు వోట్లనిచ్చిన ౧౭౦౦౦ మందికిని ఒక్కప్రతినిధియు లేడు. ఇట్టివే అనేకములగు అన్యాయములను జూపవచ్చును. ఈవిషయమున సరియైన ప్రాతినిధ్య ముండుటకు అనేక పద్ధతుల నవలంబించుచున్నారు. అందు ముఖ్యమైనవి (అ) వోటర్లసంఖ్యను స్థానములసంఖ్యచే భాగించగా వచ్చిన సంఖ్య యెంతో అన్నివోట్లను సంపాదించుకొనిన ప్రతియభ్యర్థియు నెన్నుకొనబడును. అవసరమగు ఆవోట్లను అభ్యర్థి దేశమునం దెచ్చట నైనను సంపాదించుకొనవచ్చును. దీనిచే అల్పసంఖ్యాకులు దేశమునం దెక్కడనున్నను తమప్రతినిధిని పంపగలరు. (ఆ) ఒకజిల్లానుండి బహుప్రతినిధుల నెన్నుకొనవలసి యున్నపుడు, ప్రతివోటరునకు ఎన్నిస్థానము లున్నవో అన్ని వోట్లుండుటకు బదులుగా, అంతకు తక్కువ వోట్లుండు పద్ధతి మరియొకటి గలదు. ౧౦ స్థానములు గల జిల్లాలో వోటరునకు

౭ వోట్లే గల వనుకొనుడు. అప్పు డధికసంఖ్యగల పార్టీ ౭ గురు ప్రతినిధులకంటె ఎక్కువ ఎన్నుకొనజాలదు. తక్కిన మూడుస్థానములు అల్పసంఖ్యాకుల వశము కాగలవు. (ఇ) ఈమూడవపద్ధతియందు ప్రతివోటరునకు నెన్ని స్థానము లుండునో యన్ని వోట్లుండును. ప్రతివోటరు అభ్యర్థి కొక్కొక్కవోటుచొప్పున నీయవచ్చును. లేక తనవోట్లన్నిటిని ఒకసభ్యునకే ఈయవచ్చును. "ఈపద్ధతిచే అల్పసంఖ్యాకులు తమవోట్లన్నిటిని ఒక్కనికే యిచ్చి తప్పక ప్రాతినిధ్యమును పొందవచ్చును. (ఈ) మరియొక పద్ధతి కూడ గలదు. వోటర్లసంఖ్యను స్థానములసంఖ్యచే భాగించిన యెడల, ఒక్కొక్కస్థానమున కెన్నివోట్లు అవసరమో తేలును. ప్రతివోటరు అభ్యర్థులకు వోటుజేయుటలో తనమొదటివోటు ఫలానావారి కని, రెండవవోటు ఫలానావారి కని, మూడవవోటు ఫలానావారి కని, యిట్లే తన కెన్నివోట్లున్నవో అన్నివోట్లను క్రమముగా నిరూపించును. వోట్లను లెక్కపెట్టుటలో పైన తెల్పిన లెక్కను బట్టి యవసరమైనన్ని మొదటివోట్లను సంపాదించిన వారందరు వెంటనే గెలుపొందెదరు. అట్లు గెలుపొందిన ప్రతియభ్యర్థికి, వాని కవసరమగు సంఖ్యకు పైగా వచ్చిన మొదటివోట్లను, ఆతనికి రెండవవారుగా వచ్చిన అభ్యర్థులకు క్రమానుగతముగా పంచిపెట్టబడును. ఈవిధముగా కలిపిన అదనపువోట్లతో అవసరమగు మొదటివోట్లను పొందిన వారందరు గెలుపొందెదరు." ఇట్లే చివరవరకు గుణింపబడును.

# రాజకీయశాస్త్రము

(మూడవ భాగము)

## పరిపాలనావిధానము

౧

## వ్యక్తిస్వాతంత్ర్యవాదము

రాజ్యముయొక్క పరమావధియగు సంఘసౌభాగ్య మెట్లు చేకూరును? దానికి మార్గ మెద్ది? సంఘసౌభాగ్య మబ్బవలెనన్న పరిపాలనావిధాన మెట్లుండవలయును? ఈసందర్భమున రాజకీయశాస్త్రజ్ఞులలో తీవ్రమగు భేదాభిప్రాయములు గలవు. ఈభేదాభిప్రాయముల ననుసరించి రెండు బలవత్తరసిద్ధాంతములు బయలుదేరెను. అవి వ్యక్తిస్వాతంత్ర్యవాద మనియు, సామ్యవాద మనియు వ్యవహరింపబడుచున్నవి.

నేడు, ప్రపంచమున నొక్కరష్యాదేశమున దక్క, మిగిలినరాజ్యము లన్నిటియందును పరిపాలనావిధానము ముఖ్యముగా వ్యక్తిస్వాతంత్ర్యసిద్ధాంతముపై నాధారపడి యున్నది. ఒకప్పుడు, ప్రజాప్రభుత్వము లేర్పడుటతో

సంఘమునకు సర్వసౌభాగ్యములు చేకూరుననియే తలంప బడెను. కాని, యాశయములకు ననుభవములకు చాల దూరము. ప్రజాప్రభుత్వమున వ్యక్తు లందరికి వోటింగు హక్కు లభించవచ్చును. అంతమాత్రమున ప్రజలకు కష్టములు గడిచి గట్టెక్కినట్లు కాదు. వోటింగుహక్కుతో వారికి కడుపు నిండదు. కడుపు నిండవలెనన్న అన్నము గావలయును. కడుపు నిండినమీదట వోటింగులు, యెన్నికలు గాని, ఆకలి తీరనివానికి ప్రజాప్రభుత్వమైన నేమి, నిరంకుశప్రభుత్వమైన నేమి? వ్యక్తికి భుక్తికిమించిన సమస్య మరియొకటి యుండబోదు. కావున, సంఘసౌభాగ్యమున కీయార్థికసమస్య మొదటిమెట్టే యగుచున్నది. ఈసమస్యను సంతృప్తికరముగా పరిష్కరింపక ఏరాజ్యమును తనగమ్యస్థానమును చేరజాలదు.

ఈసమస్యపై నే, పైన ఉదాహరించిన పరస్పర విరుద్ధములగు సిద్ధాంతములు తలయెత్తెను. అందు మొదటిదగు వ్యక్తిస్వాతంత్ర్యసిద్ధాంతముయొక్క సారాంశ మెట్టిదనిన :—స్వవిషయములందు వ్యక్తికి సంపూర్ణ స్వాతంత్ర్య ముండవలయును. పరదేశములదాడినుండి సంఘమును కాపాడుట, సంఘమున నేరము చేసినవారిని శిక్షించుట ఈరెండువిషయములకు మినహా ప్రభుత్వ మితరజోక్యములను కల్పించుకొనగూడదు.

ఈసిద్ధాంతమును సమర్థించువారు మూడుతరగతులుగా నున్నారు. మొదటితరగతివారు దీనిని కొన్ని యార్థిక సూత్రములపై సమర్థించుచున్నారు. ఆర్థికవిషయములను స్వేచ్ఛగా వ్యక్తికి వదలిపెట్టినయెడల, దేశమున పరిశ్ర

ములు, వ్యాపారము వృద్ధియై సంఘము భాగ్యవంతమైన దగునని వీరివాదన. ఎవని కిష్టమైనవృత్తి వాడవలంబించుట చేతను, ఎవని శక్తిసామర్థ్యములు వాడు పూర్తిగా వినియోగించుటచేతను, ఎవని స్వలాభముకొరకు వాడు పాటుపడుటచేతను దేశమున ఉత్పత్తికాగల సరకు లన్నియు మిక్కిలిగా తయారగును. అట్టిసరకుల కెక్కడ గిరాకిగా నుండునో అక్కడికి స్వేచ్ఛగా నెగుమతిచేసి పూర్తిలాభములను పొందెదరు. ఇక్కడ అవసరమగు వస్తువులను చౌకగా దొరకుదేశమునుండి దిగుమతి చేసికొనెదరు. పెట్టుబడిదారులు తమధనము నెచ్చట నేపరిశ్రమయందు పెట్టుబడిపెట్టిన తమకు గొప్పలాభములు చేకూరునో అట్లు చేయుచుందురు. కార్మికులు తమకాయకష్టమున కెక్కడ హెచ్చు వేతనములు లభించునో అక్కడకు చేరుచుందురు. వ్యాపారస్థులు ఆయాధరల పరిస్థితులను బట్టి సరకుల నెగుమతి దిగుమతులను జేయుచు ధనము నెక్కువగా గడించుచుందురు. వస్తువులధరలు, వానియవసరమును బట్టియు, లభ్యపడుటను బట్టియు హెచ్చుచు, తగ్గుచు నుండును. ఇవి రెండును సమానమయినపుడు ధరలకు నిలకడ యేర్పడును. ఈవిధముగా సంఘమునకు స్వేచ్ఛయు, స్వేచ్ఛతో సకలసంపదలును చేకూరును. అడ్డులేని వ్యాపారము హద్దులేని సంపదలనిచ్చును. ఎగుమతి దిగుమతులపై సుంకములు వేయుట, పెట్టుబడిదారులయొక్కయు, కార్మికులయొక్కయు స్వేచ్ఛావిహారముల కాటంకముల గల్పించు శాసనముల జేయుట మొదలగు నిరోధముల ప్రభుత్వ మెప్పుడును చేయరాదు. ౧౭౭౦ సంవత్సరము దరిమిలా

ప్రపంచమునం దేర్పడిన విపరీతార్థికపరిస్థితు లీవాదనకు మరింతబలము చేకూర్చెను. ౧౭౫౦-౧౮౫౦ సంవత్సరములమధ్య క్రొత్తగా ఏర్పడిన యంత్రసామగ్రియు ఆయంత్రముల నడుపుటకు నీటియావిరిబలము నుపయోగించుటయు మొదలగు నూతనపరిస్థితులతో పురాతనగృహపరిశ్రమలు పోయి, హానిస్థానే ఫ్యాక్టరీపద్ధతు లమలులోనికి వచ్చెను. వీనికితోడు, రహదారులు, రైలుమార్గములు, కాలువలు, స్టీమరులు మొదలైన రాకపోకలసౌకర్యములు మిక్కిలిగా నేర్పడెను. సరకులయుత్పత్తి విపరీతముగా పెరిగిపోయెను. సరకుల నొకదేశమునుండి మరియొకదేశమునకు రవానాచేయుట సులభమాయెను. ఇట్టి పరిస్థితులలో వ్యక్తుల స్వేచ్ఛకు ప్రభుత్వము నిరోధముల గల్పించుటకంటె అవివేక మింకొకటి యుండబోదని వాదింపబడెను. ఈవాదన ఇంగ్లాండు, అమెరికా దేశములందు మిక్కిలిగా వ్యాపించి, అంతకుపూర్వ మమలునందున్న కొన్ని నిరోధకశాసనముల నెత్తివేయుటకు కారణమాయెను.

రెండవతరగతివారు వ్యక్తిస్వాతంత్ర్యమును మరియొకవిధముగా సమర్థించుచున్నారు. ధర్మసూత్రముల ప్రకారము ప్రతివ్యక్తియు తనవిషయములు తాను చక్క బెట్టుకొనుటకు హక్కు గలిగియున్నాడు. ఇట్టి వ్యక్తి హక్కుల కాపాడుటకే రాజ్య మేర్పడినది. వ్యక్తులలో నొకరి హక్కుల మరియొకరు నష్టపరచకుండునట్లు జూచుటయే ప్రభుత్వముయొక్క విధి. అట్లు పోషింపవలసిన హక్కులకు తానే నిరోధము గల్పించుట ప్రభుత్వమునకు

కూడని పనియే యగుచున్నది. వ్యక్తుల మంచికొరకు కూడ, ప్రభుత్వము వారలస్వవిషయములలో జోక్యము పుచ్చుకొనకూడదు. ఆతని స్వవిషయములలో ఆతని కడ్డు రాకుండుటయే ప్రభుత్వము వ్యక్తికి చేయగలిగిన మేళ్ళన్నిటికంటె గొప్పమేలు.

మూడవతరగతివారు, బలవంతుడే బ్రతుక నర్హుడను సూత్రముపై వ్యక్తిస్వాతంత్ర్యమును సమర్థించుచున్నారు. ఈసిద్ధాంతులలో పేరెన్నికగన్న యాతడు హెర్బర్టుస్పెన్సరు పండితుడు. ఈతనిదృష్టిలో నసమర్థులకీప్రపంచమున తావులేదు. బలహీనునికి బలమును గాని, తెలివితక్కువవానికి తెలివిని గాని, బీదవానికి భోజనమును గాని ప్రభుత్వ మీయజాలదు. ప్రజ లెవరి హద్దులలో వా రుండునట్లు జూచుటయే ప్రభుత్వముయొక్క విధి. అంతేగాని, ప్రజల కేదో త్రవ్వి తలకెత్తవలె నని ప్రభుత్వము లేనిపోని బాధ్యతను తన నెత్తిపైకి దెచ్చుకొనగూడదు. ఎవరికి వారే గాని, యొకరికి మరియొక రెప్పుడును గారు. శక్తిసామర్థ్యము లున్న, తెలివితేట లున్న బ్రతుకుదురు, లేకున్న నశించు మని ఈవాదన సారాంశము.

ఈమూడుతరగతుల సిద్ధాంతుల వాదముల నించుక విమర్శించెదము. మొత్తముమీద, వ్యక్తికి తగినంత స్వేచ్ఛ యుండవలె ననుటలో నందరు ఏకీభవించవలసిన విషయమే. మతము, వృత్తి, నివాసము, పెండ్లి, భావముల వెల్లడించుట మొదలుగాగల విషయములలో ప్రభుత్వపుజోక్యము భరింప శక్యముగానిది. ఇవియే ప్రధానమగు హక్కులనుపేర బరగుచున్నవి. ఏదేశమున ప్రభుత్వ

మీఁ ప్రధానమగు హక్కులతో జోక్యమును కలిగించు కొనెనో అక్కడ ప్రజలలో విప్లవము బయలుదేరి ప్రభుత్వమును తలక్రిందుజేసెను. దీనిని బట్టి మనము గ్రహించవలసిన దేమనగా, నిట్టివిషయములలో ప్రభుత్వపు జోక్యము నేవ్యక్తియు భరింపజాలదని.

ఐతే, వ్యక్తిస్వాతంత్ర్యమునకు, ప్రభుత్వతాటస్థ్యమునకు నొకమేర గలదు. వ్యక్తిస్వాతంత్ర్యవాదులు తలంచునటుల సంఘమును విరోధులబారినుండి రక్షించుట, వ్యక్తులలో నొకరిహక్కుల మరియొకరు నష్టపరచకుండునట్లు జూచుట మాత్రమే ప్రభుత్వవిధులు గావు. ప్రభుత్వమునకు సంఘసౌభాగ్యము ప్రధానము. పైన తెలిపిన రెండువిధులను నెరవేర్చుచున్నంతమాత్రమున సంఘసౌభాగ్యమును చేకూర్చినట్లు గాదు. సంఘమునకు శాంతి, సఖ్యత, సంపద, సంతృప్తి మొదలైన యవసరము లెన్నియో గలవు. ఇందు వ్యక్తిగతముగా సాధించనలవిగాని కార్యము లనేకములు గలవు. సంఘసౌభాగ్యమున కవసరమైనట్టియు, వ్యక్తి సాధించ లేనట్టియు కార్యములను ప్రభుత్వమే నిర్వహించవలెను. లేనియెడల, సంఘమధోగతిపా లగును. ఇందులకు తార్కాణముగా, నేటి యనాథశరణాలయములను, వైద్యశాలలను (ఆసుపత్రులు) జూపవచ్చును. బీదలలో ననేకులు తమబిడ్డల పోషింపలేక వారిని యనాథశరణాలయములకు ఒప్పజెప్పుటను మనము గమనించుచున్నాము. ఇట్టి యనాథులసంఖ్య నానాటికి పెరిగిపోవుచున్న దని కూడ నెల్లరకు దెలిసిన విషయమే. వీరల నొకవ్యక్తి పోషింపగలడా? పోషించ

గలిగినను పోషించునా? ఇవి రెండును ఒట్టిమాటలే. అట్లైన, నిశిశువుల ప్రభుత్వము పోషించుటయా, లేక మృత్యుప్రవాత బెట్టుటయా? వీరి సంరక్షణ యత్యంతావసర మని మానవహృదయమునకు తోచకపోదు. విద్యావిషయము గూడ నిట్టిదే. పౌరుల విద్యావంతులజేయు బాధ్యత ప్రభుత్వము వహించకున్న, సంఘమున విజ్ఞానము నశించును; మూఢత్వము పెచ్చుపెరుగును. ఎవరి విద్యను వారికే వదలిపెట్టినయెడల సంఘమున విద్యలేకుండ బోవుట కెంతకాలమో పట్టదు. ఇందుకు కారణము లనేకములు:—(౧) బీదతనము (౨) తగినసౌకర్యములు లేకపోవుట (3) విద్యాలయములు సరిగా పనిచేయకపోవుట (౪) మూఢత్వము (౫) అశ్రద్ధ మొదలైనవి. హిందూదేశమువంటి విద్యలేని బీదదేశములందు విద్యాబాధ్యత ప్రభుత్వముపై మరింత ఎక్కుడుగా నుండును. అజ్ఞానమే పెక్కునేరములకు, దుర్మార్గములకు కారణ మగుచున్నది. తప్పిదముల చేసిరని యజ్ఞానుల శిక్షించుటకంటె, వారి తప్పిదములకు కారణమగు మూఢత్వమును తొలగించు విద్యాశిక్షణ ముందేయిచ్చుట ఉత్తమప్రభుత్వలక్షణము గాకపోదు. నేటి నాగరికతా ప్రభుత్వము లన్నియు, నిర్బంధవిద్యావిధానముచే సంఘమును జ్ఞానవంతముగా జేయుచున్నవి. ఆరోగ్యవిషయము కూడ ప్రభుత్వము వహించవలసిన ముఖ్యబాధ్యతలలో నొకటి. ఆరోగ్యమునకు భిన్నమగు పద్ధతుల నిషేధించుట, రోగులకు తగిన వైద్యసహాయము చేయుటకు చికిత్సాలయముల (ఆసుపత్రులు) నందుబాటులో నిర్మించుట మొదలైన కార్య

ములను ప్రభుత్వము నిర్వహింపవలెను గాని, వ్యక్తులకు
పదలిపెట్టవలసిన విషయములు గావు.

వ్యక్తుల ఆర్థికవ్యవహారములందు కూడ ప్రభు
త్వము కేవలము చేతులు గట్టుకొని కూర్చుండుటకు వీలు
లేదని గట్టిగా ఋజువయ్యినవిషయమే. వ్యక్తిస్వాతంత్ర్యవి
ధానమునకు ప్రోత్సాహకర్తలగు రికార్డో, మాల్థూస్
మొదలగు వారభిప్రాయపడినట్లు జరుగక ఈపద్ధతి కేవల
మందులకు విపరీతపరిస్థితుల గల్పించెనని చెప్పవలయును.
నేడు మనకండ్లయెదుట జరుగుచున్న కార్మికోద్యమములు,
తిరుగుబాటులు, సమ్మెకట్టులు, సంఘర్షణలు మొదలగున
వన్నియు ప్రభుత్వతటస్థవిధానఫలితములే. ఫ్యాక్టరీపద్ధతు
లచే పూర్వపు గృహపరిశ్రమ లన్నియు పూర్తిగా నశించి
నవి. ఫ్యాక్టరీలలో పనిచేయు కార్మికులస్థితి అయినను
లెస్సయై ఉండలేదు. పెట్టుబడిదారులు మాత్రము పెద్ద
పెద్దలాభములను గడించుచుండిరి. వ్యక్తిస్వాతంత్ర్యముచే
నీవిధముగా నొకప్రక్క పొట్టజరుగక పలుకష్టములబడు
బీదజనుల తండోపతండములును, మరియొకప్రక్క సర్వ
సంపదలతో తులతూగు కొద్దిమంది పెట్టుబడిదారులును,
మధ్య తటస్థముగానుండి చూచుచున్న ప్రభుత్వములును
ఏర్పడెను. ఈపరిస్థితియే నేటి యశాంతికి కారణము. ఐతే,
నేటి ప్రభుత్వము లీపరిస్థితులను చూచుచు నూరకుండ లేదు.
తమతటస్థపీఠములనుండి దిగివచ్చి జోక్యము కలిగించు
కొనకతప్పినదికాదు. కార్మికోద్యమములచే, పెట్టుబడిదా
రుల సంగతి యటుంచి, ప్రభుత్వముల కుంకటివ్రేళ్లే గదలు
చున్నవి. ఈపరిస్థితి అనేకకార్మికచట్టము లమలులోనికి

వచ్చుటకు కారణమాయెను. ఆరోగ్యసూత్రముల ననుస రించి యిన్నిగంటలకంటె ఎక్కువకాలము పనిచేయ గూడ దనియు; కార్మికుల కీయావసతు లుండవలె ననియు; ఫ్యాక్టరీప్రమాదములచే భంగపడిన పనివాండ్రకు తగిన పరిహారముల నీయవలయు ననియు; కార్మికులవేతనము లింతకంటె తక్కువగా నుండగూడ దనియు కొన్నిచట్టము లు తయారుచేయబడెను. సంఘములుగా నేర్పడుటకును, తగినకారణము లున్న సమ్మెకట్టులు చేయుటకును, కార్మి కులకు హక్కుగలదని యన్నిప్రభుత్వములును అంగీకరిం చుచున్నవి. ప్రభుత్వపు తటస్థవిధానము రష్యాదేశమున బోల్షివిక్ విప్లవమునకు కారణమై, తుదకు సామ్యవాద ప్రభుత్వస్థాపనతో నంతమొందెను.

ఈయార్థికసమస్య నేటి కార్మికచట్టములతో పరి ష్కరింపబడినట్లుగా నెంచుటకు వీలులేదు. ౧౯౩౬-౩౭ సంవత్సరములలో ప్రపంచమున జరిగిన కార్మికుల సమ్మె కట్టులనుగూర్చి నానాజాతిసమితి లేబరు ఆఫీసు ఈక్రింది జాబితాను ప్రచురించుచున్నది:

| | సమ్మెకట్టుల సంఖ్య. | కార్మికుల సంఖ్య. | నష్టపడినపని రోజులసంఖ్య. |
|---|---|---|---|
| అమెరికా సంయుక్త రాష్ట్రములు: | ౨౧౭౨ | ౭౮౮౬౪౮ | ౧౩౯౦౧౯౫౬ |
| పోలెండు: | ౨౦౫౮ | ౬౬౪౫౯౩ | ౪౦౦౬౫౫౬ |
| బ్రిటన్: | ౮౦౮ | ౩౧౫౦౦౦ | ౧౮౩౦౦౦౦ |
| ఆస్ట్రియా: | ౩ | ౧౨౩ | ౨౬౯ |
| అర్జెంటైనా: | ౧౦౯ | ౮౫౪౩౮ | ౧౩౪౪౪౬౧ |
| ఆస్ట్రేలియా: | ౨౩౫ | ౬౦౫౮౬ | ౪౯౪౩౦౯ |

| | | | |
|---|---|---|---|
| కెనడా: | ౧౫౫ | ౩౪౮౧౨ | ౨౭౬౯౯౭ |
| చైనా: | ౧౨౮ | ౭౮౯౯౨ | ౬౬౬౯౩౧ |
| జెకోస్లోవేకియా: | ౨౬౩ | ౫౩౯౧౨ | ౬౦౩౬౧ |
| డెన్‌మార్కు: | ౧౨ | ౯౬౮౬౨ | ౨౯౪౬౦౦౦ |
| ఎస్టోనియా: | ౧౬ | ౨౫౩౯ | ౧౪౩౨౨ |
| ఫిన్‌లాండు: | ౨౯ | ౨౯౩౫ | ౩౫౩౬౦ |
| హంగేరీ: | ౧౨౨ | ౨౦౭౪౭ | ౨౩౨౬౨౨ |
| ఇండియా: | ౧౫౭ | ౧౬౯౬౨౯ | ౨౩౫౮౦౬౨ |
| ఐరిష్‌ఫ్రీస్టేటు: | ౧౦౭ | ౯౪౪౩ | ౧౮౫౬౨౩ |
| నెదర్‌లాండ్సు: | ౯౬ | ౧౦౪౨ | ౯౯౮౦౦ |
| న్యూజీలాండు: | ౪౩ | ౭౩౫౪ | ౧౬౯౮౦ |
| ప్యాలెస్టైయిన్: | ౨౦ | ౯౫౬ | ౧౧౬౨౫ |
| రుమానియా: | ౯౦ | ౧౫౨౩౧ | ౧౯౫౬౦౬ |
| స్విడ్జర్‌లాండు: | ౪౧ | ౩౬౧౨ | ౩౮౭౮౯ |
| యూనియన్ ఆఫ్ సౌత్ ఆఫ్రికా: | ౨౦ | ౨౯౮ | ౫౦౦౯ |

ఇంకను ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీ మొదలగు కొన్ని దేశముల సంగతి తెలియలేదు. దీనినిబట్టి ప్రపంచపరిస్థితి ఎట్లున్నదో బాగుగా బోధపడగలదు.

కావున, కేవల ప్రభుత్వపు తటస్థవిధానము, వ్యక్తి స్వాతంత్ర్యము సంఘమునకు లాభకరము గాదనియు; మీదుమిక్కిలి ప్రమాదస్థితి తెచ్చిపెట్టు ననియు గ్రహింపవలసియున్నది. కావుననే, నేడు ప్రతిదేశమునందునను ప్రభుత్వము వ్యక్తుల ఆర్థికవ్యవహారములకు సంబంధించిన శాసనముల చేయుటను మనము చూచుచున్నాము.

౨

# సామ్యవాదము

---

సామ్యవాదము వ్యక్తిస్వాతంత్ర్యవాదమునకు కేవలము ప్రతికూలము. ఇది సంఘము తనయార్థికవ్యవహారములందు సమష్టిసహకారపద్ధతి నవలంబింపవలయునని ప్రబోధించుచున్నది. ప్రతిదేశమునందునను కొద్దిగనో, గొప్పగనో సామ్యవాదోద్యమ మున్నప్పటికిని ఒక్కరష్యాదేశమున దక్క, మరెచ్చటను సామ్యవాదసూత్రములు సంపూర్ణముగా ఆచరణలోనికి గొనిరాబడలేదు. సామ్యవాదసూత్రములు జనసామాన్యమును పూర్తిగా నాకర్షించుచున్నవనుటలో సందేహములేదు. ఐరోపాయుద్ధానంతరము, యూరప్ఖండమున నియంతలు బయలుదేరి తమ దేశములలో విజృంభించుచున్న సామ్యవాదమును చాలవరకణచివేసిరి. ఇంతమాత్రమున సామ్యవాదము నశించినదనుటకు వీలులేదు. స్వాతంత్ర్యము, సమత్వము, సౌభ్రాతృత్వము ఇవియే సామ్యవాదముయొక్క ఆదర్శములు. ఈయాదర్శములను చెడ్డవనుట కెవ్వరి వశమును కాదు. అభిప్రాయభేదము లీయాదర్శముల జేరుటకు మన మవలంబింపవలసిన కార్యక్రమవిధానములకు సంబంధించినవి.

ఈ యదనున సామ్యవాదులు వ్యక్తిస్వాతంత్ర్యవాదము నెట్లు ఖండించుచున్నారో తెలిసికొనుట యవసరము. ఆధునికసామ్యవాదులకు మూలపురుషు డనదగు కారల్ మార్క్సు అను నతడు వ్యక్తిస్వాతంత్ర్య

వాదమును, ప్రస్తుత మాచరణలోనున్న పారిశ్రామిక పద్ధతిని ఖండించుచు నొక గ్రంథమును వ్రాసెను. దానిలో ఆతడు నేటి యార్థికవిధానము భాగ్యవంతుల దౌర్జన్యముపై నాధారపడియున్నదని వ్రాయుచున్నాడు. ప్రథమములో బలవంతులు దౌర్జన్యముగా బలహీనుల త్రోసిపుచ్చి, బ్రతుకుదెరువున కక్కరకు వచ్చు మార్గముల నన్నిటిని స్వాధీనపరచుకొని, తమయాస్తులుగా చేసికొనిరి. భుక్తిని ప్రసాదించు భూమియంతయు ఈవిధముగా బలవంతుల స్వాధీనమాయెను. అందుచే వారు భాగ్యవంతులైరి. సకలవస్తువులు నుత్పత్తిచెందుటకు స్థానభూతమగు భూమికి దూరులగుటచే బలహీనులకు వారికాయకష్టము తప్ప బ్రతుకుదెరువునకు వేరుమార్గము లేక పోయెను. వీరు తమకాయకష్టమును వచ్చినంతవరకే బలవంతుల కమ్ముకొని జీవించవలసిన యగత్యమేర్పడినది. ప్రభుత్వము భాగ్యవంతుల స్వాధీనమునం దుండుటచే, కార్మికులపరిస్థితి మరింత ఘోరముగా నుండెను. ఈవిధముగా సంఘము- భాగ్యవంతులనియు, బీదలనియు-రెండుగా చీలిపోయెను. ఈచీలిక ప్రభుత్వము లవలంబించిన వ్యక్తిస్వాతంత్ర్యవిధానముచే నంతకంతకు పెద్దదై క్లిష్టపరిస్థితుల గల్పించుచుండెను. భాగ్యవంతు లంతకంతకు నెక్కుడు భాగ్యవంతు లగుచుండిరి. బీదలు నట్లే నంతకంత కెక్కుడు బీద లగుచుండిరి. ఇట్లీరెండుతరగతులు నొకదాని కొకటి మిక్కిలి దూరమై పోవుచుండెను.

దరిమిలా, ౧౮-వ శతాబ్దిలో వచ్చిన ఫ్యాక్టరీపద్ధతులచే బీదలపరిస్థితి మరింత దుర్భరమాయెను. ఫ్యాక్టరీలు

రాకమునుపు వీరందరు ననేకవిధములగు చేతిపనులచే పొట్ట పోసికొనుచుండెడివారు. ఫ్యాక్టరీలు వచ్చుటతో గృహపరి శ్రమలన్నియు పూర్తిగా నశించెను. చేతిపనులు చేసికొని జీవించువా రందరు నిరుద్యోగులై కూలికొరకు ఫ్యాక్టరీల చుట్టు మూగసాగిరి. ఈకూలీల తండోపతండముల జూచి ఫ్యాక్టరీయజమానులు కూలికి బేరముపెట్టసాగిరి. సాధ్య మైనంతవరకు కూలిని తగ్గించుటయే పెట్టుబడిదారుల పని. ఫ్యాక్టరీపనికి పోటీ యెక్కువగుటచే కార్మికుడు పెట్టుబడి దారుని బేరమునకు లొంగిపోవలసినవా డాయెను. పెట్టు బడిదారులు ముందు గొప్పలాభములను పొందు నుద్దేశ్య ముతో కొంతకాలమువరకు ప్రస్తుతలాభములను వదలుకొ నగలరు. అనగా, తమఫ్యాక్టరీలను మూసి యుంచగలరు. పాపము, కార్మికునిస్థితి యట్టిది కాదు. ఏరోజున కారోజు తనకాయకష్టము నమ్ముకొని జీవించవలెను. పని లేని పూట పస్తుండవలసినదే. ఇట్టి పరిస్థితులలో పెట్టుబడి దారులకును, కార్మికులకును మధ్య సరసమగు ఒడంబడిక లెట్లు చేకూరగలవు? ఆపూటకు తిండికి లేని కూలివానికి వ్యక్తిస్వాతంత్ర్యమువల్ల ప్రయోజనమేమి? కడుపునిండి కూర్చున్న ఫ్యాక్టరీయజమానియెదుట నీగర్భదరిద్రుని బెట్టు ఎంతసే పుండగలదు? యజమాని కొంతకాలము వరకు తనవ్యాపారమును కట్టిపెట్టినను మించిపోయిన దేమియు లేదు. అట్లు కార్మికుడు తనయాకలిని కట్టి పెట్ట గలడా? కట్టిపెట్టినను ఎంతకాలము కట్టిపెట్టగలడు? ఈ కారణములచే కార్మికులు ఇచ్చినంతవరకే పుచ్చుకొని పలుకష్టముల బడవలసినవా రగుచున్నారు. ఈవిధముగా

భాగ్యవంతులు బీదలను కొల్లగొట్టుచున్నారు. బీదలు చెమటూడ్చి యుత్పత్తిజేసిన ధనధాన్యములను, వస్తువాహనములను, సర్వము గట్టుమీదగూర్చున్న భాగ్యవంతులు దిగమ్రింగుచున్నారు. పేరునకు వ్యక్తిస్వాతంత్ర్యమేగాని, నిజమునకది బీదల బానిసత్వమే యగుచున్నది. కలవారియెదుట లేనివారికి వ్యక్తిస్వాతంత్ర్యమువలన ప్రయోజనములేదు. నానాటికి బీద లెక్కువయగుటచే కూలికి పోటీ యెక్కువయగుచున్నది. దీనిచే కూలికి తగ్గుదలయేగాని పెరుగుదలలేదు.

ఇక పెట్టుబడిదారుల స్థితిని దీనికి పోల్చిచూచెదము. కార్మికుడు తన కాయకష్టముచే ప్రతిదినము కొన్నివస్తువులను తయారుచేయుచుండును. అట్లు తయారగు వస్తువుల విలువ కార్మికుడు పొందు కూలికంటె ఎన్నియోరెట్లు మిగిలియుండును. ఈలాభమంతయు ననవసరముగా, నక్రమముగా, నన్యాయముగా పెట్టుబడిదారుడే తీసికొనుచున్నాడు. ఉత్పత్తిజేయు ప్రతిపరిశ్రమయందు నీయన్యాయము జరుగుచున్నది. ఫ్యాక్టరీపద్ధతులవలన ఉత్పత్తి శీఘ్రముగాను, ఎక్కువగాను జరుగుటచే పెట్టుబడిదారులు బ్రహ్మాండమయిన లాభములను బొందుచున్నారు. కార్మికులుమాత్రము పొట్టకు చాలియు చాలని కూలితో మాడిపోవుచున్నారు. ఈవిపరీతపరిస్థితి మన ముపేక్షవహించినయెడల ఎప్పుడో యొకప్పుడు సంఘమునకు గొప్పవిపత్తును దెచ్చిపెట్టకపోదు. అట్టి విపత్తును రాకుండజేయవలెనన్న సంఘమున భాగ్యవంతులు బీదలు నను తారతమ్యమును తొలగింపవలెను.

అదియునుగాక వ్యక్తిస్వాతంత్ర్యపద్ధతియందు కా

యకష్టము చాలవరకు వృథాయైపోవుచున్నది. అనగా, సంఘమునకు నిరుపయోగమైన పనులకు వినియోగింపబడుచున్నది. పరిశ్రమలలోను, వ్యాపారములలోను పోటీ యెక్కువగుటచే ప్రతివ్యక్తి తనపరిశ్రమను, లేక వ్యాపారమును ముందుకు తీసికొనివచ్చి గొప్పలాభములను పొందవలయునని చేయు కృషియంతయు, సంఘమున కవసరములేని పనియే యగుచున్నది.

పై విమర్శయందు సత్యము లేకపోలేదు. వ్యక్తిస్వాతంత్ర్యవిధానము సంపూర్ణముగా నవలంబించిన యెడల సంఘ మధోగతిపాలగుట కెంతకాలమో పట్టదు. ఈవిషయమున నభిప్రాయభేద ముండనేరదు. అందుచేతనే, ప్రతిదేశమునందును ప్రభుత్వము వ్యక్తుల యార్థికవిషయములందు జోక్యము కలిగించుకొనుచున్నది. నేడు మనము గాంచెడి ఫ్యాక్టరీచట్టములు, కార్మికచట్టములు మొదలైనవన్నియు వ్యక్తిస్వాతంత్ర్యమునకు విరుద్ధములే. సామ్యవాదులదృష్టిలో నీచట్టము లన్నియు తాత్కాలికోపశమనములే గాని శాశ్వతచికిత్సలు కానేరవు. సంఘమున–భాగ్యవంతులు, బీదలు–అను విషమతారతమ్య మట్లే నిలిచియున్నది. ఇట్టి తారతమ్య మున్నంతవరకు సంఘమునకు శాంతిగలుగనేరదు. అంతవరకు నీరెండుతరగతుల మధ్య సంఘర్షణ తప్పదు. ఈతారతమ్యము నశించి సర్వసమత్వ మేర్పడినగాని సంఘమునకు మోక్షములేదు. సంఘర్షణ లేర్పడినపుడును, సమ్మెకట్టులు జరిగినపుడును కార్మికుల వేతనములు కొద్దిగా హెచ్చించి యెప్పటికప్పు డుపశాంతి జేయుట శాశ్వతశాంతికి వాయిదా వేయుటయే గాని మరియొకటి గాదు.

సమ్మెకట్టులు, సంఘర్షణలు, విప్లవములు మొదలైన వెన్నో జరిగి, యెంతమందో నశించిన వెనుక, యెంతధన మో వ్యయమైన వెనుక తొందరపడుటకంటె ముందే దూరదృష్టితో పరికించి సవరణచేసికొనుట ఎన్నియో రెట్లు మేలు. కావున సంఘమున నీతారతమ్య మవశ్యము తొలగించవలయును. ఈతారతమ్యమును తొలగించుటకు సామ్యవాదు లొక్కటే మార్గము గలదని చెప్పుచున్నారు

అది యెట్టిదో విచారించెదము. దీనినే సామ్యవాద నిర్మాణకార్యక్రమ మనుచున్నారు. భాగ్యవంతులు, బీదలు నను విషమ తారతమ్యము నశించవలె నన్న, శాశ్వతశాంతి యేర్పడవలె నన్న, సంఘము సమష్టిసహకారపద్ధతి నవలం బింపవలెను. దేశమున ఉత్పత్తికి సంబంధించిన పరిశ్రమ లన్నియు ప్రభుత్వవశమై యుండవలెను. వ్యక్తులకు కట్టుకొను వస్త్రములు, పరుపులు, పాత్రలు, తిండిదినుసులు మొదలగు యింటిసామానులు, ఇల్లు, కుటుంబము తప్ప వేరే సొంతఆస్తు లేమియు నుండఁగూడదు. ఉత్పత్తికి సంబంధించిన భూములు, ఫ్యాక్టరీలు, గనులు, సర్వము ప్రభుత్వమే స్వాధీనపరచుకొని కార్యమును నిర్వహించవలెను. ప్రభుత్వమునకు మినహా సంఘమున పెట్టుబడిదారు లుండకూడదు. వ్యక్తు లందరు కార్మికులే. ప్రభుత్వమే భూస్వామి, ధనస్వామి, పెట్టుబడిదారు. దేశమున నీవిధముగా ఉత్పత్తియైన వస్తువులను వ్యక్తు లందరికి సమానముగా ప్రభుత్వమే పంచిపెట్టవలయును. ఇట్టి పద్ధతిచే దేశమున ఉత్పత్తి వృద్ధియగును; సర్వజనులకు సమృద్ధిగా ఆహారము లభించును; సౌఖ్యము చేకూరును; సౌభ్రాతృత్వము, సమత్వము

నేర్పడును; శాశ్వతశాంతి గలుగును.

ఇదియే సామ్యవాదుల కార్యక్రమము. సామ్యవాదులలో కూడ రెండుమూడు తెగలవారున్నారు. పై పేరాలో తెల్పిన కార్యక్రమమును గలిగినవారు సామ్యవాదులలో తీవ్రవాదులు. వీరినే సమష్టివాదు (కమ్యూనిస్టు) లందురు. వీరిలో మరికొందరు వ్యక్తు లందరికి వారికష్టమునకు సమానజీతము లేర్పాటు చేయవలె నని చెప్పుచున్నారు. ఈ పై వాదన కెదురువాదన ఎట్టిదనగా:—సొంతఆస్తులు లేనిసంఘమున వ్యక్తికి పనిచేయవలెననెడి ఉత్సాహ ముండదు: ప్రతివానియందును సోమరితనము బలసిపోవును. తుదకు పరిశ్రమ లన్నియు క్షీణించి దేశమున ఉత్పత్తికూడ తగ్గిపోవును. సొంతఆస్తులు లేకపోవుటచే, వ్యక్తి తన శక్తిసామర్థ్యములను, తెలివితేటలను పూర్తిగా వినియోగించడు. కావున, పనిలో చాకచక్యము, నైపుణ్యము నశించును. ఈవిమర్శకు సామ్యవాదులసమాధాన మేమనగా సమష్టిసహకారపద్ధతియందు పనిచేయు కాలమును చాలవరకు తగ్గించుటకు వీలగును. అందుచే, పనియందు విముఖతగాని, విసుగుదలగాని యేర్పడదు. ఇట్టిది పోటీలతో పెనగులాడు పెట్టుబడిదారుల రాజ్యమున సాధ్యము కాదు గాని, కార్మికుల రాజ్యమున సాధ్యము కాగలదు. అదియునుగాక, సామ్యవాదసంఘమున నేర్పడు సోదరభావము, సహకారసఖ్యతలు, సంతృప్తి అట్టి సోమరితనమును, సంకుచితస్వభావమును పారదోలగలవు.

సామ్యవాదులలో మరియొక తెగవారు పై విమర్శను తప్పుకొనుటకు మరియొక పద్ధతిని చూపుచున్నారు.

ఇందు వ్యక్తియొక్క శక్తిసామర్థ్యములను బట్టియే జీతములు నిర్ణయింపబడును; ఉన్నతస్థానముల కర్హత నే ర్పడును. తక్కువ పనిచేయువాడు తక్కువజీతమును బొందును; ఎక్కువ పనిచేయువా డెక్కువ జీతమును బొందును. కాని, తక్కువ జీతముకూడ, వ్యక్తి సామాన్య జీవితావసరములకు మించియే యుండును. ఈపద్ధతి, పై ప్రభుత్వోద్యోగులు నిష్పక్షపాతులై, న్యాయమును పాలించువారైనయెడల చక్కగా పనిచేయగలదు. కాని, లంచములు బట్టుట, పక్షపాతము వహించుట,, స్వలాభములు గోరుట మొదలగు దుర్గుణముల కీయుద్యోగులు లోనైన యెడల వ్యక్తులకు తీరనినష్టము సంభవించును.

మరియొక తెగవారు సంఘమును దేశమునం దెన్ని పరిశ్రమ లున్నవో అన్నిభాగములు చేయవలె నను చున్నారు. వ్యవసాయదారు లందరు కలిసి యొకసంఘముగా నేర్పడి వ్యవసాయపరిశ్రమను సాగింతురు. ఇట్లే నేతపనివాం డ్రందరు కలిసి నేతపరిశ్రమను, గనులపనివాండ్రు గనులపరిశ్రమను కొనసాగింతురు. ఈకార్మిక సంఘము లన్నియు ఒకరివస్తువుల మరియొకరు మారకము ద్వారా పొందుచుందురు.

మొత్తముమీద, సామ్యవాద మొక్క-రష్యాదేశమున దక్క, మరెచ్చటను సంపూర్ణముగా స్వీకరింపబడియుండలేదు. రష్యాదేశమున సముష్టిసహకారపద్ధతి చక్కగా కొనసాగుచున్నదని మాత్రము చెప్పవచ్చును.

సమాప్తము.

---

ఆంధ్రభూమి ముద్రణాలయము వేపేరి, మదరాసు.

# స్వవిషయము

నేడు ప్రపంచము నన్నివిధముల నుఱ్ఱూతలూగించుచూ, ప్రతి దేశమందలి నిత్యజీవనమందు విపరీతమగు మార్పులజేయుచూ నవీన పరిణామమునకు దాగిచూపుచున్న నూతన భావ పరంపరలనూ, భారతదేశమందు ఆర్థిక రాజకీయ మతసాంఘికముగను, భాషా విషయకముగను జరుగుచున్న మార్పులనూ, యాంధ్ర పాఠక లోకమునకు చిన్న పుస్తకముల రూపమున సమర్పించుటయే మా యాశయము. మఱియు 'ఆంధ్ర సాహితీ దీపిక' యనుపేరుతో, నాంధ్ర భాషయందలి యత్యుత్తమ గ్రంథముల నూఱింటిని, 'ఆంధ్ర పురాణము' లను పేర అష్టాదశ పురాణములు వచన రూపముననను, 'ఆంధ్రమత దీపిక' యను పేర ప్రపంచమందలి యావన్మతముల గుఱించి పుస్తకములను క్రమపద్ధతిని గ్రంథమాల (Series) గా ప్రకటించుటయు మా సంకల్పము. వాణిజ్యము, పరిశ్రమలు, కళలు, మహా పురుష జీవితములుకూడ ప్రకటింపబడును. ప్రతి నెలకు రెండు పుస్తకములచొప్పునగాని, రెండునెలలకు నాల్గు పుస్తకములుగాని ప్రచురింపబడును. మాచే ప్రకటింపబడు ప్రతి పుస్తకము—డబుల్ క్రౌను ౧/౧౬ సైజున ౧౨౮ పేజిలలో, ౨౪ పౌనుల రఫ్ కాగితముతో నుండును. నయనానందకరముగ బైండింగు చేయబడును. ఇంకను మంచి కాగితము లుపయోగించుటకు యత్నములు జరుగుచున్నవి. పుస్తక మొకటింటికి ఆఱు అణాలు వెల ఏర్పరుపబడినది. ఒక సంవత్సరమునకు పైన జెప్పిన విధమున, ప్రకటింపబడు ౨౪ గ్రంథముల ఖరీదు మొత్తము రూ. ౯/- లగును. ఒకే సారి ముందుగా రూ. ౭/- లు పంపించువారికి పుస్తకములన్నియు నేరుగా పంపబడును. ఇంకను రూ. ౨/- లధికముగా యిచ్చువారికి, పుస్తకములన్నియు, ౩౬ పౌనుల బెంగాల్ ఆంటిక్ (Bengal antique) కాగితముల మీద ప్రత్యేకముగా ముద్రింపించి సప్లయి చేయబడును. సంవత్సర చందాదారుల కుపయోగించు దరఖాస్తు ఫారము నిందుతో పంపించుచున్నాము.

ఆంధ్ర మహాశయులెల్లరు, మా పుస్తకముల హెచ్చుగ నుపయోగించి మా యీ సంకల్పమును జయప్రదమొనర్చుటకు సాయముచేసెద రని నమ్ముచున్నాము.

నమ్మాళ్వార్స్, పోస్టుబాక్సు ౨౫౧, మద్రాసు.

మెసర్సు

నమ్మాళ్వార్సు కంపెనీవారికి,

పోస్టుబాక్సు ౨౫౧, మద్రాసు.

ఆర్యులారా!

మీరు ప్రచురించు గ్రంథములన్నియు (అనగా సంవత్సరమునకు ౨౪ గ్రంథములు) మాకు క్రమముగా సప్లయి చేయవలెనని కోరుచున్నాము. సంవత్సర చందా రూ. ౭/౯/-(ఏడు/తొమ్మిది రూపాయలు) మీకు యీ దినం మని యార్డరు/ పోస్టలు యార్డరు/చెక్కు ద్వారా పంపించినాము. చేరగనే రశీదు పంపించవలెను * [మీ ప్రకటన ప్రకారం రెండు రూపాయలు అధికముగ పంపించినాము. గనుక మాకు ఆంటిక్ కాగితపు సంపుటములు పంపించవలెను.] మా అడ్రెసు వివరములు యీ దిగువ యీయబడినవి.

చిత్తగించవలెను,

* రు. ౭/లు మాత్రమే పంపువారు దీనిని కొట్టివేయవలెను.

పుస్తకముల పంపించుటకు మా అడ్రెసు:

..................................................

..................................................

..................................................

..................................................

# ప్రజాభిప్రాయములు

'ఒక జాతియొక్క గౌరవం తన స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను నిలబెట్టుకోవడంలోనే వుంది. ఆ పూనికను నిలిపి దేశ గౌరవం కోసం ముందడుగు వేయించగల ప్రోత్సాహం ప్రతి వారికి కావాలి. ఈ గ్రంథాలు కొంతవరకా శక్తి నియ్యగలవు.'—కృష్ణాపత్రిక.

"అందరికి అందుబాటులోయుండే ఇంత చౌక ధరకు పుస్తకాలను ఇవ్వదలచినవారిని అన్నివిధాల ప్రోత్సహించడము తెలుగువారి విధి"—ప్రజామిత్ర.

"అందమైన గెటప్"—గోల్కొండ పత్రిక.

"ప్రకాశకులు ఇంతచవుకగా పుస్తకాన్ని ఆంధ్రులకు అందజేసినందులకు అభివందనములు. పుస్తకం చక్కగా అచ్చువేయబడింది. చూడటానికి చాలా అందంగా ఉంది. ఆంధ్రులీ ప్రకాశకులను ఆదరించుతారని నమ్ముచున్నాము."—వాహిని.

---

నమ్మాళ్వార్స్ పోస్టు బాక్సు ౨౫౧, మద్రాసు

# నమ్మాళ్వార్స ప్రచురణములు

'ఇట్టి గ్రంథమును ప్రకటించినందులకు ఇట్టివానినింకను ప్రకటింప నుద్యమించుచున్నందులకు నమ్మాళ్వార్లకు ఆంధ్రులు కృతజ్ఞులు.'—ఆంధ్రపత్రిక.

'జనసామాన్యమునకు సులభముగ బోధపడు శైలిలో ఉద్గ్రంథ పఠనకు నిట్టి గ్రంథములే దోహద మొసగగలవు. ........ ఇట్టి గ్రంథములు ప్రకటించినందులకు 'నమ్మాళ్వార్స' ప్రజలమన్ననలకు పాత్రులగుటలో విపరీత మేమి ?' గృహలక్ష్మి.

'నమ్మాళ్వార్స గ్రంథముల కూర్పుతీర్పులు ముచ్చటగా తయారుచేయబడుచున్నవి. వీరి ప్రచురణమునుబట్టి మంచిమంచి పుస్తకములు తయారుకానున్నట్లు గ్రహించుచున్నాము. ఈ యుద్యమము లోకప్రీతికరముగా నడుపవలయునని కోరుచు, వారిపూనికను అభినందించుచున్నాము.''—ఆంధ్ర వారపత్రిక.

'మద్రాసునందలి నమ్మాళ్వార్స కంపెనీవారు యిప్పుడు విజ్ఞానదాయకములగు గ్రంథముల ప్రచురణకు పూనుకొని ఆంధ్ర ప్రజాసంఘము కృతజ్ఞతకు పాత్రులగుచున్నారు''--ఆంధ్రభూమి.

'శ్రీనమ్మాళ్వారుగారు యువకులు ......వ్యుత్పన్నులు.. స్వయముగ ఆంగ్లాంధ్ర సంస్కృతములలో తగినంతకృషిచేసి, బహు గ్రంథావలోకనము చేసినారు .......సమయమునకు దగినట్టియు శాశ్వతముగ బ్రతియింటనుండ దగినట్టియు గ్రంథముల ప్రకటించినారు ఏభాషలోను నింతసుందరముగ నచ్చొత్తించిన గ్రంథము లింతవరకు వెలువడక లేదనిన నతిశయోక్తిగాదేమో ''—వ్యాసవి.

సశేషం.

# స్పెయిన్ దుస్థితి

'నేడు స్పెయినులో యేర్పడ్డ ప్రధానసమస్య అభివృద్ధియా, లేక వికృత స్వరూపముదాల్చిన ప్రతిఘాతమా? శాంతియు విజ్ఞానమా? లేక అనాగరికతా మృత్యువా? స్వల్పవ్యత్యాసంతో స్పెయిను, భారతవర్షము ఒక గాడిలోవున్న కారణముచేత మనకు స్పెయిను ప్రజలయందు సానుభూతి యుండవలసిన అవసర మెంతైనాయుంది'—భారతి

'కార్మికకర్షకోద్యమములలో బాల్గొనుచున్న మన యువతీ యువకుల కత్యుపయోగకారి యని నమ్ముచున్నాము. వారొకింత శ్రమచేసి, తమతమ యూళ్ల యందలి కార్మికులను కర్షకులను రావించి వారికీ గ్రంధమందలి వృత్తాంతమును సవిస్తరముగా నెఱిగించి ముందుముందు మనలనుకూడ తప్పక కలవరపెట్టు చున్న యీ ఫాసిస్టుసిద్ధాంతములు దురాగతములు వారికి చెప్పి యుంచుట మంచిదని హెచ్చరించుచున్నాము.'—ఆంధ్రపత్రిక

'అనేక యింగ్లీషు పుస్తకముల చదివినగాని బోధపడని యెన్నియో రాజకీయ విషయము లింగు సులభముగ నర్థమగు పద్ధతిని చిత్రితములైనవి'—వాసవి

"ఇలాంటి గ్రంథాలే నిజంగా కావాలీ రోజులలో"

కృష్ణా పత్రిక

# చీనా జపాను ప్రళయము

గ్రంథకర్త : వెల ఆరు అణాలు.

గాడిచర్ల హరిసర్వోత్తమరావు.—పోస్టేజి రెండు అణాలు.

"చీనా జపానుల మధ్య నేడు ప్రవర్తిల్లిన సంఘర్షణ పోను పోను ప్రపంచమహాయుద్ధంగా మారేసూచనలు అగుపడుతున్నాయి. వ్యావహారికంగ్గా యీనాటి చీనా జపాను పోరాటానికి యే కారణాల్ని మనం గణించుకొన్నప్పటికి ఆంతర్యంగామట్టుకు, జపాను వారి దుడుకుతనానికి హేతుభూతమైంది సామ్రాజ్య విస్తీర్ణానికి సంబంధించిన దురాశతప్ప వేరేకాదు. చీనా జపాను సమరగాథను హరిసర్వోత్తమరావుగారివంటి విజ్ఞానులు యిప్పట్లో రచించటం సమయోచితం.................... 'చీనా జపాను ప్రళయము' అనబడే యీ నూతనరచన...............౧౬ అధ్యాయాలలో చీనాను ఆధారంచేసికొని ఆసియాలోనూ, ఫసిపిక్కు మహాసముద్రంలోను తమతమ పలుకుబడిని నిలుపుకోవడానికి, జపాను బ్రిటన్, అమెరికా, ఫ్రాంసు, రష్యా మొదలైన రాష్ట్రాలు జరుపు నాటక సంవిధానాన్ని వివరించారు. శైలిసులభం, అంతర్ జాతీయ విషయాల్ని దేశభాషల్లో ప్రతివానికి అర్థమయే ఫక్కీని వ్రాయడానికి మంచి పరిజ్ఞానము విషయగ్రాహకశక్తి, మృదువైన శైలి ఆవసరం. హరిసర్వోత్తమరావుగారి వద్ద యివన్ని అమరియున్నవి." భారతి.

"కర్త........జగమెరిగిన బ్రాహ్మణుడు. రాజకీయవేత్త. ......చీనాజపాను దేశములకు సంబంధించిన అంతర్జాతీయ సమస్యల నన్నింటిని ఇంత విపులముగ చర్చించిన గ్రంథము యింగ్లీషునకూడ నొక్కచో గానరాదు. ఇది ప్రపంచ రాజకీయ విషయముల నవగాహన చేసికొనదలచిన ప్రతి హరిహస్తముల నలంకరించ దగిన గ్రంథము.——వాసవి.

# చీనా జపాను ప్రళయము

'చీనాజపాను మధ్య ప్రస్తుతం చెలరేగుతున్న యుద్ధం పుట్టు పూర్వోత్తరాల్ని వివరంగా తెలుపుతుందీ గ్రంథం. దీనిలో ఎంతైనా భోగట్టావుంది.'—ప్రజామిత్ర.

# ప్రకటన

మా పుస్తకములను ప్రతి గ్రామమందును విక్రయించగల విద్యావంతులు, సమర్థులునగు యువకులు ప్రతినిధులు కావలయును. మంచి కమీషన్ యివ్వబడును.

మద్రాసులోనుండు పుస్తములు దేనినైనను మీకు సప్లయి చేయగలము. ఇంకను లండన్, న్యూయార్క్, కలకత్తా పట్టణములందు ప్రకటింపబడు గొప్ప గొప్ప గ్రంథములకు కూడా ప్రాతినిధ్యము కలదు.

# గ్రంథకర్తలకు

మీ గ్రంథములు అచ్చుపడుటకు కావలసిన సదుపాయములను మేము చేయగలము. సలహాలివ్వగలము.

మీ గ్రంథములు, తెలుగు దేశమంతటను విక్రయించుటకు సహాయము చేయగలము.

ముద్రితా ముద్రిత గ్రంథముల వివరములతో వ్రాయవలెను.

వివరములకు :—

**నమ్మాళ్వార్స్** పోస్టుబాక్సు ౨౪౧, **మద్రాసు**

# శశాంక

'వెంకటచలంగారుకూడ యీ రచనా సాధనంలో ఆ పరం జ్యోతిలోని సత్యాన్ని అవగాహన చేసికొన్నాడంటే అతిశయోక్తి కాదు.........చలంగారి గ్రంథాలన్ని ఒకయెత్తు 'శశాంక' ఒకటి ఒకయెత్తు..............నాటకంగా...చక్కని శైలి రస పిపాసులకు అమూల్యమైనభిక్ష'—భారతి.

'బృహస్పతి' విశాలభావంవల్ల అసలు తారాశశాంకం గాధలోవుండే బూతు అంతాపోయి ఈ గ్రంథంలో, అన్న ఆదేరిన తన చెల్లెలివద్ద, భర్త పూజ్యురాలైన తనభార్యవద్ద, కొడుకు పతివ్రతానుతల్లి అయిన తనతల్లివద్ద నిరభ్యంతరంగా చదువవనగును.......... '........శశాంక వ్రాసిన కలంతో మనంతో మరికొన్ని గ్రంథాలు వెంకటచలంగారు వ్రాస్తే భాషా పోషకంగా వుంటుంది"—ఆంధ్రభూమి.

'కథావస్తువు ప్రాతదైనప్పటికిని నూత్నపద్ధతి సమన్వయము చేసి ఆధునికుల కమందానందము గొల్పునట్లు రచించినది' వాసవి.

"ఇంతవరకు గ్రంథకర్తకు వుండే కళంకాన్ని చాలవరకు పోగొట్టి, ఆంధ్ర సారస్వతంలో అపూర్వ పాత్రలపట్టికి మరికొందరిని చేర్చింది. భారత సంఘ మంతా ఏకగ్రీవంగా నీతిబాహ్యమన్న కథనే తీసుకొని అందులోనే అనురాధవంటి పాత్రను సృష్టించడమూ, యుగ యుగాలనుండి పనికిమాలిన వాళ్లలో ప్రథముడుగా లెక్కపెట్టబడిన బృహస్పతికి నిజమైన దివ్యత్వాం చేకూర్చ డమూ శశాంకలోని అద్భుత గుణాలు. గ్రంథకర్త కథాంశాలు వేరే ఎత్తుకుని, ఇటువంటి సృష్టి నింకా చేస్తే ఎంతో బాగుంటుంది"—గృహలక్ష్మి.

సశేషం.

# తిలోత్తమ - పాపయ్యా శర్మ

గ్రంథకర్త్రి: వెల ఆరు అణాలు.

కవితిలక పులవర్తి కమలావతి దేవి-పోస్టేజి రెండు అణాలు.

"ఈ గ్రంథంలో రెండు రచనలు చేర్చబడినవి.......... తిలోత్తమ - పాపయశర్మ ప్రత్యేకరచనలు............ కామినీ కాంచనములమీదగల దురాశాఫలితాల్ని స్పష్టపరుస్తున్నాయి. తిలోత్తమకంటె పాపయ్యాశర్మ రచనబాగున్నది. వస్తువు రచన యింపుగనున్నది." ...... "స్త్రీజాతి, మానవుల్లో నీచమైన కాముకప్రవృత్తి, సామ్రాజ్య విస్తీర్ణమనే దురాశ లేకపోతే మన భారతదేశ చరిత్ర నేడున్నంత అధోగతిలో వుండదు."—భారతి.

"చదువుటకు రెండు కథలును రమణీయముగానే యున్నవి. కవియిత్రి సుప్రసిద్ధురాలు."—ఆంధ్ర వారపత్రిక.

"కథాసంవిధానము పాత్రపోషణము శైలి మనోరంజకములగ నున్నవి."—వాసవి.

నమ్మాళ్వార్స  ౨౧, స్ట్రింగర్ ముత్యాలమొదలి వీధి,  మద్రాసు.

# మావద్ద దొరకు గ్రంథములు.

---

1. ఆధారములు

కార్మిక కర్షక జీవితముల తెలుపు
కథల సంపుటి. వెల ౬ అ.

2. యౌవనజ్వాల

మృదు మధుర శైలిని వ్రాయ
బడిన ఖండకావ్యము. వెల ౧౨ అ.

3. శ్రీమదాంధ్ర మహాభారతము

ఆదిసభారణ్య విరాటోద్యోగ
పర్వములు-937 పేజీలు-డెమ్మి
సైజు-క్యాలికో బైండింగు-చక్కని
కూర్పు. వెల రూ. ౨-౮-౦

4. భగవద్గీత

రావుసాహెబు బచ్చు పాపయ్య
శ్రేష్ఠిచే-ప్రతి శ్లోక భావము
తెనుగు పద్యరూపమున వ్రాయ
బడినది. "పద్యములు మృదు
మధుర శైలిలో వ్రాయబడినవి."
'ఆంధ్ర పత్రిక'-376 పేజీలు. వెల ౬ అ.

The Jupiter Press, Madras



వినోదమునకు
వివేకమునకు
విత్తమునకు–

పుస్తకములే
ముఖ్యసాధనములు

మీకేది కావలసినను

## సమూజ్యావర్స్

పోష్టు బాక్సునెం 251, మదరాసు